ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

సంపుటి 2 | సంచిక 4 జులై-సెప్టెంబర్, 2022

మమత-సమత-మానవత
www.gurajada.org

## ప్రాచీన సాహిత్యంలో సామాజిక స్పృహ



ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

మమత-సమత-మానవత
www.gurajada.org






















## మనవి

ప్రక్కన చూపిన ప్రకటన 1940 లో భారతి పత్రికలో పత్రిక యాజమాన్యం ఇచ్చిన ప్రకటన. 2021 లో, ప్రకాశిక పత్రిక కూడా ఈ ప్రకటనలో ఆశించిన స్వభావం గల రచనలను ఆహ్వానిస్తోంది. కాలం మారింది, సమస్యల స్వరూపం మారింది. కానీ, సమాజ శ్రేయస్సుకి ఉపయోగపడే సాహిత్య అవసరం మాత్రం ఇంకా ఉంది. చాలా ఉంది. మీలో ఉన్న గురజాడ తత్వాన్ని, చైతన్యాన్ని తట్టి లేపండి. మంచి రచనలు మాకు పంపండి.



Connect with us On Facebook : https://www.facebook.com/Prakasika1
Join us Via Telegram Prakasika telegram link : https://t.me/joinchat/SlYqileFRFSJ_zi_
Contact us: editor@prakasika.org

# ప్రకాశిక సంపాదక వర్గం



## ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ

ప్రధాన సంపాదకులు

పుట్టినది పశ్చిమగోదావరి జిల్లాలోని ఇరగవరం అగ్రహారం. పెరిగినది చాలా వరకు తణుకులో. తాడేపల్లిగూడెం కళాశాల నుంచి డిగ్రీ, ఉమ్మడి రాష్ట్ర రాజధాని భాగ్యనగరంలోని కేంద్రీయ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఎస్.సి., దేశ రాజధానిలోని ఢిల్లీ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఫిల్., పి.హెచ్.డి. చేశారు. గత 27 సంవత్సరాలుగా అమెరికాలో నివాసం. చాలా సంవత్సరాలు వైద్య విశ్వవిద్యాలయాలలో ఆచార్యులుగా కేన్సర్ వ్యాధికి సంబంధించిన అంశాలపై పరిశోధనలు జరిపారు. ప్రస్తుతం అంతర్జాతీయ ఫార్మస్యూటికల్ కంపెనీలో కేన్సర్ మందులు రూపొందించే శాస్త్రవేత్తగాను, హ్యూస్టన్ లోని టెక్సాస్ విశ్వవిద్యాలయంలోని వైద్యశాస్త్ర విభాగంలో అనుబంధ ఆచార్యులుగానూ పనిచేస్తున్నారు. అంతర్జాతీయ కేన్సర్ పరిశోధనలకి సంబంధించిన అంతర్జాతీయ పత్రికకి ప్రధాన సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు. మాటల మాలలల్లడం ప్రవృత్తి. అడపాదడపా రాసిన కవితలు, కథలు, వ్యాసాలు ఒకచోట కూర్చి "మనస్వినీయం" అన్న పేరుతో ఇటీవల ఒక పుస్తకం ప్రచురించారు.



## మా శర్మ

గౌరవ సంపాదకులు

మా శర్మగా సుపరిచితులైన మాచవరం వేంకట చెంచురామ మారుతి సుబ్బరాయశర్మ 1967 సంవత్సరం నవంబర్ 29వ తేదీన గుంటూరు జిల్లా, నరసరావుపేటలో జన్మించారు. పాత్రికేయులు, కాలమిస్ట్‌గా ప్రసిద్ధులు. తెలుగువారికి సొంతమైన అవధాన ప్రక్రియ, ఆశుకవిత్వంలో అగ్రగణ్యులు, ఆరాధ్యులైన కొప్పరపు కవులు మా శర్మగారికి మాతామహులు. ఆ మహాకవుల పేరిట శ్రీ కొప్పరపు కవుల కళాపీఠాన్ని 2002లో స్థాపించారు. వారి విగ్రహాలను విశాఖపట్నం సాగరతీరంలో, నరసరావుపేటలో స్థాపించారు. కొప్పరపువారి సాహిత్యాన్ని సేకరించి దొరికినంత వరకూ గ్రంథస్థం చేశారు. ప్రతియేటా శ్రీ కొప్పరపు కవుల ప్రతిభా పురస్కారాలు ప్రదానం చేస్తున్నారు. ప్రముఖులు పీసపాటి నరసింహమూర్తి, వేటూరి సుందరరామ్మూర్తి, మల్లాది చంద్రశేఖరశాస్త్రి, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం, నేదునూరి కృష్ణమూర్తి, కె.విశ్వనాథ్, బేతవోలు రామబ్రహ్మం, మేడసాని మోహన్, గరికిపాటి నరసింహారావు, మాడుగుల నాగఫణిశర్మ, పి.సుశీల, సిరివెన్నెల సీతారామశాస్త్రి మొదలు

ఎందరో తెలుగు, జాతీయ కవులు, కళాకారులు ఆ పురస్కారం అందుకున్న వారిలో ఉన్నారు. ప్రస్తుతం ఆంధ్రపత్రిక దినపత్రికకు కన్ సల్టింగ్ ఎడిటర్ గా పాత్రికేయ సేవలు అందిస్తున్నారు. ఎన్నో ఏళ్ల నుండి మీడియాలో ఉన్నారు.



## శ్రీమతి గురజాడ అరుణ

నిర్వాహక సంపాదకులు

గురజాడ వేంకట అప్పారావుగారి ముని మనుమరాలు శ్రీమతి గురజాడ అరుణ. ముంబైలో పుట్టి పెరిగిన వీరు IT రంగంలో ప్రాజెక్ట్ మేనేజర్ గా పనిచేస్తున్నారు. ముత్తాతగారి అకాల మరణంతో అసంపూర్ణంగా మిగిలిపోయిన వారి సాహితీ సేవలు, సంఘ సంస్కరణ కార్యక్రమాలను ముందుకు తీసుకెళ్ళే క్రమంలో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపించారు. గురజాడ వారి పేరిట ఎన్నో సేవా కార్యక్రమాలు చేస్తూ ముత్తాతగారి స్మృతిని చిరస్థాయిగా ఉంచుతున్నారు.



## శ్రీ గురజాడ రవీంద్రుడు

సంపాదక సలహాదారు

గురజాడ వేంకట అప్పారావుగారి మునిమనుమడు శ్రీ గురజాడ రవీంద్రుడు. 2014లో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపనలో ముఖ్య భూమిక పోషించారు. ఫౌండేషన్ లక్ష్యాలను, ఆశయాలను ముందుకు తీసుకెళ్ళడంలో చురుకైన పాత్ర పోషిస్తూ ముత్తాతగారి అడుగుజాడల్లో పయనిస్తున్నారు. గురజాడ ఫౌండేషన్ (అమెరికా) ఇండియన్ చాప్టర్ కు ప్రెసిడెంట్ గా వ్యవహరిస్తున్నారు.



## శ్రీ విహారి

సంపాదక సలహాదారు

విహారి అనే కలం పేరుతో సుప్రతిష్ఠులైన శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు 1941లో తెనాలిలో జన్మించారు. వీరు 12 కథాసంపుటాలు, 15 విమర్శనాత్మకమైన వ్యాస సంపుటాలు, ఒక వ్యాస కదంబం, 7 నవలలు, 5 కవితా సంపుటాలు, ఒక దీర్ఘ కథాకావ్యం- పుస్తకాల రూపంలో వెలువరించారు. అన్ని ప్రసిద్ధ తెలుగుపత్రికలలోనూ 300కి పైగా వీరి రచనలు ప్రచురితమయ్యాయి. వివిధ పత్రికల్లో పరిచయాలూ-పరామర్శలు, బతుకు గీతలు, కథావిహారం వంటి శీర్షికలనూ నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కా రం, అజో విభో కందాళం ఫౌండేషన్ (AVKF) వారి జీవన

సాఫల్య పురస్కా రం, ఆం.ప్ర భాషా దినోత్సవ పురస్కా రం, తె.వి.వి.కీర్తి పురస్కా రం లాంటి ఎన్నో ప్రతిష్ఠాత్మకమైన పురస్కా రాలు అందుకున్నారు. ఎల్.ఐ.సి.లో జనరల్ మేనేజర్ గా పదవీ విరమణ చేసి, హైదరాబాద్ లో నివాసం ఉంటున్నారు.



## ఆచార్య వెలమల సిమ్మన్న

సంపాదక సలహాదారు

బహుముఖ ప్రజ్ఞాశాలిగా వాసికెక్కిన ఆచార్య వెలమల సిమ్మన్నగారు 1955 సంవత్సరం మార్చి 1వ తేదీన శ్రీకాకుళం జిల్లా, జలుమూరు మండలం, తిమడాం గ్రామంలో జన్మిం చారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్, స్కూల్ఆ ఫ్ డిస్టెన్స్ ఎడ్యుకే షన్ లో తెలుగుశాఖలో అధ్యాపక ధర్మం నిర్వర్తిం చారు. భాష, సాహిత్యం, వ్యాకరణం, భాషా శాస్త్రం, విమర్శ, పరిశోధన మొదలైన రంగాలకు సంబంధించి 83 గ్రంథాల్ని రాశారు. 440కి పైగా పరిశోధన పత్రాలు ప్రముఖ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. 160కి పైగా వివిధ సెమినార్లలో హాజరై పరిశోధన పత్రాల్ని సమర్పించారు. 50కి పైగా రేడియో ప్రసంగాలు చేశారు.



## ఆచార్య గుమ్మా సాంబశివరావు

సంపాదక సలహాదారు

తెలుగు సాహిత్యంలో ప్రముఖ విమర్శకులుగా, పుస్తక సమీక్షకులుగా, అన్నింటికీ మించి మంచి అధ్యాపకునిగా పేరొందిన గురువర్యులు ఆచార్య గుమ్మా సాంబశివరావుగారు. స్వగ్రామం గుంటూరు జిల్లాలోని వేజెండ్ల. 2018లో ఆంధ్ర లయోలా కళాశాలలో తెలుగు శాఖాగ్రణిగా పదవీ విరమణ చేశారు. మహాకవి గురజాడ 150వ జయంతి కానుకగా 2011 డిసెంబరులో కన్యాశుల్కంలో హాస్యం పేరుతో ఓ గ్రంథాన్ని ముద్రించారు. 2012 డిసెంబరు 27,28,29 తేదీల్లో తిరుపతి నగరంలో నాలుగో ప్రపంచ తెలుగు మహాసభలను పురస్కరించుకుని తెలుగు అకాడమీ వారు ఆచార్య గుమ్మా సాంబశివరావు రచించిన తెలుగువాఙ్మయ చరిత్ర-రచయితలు అనే గ్రంథాన్ని ముద్రించారు. నూటముప్ఫైకి పైగా వివిధ పత్రికల్లో వ్యాసాలు, 150 కి పైగా పుస్తక సమీక్షలు, 60 కి పైగా ఆకాశవాణిలో ప్రసంగాలు అనేక జాతీయ అంతర్జాతీయ వేదికల మీద వివిధ అంశాల మీద ప్రసంగాలు, సాంబశివరావుగారి విస్తృత ప్రతిభకి తార్కాణం. సాంబశివరావు గారు అనేక జాతీయ, అంతర్జాతీయ సన్మానాలు, సత్కారాలు పొందారు. ఏ అంశంపైనైనా అనర్గళంగా ప్రసంగించే వీరి సామర్థ్యాన్ని గుర్తించి అనేక సాహిత్య పీఠాలవారు 'ప్రసంగప్రజ్ఞా నిధి', 'ఉపన్యాసకేసరి' వంటి బిరుదులతో సత్కరించారు.



## డా.సి. భవానీదేవి

సంపాదక సలహాదారు రచయిత్రి, విమర్శకురాలు

ఆంధ్రప్రదేశ్ సచివాలయం నుంచి ప్రభుత్వ ఉప కార్యదర్శి గా పదవీ విరమణ చేశారు. 15 కవితా సంపుటులు, వివిధ ప్రక్రియల్లో 51 గ్రంథాలు వెలువరించారు. వీరి పలు కవితలు, కథలు ఇతర భాషల్లోకి అనువదించబడ్డాయి. డాక్టర్ సి. భవానీదేవి పలు అవార్డులు, ప్రశంసలు అందుకున్నారు. ఆకాశవాణి, ప్రసారభారతి జాతీయ స్థాయిలో ప్రతి ఏటా ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించి ప్రసారం చేసే జాతీయ కవి సమ్మేళనంలో భాగంగా 2019 సంవత్సరానికి తెలుగు కవయిత్రిగా ఎంపికయ్యారు.



## డా. రేవూరి అనంత పద్మనాభ రావు

సంపాదక సలహాదారు

పద్మనాభరావు వందకుపైగా అష్టావధానాలు చేశారు. 120 గ్రంథాలు ప్రచురించారు. అందులో నాలుగు కథా సంపుటాలు, నాలుగు నవలలు, 12 అనువాదాలు, 11 జీవితచరిత్రలు, 12 సివిల్స్ పరీక్షల గ్రంథాలు, పరిష్కరణలు, వ్యాఖ్యలు, పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. వీరి రచనలపై నాలుగు విశ్వవిద్యాలయాల నుండి ఆరుగురు పరిశోధక విద్యార్థులు ఎం.ఫిల్. / పి.హెచ్. డి. డిగ్రీలు సంపాదించారు. పద్మనాభరావుకు 1993లో తెలుగు విశ్వవిద్యాలయ అనువాద పురస్కా రము, 2000లో కేంద్ర సాహిత్య అకాడమీ అనువాద పురస్కా రం లభించాయి. ఢిల్లీ తెలుగు అకాడమీ, మదరాసు తెలుగు అకాడమీ సనాతన ధర్మచారిటబుల్ ట్రస్టు తదితర అవార్డులు పొందారు. కందుకూరి రుద్రకవి రచనలపై పి.హెచ్.డి. చేశారు. 1967లో కందుకూరు ప్రభుత్వ కళాశాల అధ్యాపకులుగా ఉద్యోగ జీవితం ప్రారంభించి 1975 నుండి 2005 వరకు ఆకాశవాణి, దూరదర్శన్ లో పదవీ బాధ్యతలు మూడు దశాబ్దాలు నిర్వహించి, ఢిల్లీ అదనపు డైరెక్టర్ జనరల్ గా పదవీ విరమణ చేశారు. 2005 - 10 మధ్య తిరుమల తిరుపతి దేవస్థానంలో పనిచేసి శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్ కు అంకురార్పణ దశలో కృషి చేశారు. కంచికామకోటి పీఠాధిపతి వీరిని ఆస్థాన విద్వాంసులుగా సత్కరించారు. అమెరికా, యు.కె, జర్మనీ దేశాలలో పర్యటించి ఉపన్యసించారు. 1200 వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురించారు. 74 సంవత్సరాల పద్మనాభరావు హైదరాబాదులో స్థిరపడ్డారు.



## డా. నాగసూరి వేణుగోపాల్

సంపాదక సలహాదారు

దేశవ్యాప్తంగా తొమ్మిది ఆకాశవాణి కేంద్రాలలో సుమారు ముప్పైయి మూడు సంవత్సరాలుగా పనిచేస్తూ మరోవైపు రచయితగా, కాలమిస్టుగా, సంపాదకునిగా డా. నాగసూరి వేణుగోపాల్ ఇంతవరకు 60 పైగా పుస్తకాలు వెలువరించారు.అనంతపురం జిల్లా కొనతట్టు పల్లిలో 1961లో జన్మించిన నాగసూరి ఎస్వీయూ నుంచి ఫిజిక్స్‌లో ఎం.ఎస్సీ., ఎం.ఫిల్., తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయంలో జర్నలిజంలో పి.హెచ్.డి. గడించారు. పరిశీలన, పరిశోధన, ప్రణాళికతో ఆకాశవాణి కార్యక్రమాలు నిర్వహించిన నాగసూరి రేడియో పరిచయ కార్యక్రమ నిర్వహణలో పేరుపొందడమే కాక 'ఆదివాసీ అంతరం', 'శతవసంత సాహితీ మంజీరాలు', 'వెలుగుజాడ', 'అన్నమయ్య పదగోపురం', 'జీవనబింబం', 'చిత్తూరు జిల్లా జీవన చిత్రం' వంటి విలువైన కృషి ద్వారా చిరకాలం నిలబడే ముద్ర వేశారు. విజ్ఞానశాస్త్రం, సాహిత్యం, పత్రికారంగం, ప్రసారమాధ్యమాలు, చరిత్ర, భాష వంటి విషయాలపై పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. గురజాడ, తాపీ, పొట్టి శ్రీరాములు, నార్ల, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, జి.వి.కృష్ణారావు, విద్వాన్ విశ్వం వంటి వారి పరిశోధనాత్మక పుస్తకాలు వెలువరించిన నాగసూరి 'సాహితీ వీక్షణం', 'సాహితీ స్పర్శ' వంటి విమర్శనా గ్రంథాలు కూడా రచించారు. 20వ శతాబ్దం ముగుస్తున్న వేళ విజయవాడ ఆకాశవాణి ద్వారా మూడేళ్ళ పాటు పరిచయం చేసిన శతాబ్దపు వంద ఉత్తమ తెలుగు గ్రంథాల గురించి వెలువరించిన 'శతవసంత సాహితీ మంజీరాలు' అత్యంత విలువైన సంకలనం. ఇంకా సాహిత్య అకాడమీకి 'సైన్స్ ఫిక్షన్' 'వైజ్ఞానిక కథలు', అలాగే 'కథావరణం', 'మదరాసుబదుకులు' కథా సంకలనాలను మిత్రులతో కలిసి వెలువరించారు. 'స్థానిక మూలాలు', 'విస్మృత ప్రముఖులు', 'జానపదకళలు', 'హెచ్.ఐ.వి./ఎయిడ్స్', 'ఆదివాసుల జీవితం', 'ఇతర ప్రాంతాల తెలుగువారు', 'అన్నమయ్య' వంటి అంశాలపై దృష్టి నిలిపి కృషి చేసిన వేణుగోపాల్ ప్రస్తుతం తెలుగువారు విస్మరించిన గాంధీ తత్వంలోని ప్రయోజనకరమైన కోణాలను వివరించడానికి తన బృందంతో కలసి శ్రమిస్తున్నారు. వీరి ప్రస్తుత నివాసం హైదరాబాదు.



## ఆచార్య గార్లపాటి దామోదర నాయుడు

అతిథి సంపాదకులు

ఆచార్య గార్లపాటి దామోదర నాయుడు గారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి ఏం. ఏ, ఎం.ఫిల్. పట్టాలు, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం నుంచి పి. హెచ్. డి పట్టా పొందారు.. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం లో ఆచార్యులుగాను, శాఖాద్యక్షులుగానూ పదవులు నిర్వహించారు. ఆయన పర్యవేక్షణలో 32 మంది పి. హెచ్. డి పట్టాలు, 6 మంది ఎం.ఫిల్. పట్టాలు పొందారు. ఆయన ఆయన ఎన్నో గ్రంధాలు రచించడంతో పాటు జాతీయ, అంతర్జాతీయ సదస్సులలో ప్రసంగించారు. ఆచార్య గార్లపాటి దామోదర నాయుడు గారికి నటనలోఆసక్తితో పాటు అభినివేశం కూడా ఉంది. తిరుమల తిరుపతి దేవస్థానం నిర్వహించే ఎన్నో ఆధ్యాత్మిక, సాహిత్య కార్యక్రమాలలో నాయుడు గారు క్రియాశీలక పాత్ర పోషించారు.

ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

మమత-సమత-మానవత
www.gurajada.org

## ధన్యోస్మి



ప్రకాశిక జులై-సెప్టెంబర్ 2022 సంచిక "ప్రాచీన సాహిత్యంలో సామాజిక స్పృహ" అనే అంశం మీద ఒక ప్రత్యేక సంచికగా మీ ముందుకు వస్తోంది. పాత కొత్తల మేలు కలయికగా సంతరించుకుంటున్న ప్రకాశికని ఆదరిస్తున్న అశేష తెలుగు భాషాభిమానులకీ, సాహితీవేత్తలకీ కైమోడ్పులు.

అతిథి సంపాదకులుగా సమర్థవంతంగా ఈ సంచికని తీర్చిదిద్దిన ఆచార్య గార్లపాటి దామోదర నాయుడు గారికి హృదయపూర్వక ధన్యవాదాలు. పలువురు సాహిత్యవేత్తలతో ప్రామాణికమైన పరిశోధనాత్మక వ్యాసాలు ప్రకాశిక కోసం ప్రత్యేకంగా రాయించి ప్రకాశిక పత్రిక ప్రమాణాలు మరింత ఇనుమడించేలా చేసిన ఆచార్య గార్లపాటి దామోదర నాయుడు గారికి ప్రకాశిక సంపాదక వర్గం అభినందనపూర్వక కృతజ్ఞతలు తెలుపుతోంది.

ఆచార్య గార్లపాటి దామోదర నాయుడు గారిని నా తరపున సంప్రదించి, ఒప్పించిన మిత్రుడు ఆచార్య జి. ఎస్. మోహన్ గారికి ప్రత్యేక ధన్యవాదాలు.

ఈ ప్రత్యేక సంచికలో ప్రచురణ కోసం మంచి వ్యాసాలు ప్రత్యేకంగా రాసి పంపిన రచయితలకు శతకోటి నమస్సులు.

వ్యాసాలలోని అక్షర దోషాలని వెదికిపట్టి సరిచేసిన శ్రీ సంపర శ్రీనివాస రావు గారికి ధన్యవాదాలు.

ఈ సంచిక వెలువరించడంలో ప్రత్యక్షం గానూ, పరోక్షం గానూ సహకరించిన వారందరో, వారందరికీ వందనములు.

భవదీయుడు
ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ
ప్రధాన సంపాదకులు






# అమృత భారతికి ఆశాంజలి

స్వతంత్ర భారతికి 75 వసంతాలు నిండిన సందర్భంగా దేశ విదేశాలలో ఉన్న భారతీయులందరికి శుభాభినందనలు. ఒకసారి 75 సంవత్సరాల పంచాంగం సింహావలోకనం చేసుకుంటే సాధించిన అపారమైన అభివృద్ధి కరతలామకంగా కనిపిస్తుంది. అభివృద్ధి చెందిన దేశాలతో పోటీ పడుతూ, అభివృద్ధి చెందుతున్న దేశాలకి దిక్సూచిగా, మార్గదర్శిగా నిలిచే పథంలో భారత్ మంచి ప్రగతిని సాధించింది. ఎన్నో రంగాలలో పురోగమించి అంతర్జాతీయ ప్రగతి పటంలో తళుక్కుమనేలా పురోగమిస్తోంది. 200 సంవత్సరాలు దాస్యంలో మగ్గిన భారతావనికి స్వయం పాలనలో 75 సంవత్సరాలు పురోగమనాన్ని కొలవడానికి అంత పెద్ద వ్యవధి కాదు. గడచిన 75 సంవత్సరాలలో ఎన్నో రంగాలలో సాధించిన అభివృద్ధికి గర్వపడుతూ, ప్రగతి యానంలో ఎదురైన అవరోధాలని నెమరు వేసుకుని, భవిష్యత్తులో వాటిని ఎదుర్కొనే ప్రణాళికలు వేసుకునే తత్వం అవసరం ఎంతైనా ఉంది. ప్రగతి నిరంతరం సాగే ప్రయాణం. గమ్యం కాదు. 250 సంవత్సరాలకి పైబడి ఏర్పడ్డ అమెరికా సంయుక్త రాష్ట్రాల తో పోల్చుకుంటే మనం సాధించిన ప్రగతి తక్కువ కాదు. ముఖ్యంగా సర్వ మానవ సమానత్వాన్ని బోధించి మార్గ దర్శకం చేసిన మహాత్మా గాంధి, అంబేత్కర్ లాంటి మహనీయులు ఉండడం భారత దేశానికి కలిగిన అదృష్టం.

భారతావని 75 సంవత్సరాల అపూర్వ, అపురూప ప్రగతి పథంలో పాలుపంచుకున్న వారికి, నడిపించిన నాయకులకి నీరాజనాలు తప్పక

సమర్పించాలి. 75 సంవత్సరాలలో జరిగిన అభివృద్ధి ఏ ఒక్కరి వల్లనో, ఏ ఒక్క దశాబ్దంలోనో జరిగినది కాదన్నది సత్యం. ఎప్పుడు, ఎంత ఏ ఏ రంగాలలో అభివృద్ధి జరిగిందనే గణాంకాలు పొందటం అంతకష్టం కాదు. స్వాతంత్ర్యం వచ్చిన తొలినాళ్ళలో రూపొందించిన విధానాలు, వ్యవస్థలు, సంస్థలు భారత ప్రగతికి బీజం వేశాయనడం అతిశయోక్తి కాదు. ముఖ్యంగా అన్ని అగ్ర రాజ్యాలలోనూ భారతీయులు మంచి ఉద్యోగాలలో విరాజిల్లుతున్నారంటే, ఐ.ఐ.టి., ఐ.ఐ.ఎం. లాంటి ఉన్నత విద్యా సంస్థల స్థాపన, విద్యకి ప్రాధాన్యత ఇవ్వడం, అందరకి అందుబాటులో ఉండేలా ప్రభుత్వ విద్యా సంస్థల స్థాపన కొన్ని ముఖ్య కారణాలు. వీటితో పాటు, శాంతి కాముక, లౌకిక సమాజంగా భారత దేశం ప్రపంచ వ్యాప్తం గా పేరుపొందడం తక్కువ విషయం కాదు. మనతో పాటే స్వాతంత్ర్యం సాధించిన పొరుగు దేశం గడించిన ప్రగతి, అంతర్జాతీయంగా సాధించిన గుర్తింపుతో పోల్చుకుంటే భారత దేశ పురోగతి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. సైద్ధాంతిక విభేదాలు ఎన్ని ఉన్నా, వాస్తవాన్ని అంగీకరించే వారెవరికైనా నిజాంకాలు ఈ సత్యాన్ని నిరూపిస్తాయి. 1950 ప్రాంతంలో నాటిన ఆదర్శ, పురోగామి, సమానత్వ విత్తనాలు మొలకెత్తి, పంటనిచ్చి, విస్తృతి చెంది నిరంతరం ఫలితాలను ఇచ్చే అక్షయ పాత్రలుగా వెలుగొందడం కళ్ళముందు కనిపించే సత్యం. ఆ విత్తనాలు నాటినవారు నెహ్రూ, గాంధీ కుటుంబ సభ్యులు కావచ్చు. వారు వామపక్ష వాద సానుభూతి పరులు కావచ్చు. ప్రగతికి రాజకీయ రంగులతో పనిలేదు. పురోగతికి పార్టీ జెండాల ఆసరా అవసరం లేదు. చరిత్రని వక్రీకరించకుండా భారతదేశం సాధించిన అభివృద్ధిలో పాలుపంచుకున్న వారిని స్మరించుకోవడం సంస్కారం, అది సనాతన ధర్మ నియమం, రామాయణ సందేశం.

గాంధీ, నెహ్రూ వంశానికి వెలుపల నుండి ప్రాధేయపడకుండా వచ్చిన పదవిని చేపట్టి క్లిష్ట భారతిని "సంక్షేమ" భారతిగా రూపొందించిన ప్రతిభామూర్తి శ్రీ పి.వి నరసింహారావు గారిని తలవని, సముచితంగా గౌరవించని అమృతోత్సవం స్వకుచ మర్దనం లాంటిది. చేసిన మేలు మరిచే జాతి జీవం లేని జవం లాంటిది. వారసత్వం, ఓటు బ్యాంక్, సంస్థాగత మద్దతు లేని పి. వి.కి జాతి రుణపడి ఉంది. ఈ భారత రత్నాన్ని అమృతోత్సవాల సందర్భంగా గుర్తించడం ఎంతైనా అవసరం.

గతంలో జరిగిన ప్రగతిని బేరీజు వేసుకుంటూ, భవిష్యత్తు ప్రణాళికని రూపొందించగల నైపుణ్యం ఉన్న వారే నాయకులు. ప్రగతి మాత్రమే కాక, లోటు పాట్లని గుర్తించి సవరించుకోగల విజ్ఞత ఉన్నవారే మహా నాయకులు.

"మౌన ముని" గా ముద్ర వేయబడిన ప్రధాని విశ్రమించి సుమారు ఎనిమిది సంవత్సరాలు అయింది. ఈ ఎనిమిది సంవత్సరాలలో జరిగిన నిజమైన అభివృద్ధి, నినాదాల వెనుక దాగిన నిష్క్రియాపరత్వాన్ని బేరీజు వేసుకునే అవకాశం భారత ప్రజల ముందు ఉంది. వాగ్దానాలను నెరవేర్చడంలో సఫలం అయ్యారా లేక వాగ్దానాలకే పరిమితం అయ్యారా అన్నది రోజు వారి కూలీతో జీవితం గడిపే అధిక జనం నిర్ణయించగల పరిస్థితి లేదు. వారు ఎన్నికల సమయంలో వచ్చే "ఈనాము"లకు గులాములు. కనీస అవసరాలు తీరి, ఆలోచించగల జాగృతిగల వారు ఈ

విషయాల మీద ఆలోచించి పది మందిని జాగృతం చేయవలసిన అవసరం ఉంది.

ఏ ప్రజాస్వామిక దేశమైనా ప్రగతి పథంలో మనుగడ సాగించాలంటే పటిష్టమైన, స్వయంప్రతిపత్తి గల, పారదర్శకంగా, జవాబుదారీతో, వ్యవహరించే వ్యవస్థలు, సంస్థలు అవసరం. రాజకీయ వ్యవస్థలో నైతిక విలువలని పునరుద్ధరించి పరిరక్షించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. టైమ్స్ ఆఫ్ ఇండియాలో వచ్చిన వ్యాసం ప్రకారం, 2019 లో పార్లమెంటుకి ఎన్నికైన 539 సభ్యులలో 233 మందికి నేర చరిత్ర ఉంది. ఈ సంఖ్య 2009 గణాంకాలతో పోలిస్తే 44 శాతం ఎక్కువ. ఇక రాష్ట్ర చట్ట సభల సంగతి ఊహించవచ్చు. నేర చరిత్ర ఉన్నవారు సామాన్య ప్రజల జీవితాలని ప్రభావితం చేసే చట్టాలు చేస్తూ ఉంటే ఆ చట్టాలకి విలువ ఏముంటుంది ? అసలు చట్టం మీద గౌరవం లేని వారికి చట్ట సభలకి పోటీ చేసే అర్హత ఉండాలా? చట్టసభలకి ఎన్నికైన వారికి చట్టం చుట్టంగా మారి, వారికి ప్రత్యేక హక్కులు కల్పిస్తోంటే, కేసుల నుంచి రక్షించుకోడానికి నేరస్తులు నేతలుగా మారడంలో ఆశ్చర్యం ఏముంది? పలు కేసులు చిర కాలంగా ఎదుర్కొంటున్న నేరస్తులు మంత్రులుగా, ముఖ్యమంత్రులుగా అధికారం చెలాయిస్తూ నేర సామ్రాజ్యాలని విస్తరిస్తోంటే, చట్టాలకి, చట్టసభలకి విలువ ఏముంటుంది ? ఆర్థిక నేరస్తుల విచారణ సత్వరం, ఒక్క సంవత్సరంలోనే పూర్తయ్యేలా ప్రత్యేక కోర్టులు నెలకొల్పుతామన్న ఉద్ఘాటన మరో నినాదంగానే మిగిలినట్టుగా అనిపిస్తోంది. రాజకీయ వ్యవస్థ మరింత దిగజారితే ఆ ప్రభావం సమాజంలోని అన్ని వ్యవస్థలమీద, అన్ని వర్గాల మీద పడుతుందన్న విషయం వేరే చెప్పనవసరం లేదు. రాజకీయ వ్యవస్థని ప్రక్షాళణం చేసేదెవరు? బుద్ధ జీవులా? విసిగెత్తిన సామాన్య జీవులా? శ్రీలంకలో జరుగుతున్న పరిణామాలు మితిమీరిన రాజకీయ, ఆర్థిక అవినీతి పేరుకుపోతున్న దేశాలకి కనువిప్పు కలిగించాలి.

వ్యక్తులకి గానీ, సంస్థలకి గానీ అన్యాయం జరిగినప్పుడు న్యాయస్థానాలని ఆశ్రయించడం రివాజు. రాజకీయ పదవులలో ఉన్న వారు కేసుల విచారణకి కోర్టుకి హాజరు కాక పోయినా, న్యాయస్థానాల తీర్పుని ధిక్కరించినా ఎలాంటి చర్యలూ తీసుకోలేని స్థితిలో న్యాయ వ్యవస్థ ఉండడం బాధాకరం. రాజకీయ పదవులు నేరస్తులకి రక్షణ కవచాలు కాకుండా, వారిమీద ఉన్న కేసులని సత్వరం, నిర్దిష్ట వ్యవధిలో విచారణ చేసి శిక్షలు అమలు జరిగేలా చూసే బాధ్యత న్యాయవ్యవస్థ మీద, ప్రధాన న్యాయమూర్తుల మీద ఉంది. కోర్టు ధిక్కరణ కేసులలో పడే శిక్షలని అమలు చేయడానికి ఒక ప్రత్యేక పోలీసు బలగం ఉండడం ఎంతో అవసరం.

ప్రభుత్వంలో భాగమైన శాసన శాఖ నిర్వహించే రాజకీయ నాయకత్వం మారుతూ ఉంటుంది కానీ కార్యనిర్వాహక శాఖ నిరంతరంగా ఉంటుంది. కార్యనిర్వాహక శాఖలో పనిచేసే ఉన్నతాధికారులు రాజ్యాంగానికి కట్టుబడి, నిర్భయంగా, నిజాయితీగా పనిచేయాలి. అలా పనిచేసే అధికారులు లేకపోలేదు. ప్రభావవంతమైన శాఖలలో అలాంటి వారి అవసరం ఎంతైనా ఉంది. ఐ.ఏ.ఎస్. అధికారులకి ఉద్యోగ భద్రత ఉంది. రాజకీయ నాయకులు వారిని అవాంఛనీయ ప్రదేశాలకి బదిలీ చేయవచ్చు గానీ ఉద్యోగంలోంచి తొలగించలేరు. కానీ, ఐ.ఏ.ఎస్.లు ఎన్నో ప్రలోభాలకీ, వత్తిళ్లకి తలొగ్గడం ఎక్కువగా చూస్తున్నాం. దురదృష్ట వశాత్తూ, మంత్రుల వత్తిడితో చేసిన నిర్ణయాలకి న్యాయస్థానాలు కొన్ని రాష్ట్రాలలో కొన్ని శాఖల అధికారులకి జైలు శిక్ష సయితం

విధించడం ఈ మధ్య చూస్తున్నాం. ఈ దుస్థితి పూర్తిగా స్వయం కృతమే. ఈ మధ్య ఒక టీవీ ఛానల్ కి ఇచ్చిన ఇంటర్వ్యూ లో ఒక మాజీ ప్రధాన కార్యదర్శి కొన్ని ఆసక్తికర వ్యాఖ్యలు చేశారు. ఏ రాష్ట్రంలో అయినా ఐ.ఏ.ఎస్. అధికారుల లో కనీసం ఇరవై శాతం మంది నియమాలకి లోబడి, మంత్రుల వత్తిడిని ప్రతిఘటించ గలిగితే నాయకుల ఆగడాలకి అడ్డుకట్ట పడుతుందని ఆ ప్రధాన కార్యదర్శి అభిప్రాయపడ్డారు. ఎంతో కష్టపడి ప్రవేశ పరీక్షలలో నెగ్గి, ఉన్నత ఉద్యోగాలు సంపాదించిన ఐ.ఏ.ఎస్.లు ఆదర్శాలతో కాక, అధికారం, హోదాల వెంట పడడం దురదృష్టం. నిజానికి, పెద్దగా జీతంరాని ఉద్యోగానికి అహర్నిశలూ ఎందుకు కష్టపడతారు? ఆదర్శవంతమైన ప్రజాసేవ చేయడానికేనని అందరూ చెబుతారు. ఉద్యోగంలోకి చేరాక ఆదర్శాలు అవసరాలకి, హోదాకి తలొగ్గుతాయా? ఐ.ఏ.ఎస్.ల ఎంపిక విధానం సమాజ హితం కోరేవారు, సమాజ సేవాతత్పరత కలవారిని గుర్తించే విధంగా లేదు. వివిధ అంశాల గురించిన సమాచారం, కొన్ని విషయాల మీద కొంత అవగాన ప్రాతిపదికన ఎంపిక జరుగుతుంది. వ్యక్తిత్వ పరీక్ష మౌఖిక పరీక్షలో పరిమితంగా ఉంటుంది. సమాజ సేవాతత్పరతకి ప్రాముఖ్యం ఉండదు. చదువుకునే రోజుల నుంచి సామాజిక సేవాకార్యక్రమాలలో పాల్గొనడం ఐ.ఏ.ఎస్. ల నియామకాలకి ఒక ప్రాతిపదికగా ఉంటే బాగుంటుంది. నిరూపించగల, ప్రభావవంతమైన సమాజ సేవ చేసిన వారికి ప్రవేశ పరీక్షలో కొన్ని మార్కులు కేటాయిస్తే సేవాతాత్పరత గల వ్యక్తులు ఐ.ఏ.ఎస్. లు గా వచ్చే అవకాశం ఎక్కువ ఉంటుంది.

ప్రజాస్వామ్య వ్యవస్థ పటిష్టం గా ఉండడానికి నిస్పాక్షికంగా, స్వేచ్ఛగా వ్యవహరించగల వార్తా పత్రికలు, ప్రసార మాధ్యమాలు చాలా అవసరం. సుమారు మూడు దశాబ్దాల పూర్వం వరకు, ప్రభుత్వ అధీనంలో నడిచే దూరదర్శన్ ద్వారా మాత్రమే వార్తలు ప్రజలకి అందేవి. అందులో నిస్పాక్షికతకి ఎక్కువ ఆస్కారం ఉండేది కాదు. ఇప్పుడు ప్రైవేట్ రంగంలో నడిచే ప్రసారమాధ్యమాలు పార్టీల వారీగా విడిపోవడం, పార్టీలకి అనుబంధంగా నడిచే కొన్ని ఛానెల్స్ ఉండడంతో రంగులు లేని వార్తలు, విశ్లేషణలు కొరవడుతున్నాయి.

దురదృష్ట వశాత్తు, అగ్ర రాజ్యంతో సహా, చాలా ప్రజాస్వామ్య దేశాల పాలకులలో నిరంకుశ ధోరణులు పెరుగుతున్నాయి. అలాంటి వారికి మద్దతు ఇచ్చే ప్రజల సంఖ్య కూడా పెరుగుతోంది. అలాగే, అవినీతి, వ్యవస్థలు నిర్వీర్యం అవడం కూడా ప్రపంచ వ్యాప్తంగా చూస్తున్నాం. ఇవి పొంచి ఉన్న ప్రమాద సూచికలు.

దేశ సర్వతోముఖాభివృద్ధికి యువత నడుంకట్టడం ఎంతైనా అవసరం. భారత జనాభాలో యువకుల సంఖ్య ఎక్కువ. హేతుబద్ధంగా ఆలోచించడం అలవరచుకుని, ప్రతీ అంశాన్ని నిశితంగా విశ్లేషించి అభిప్రాయాలు ఏర్పరుచుకోవాలి. భారత యువత ప్రపంచానికి ఆదర్శంగా నిలిచి, లోక నాయకులుగా ప్రకాశించాలి. అదే భారత మాతకి ఇవ్వగల నిజ నీరాజనం.

భవదీయుడు
**ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ**
ప్రధాన సంపాదకులు

## ముఖచిత్రం

ప్రాచీన సాహిత్యంలో
సామాజిక స్పృహ




# లోపల

## ముందు మాట



## ప్రాచీన సాహిత్యంలో సామాజిక స్పృహ



## ప్రత్యేక వ్యాసాలు

# ప్రకాశిక- ప్రవేశిక



ముందుగా, ముమ్ముందుగా ప్రకాశిక పత్రిక సంపాదక వర్గానికి కైమోడ్పులు. తెలుగు సాహిత్యరంగానికి సంబంధం లేని వృత్తులతో జీవనం సాగిస్తూ, సాహిత్య రంగాన్ని ప్రవృత్తిగా మార్చుకున్న సంపాదక వర్గ సభ్యుల లో తెలుగు నేలలో ఉంటున్న వారు, ఎక్కడో తెలుగు నేలకు సుదూరంగా నివశిస్తున్న వారూ ఉన్నారు. వీరందరికీ ధన్యవాదాలు చాలా చిన్నమాట అవుతుంది. తెలుగు నేలమీద తెలుగు భారతి రోజురోజుకు క్షీణించిపోతూ, కన్నీళ్ళు కారుస్తూ తన కన్నీళ్ళు తుడిచే తెలుగువాడే లేడని బాధపడుతున్న రోజులలో సప్త సముద్రాల కొనలనుండి 'మేమున్నాము తల్లీ, నీకన్నీళ్ళు తుడిచి నిన్ను ఆనందింపజేస్తామని' భరోసాను కల్పిస్తున్న ప్రవాస తెలుగు సాహితీ అభిమానులకి, భాషాభిమానులకీ హృదయపూర్వక కృతజ్ఞతలు. ప్రకాశిక సంపాదక వర్గానికి నాయకత్వం వహిస్తున్న కొవ్వలి గోపాలకృష్ణ గారికి అభినందనలు.

రెండు తెలుగు రాష్ట్రాలలో సాహిత్య సంబంధీకులైన మేధావులు అనేకమంది రెండు వర్గాలుగా కనిపిస్తున్నారు. ప్రాచీన సాహిత్యానికి సంబంధించి ఎక్కడైన కార్యక్రమం జరుగుతూ వుంటే అక్కడికి ఒక వర్గంవారు పోరు. పోకపోగా పాతచింతకాయ పచ్చడి అని విమర్శిస్తూ ఉంటారు. మరొకచోట ఆధునిక సాహిత్య సభ జరుగుతూ వుంటే మరొక వర్గం వారు కలసిరారు. ఆ కవిత్వమంతా పసలేనిది అని నిందిస్తుంటారు. కీ.శే. కందుకూరి వీరేశలింగం పంతులు గారు సాహిత్య చరిత్ర వ్రాస్తూ అవగాహన కోసం యుగ విభజన చేస్తూ 'చివరి ఆధునిక యుగం' అని పేరు పెట్టారు. అంతేకాని ఎక్కువ తక్కువల ప్రసక్తి లేదు. తరువాత వచ్చిన సాహిత్య చరిత్రకారులందరు ఎన్ని మార్పులు, చేర్పులు చేసినా చివరి యుగాన్ని ఆధునిక యుగంగానే గుర్తించారు. సాహిత్యంలో అనేక ప్రక్రియలు వస్తూనే ఉంటాయి. కండగల రచనలు నిలుస్తాయి. మిగిలినవి కాలగర్భంలో కలసిపోతాయి. ఇప్పటికి లభిస్తున్న సాహిత్యానికంటే కాలగర్భంలో కలసిన సాహిత్యమే అధికంగా ఉండి ఉంటుంది. సాహిత్యాన్ని చదువుకోవడానికి, అవగాహన చేసుకోవడానికి యుగ విభజన అవసరం కావచ్చు కాని ఎక్కువ తక్కువలు నిర్ణయించడానికి మాత్రం

కాదు అని సాహితీకారులందరూ గుర్తించాలి. ఆచార్య సి. నారాయణరెడ్డి గారు ఒక గొప్ప సత్యాన్ని చెప్పారు. 'పాలను బాగా వేడి చేస్తే మీగడ వస్తుంది. మీగడ చాలా రుచిగా ఉంటుంది. అంతమాత్రం చేత మీగడ గొప్పది, పాలు తక్కువ అని భావించరాదు. పాలుంటేనే మీగడ వస్తుంది అనే నిజాన్ని గ్రహించాలి. పాలు లేకపోతే మీగడ ఏర్పడే అవకాశమే లేదు. ప్రాచీన సాహిత్యం పాలవంటిది. దానిని చదివి జీర్ణం చేసుకుంటేనే మీగడ వంటి కవిత్వాన్ని సృష్టించగలం'. ఈ మాటలు ప్రతి సాహితీవేత్త గుర్తుంచుకోవాలి.

ఇంత ఎందుకు చెప్పానంటే 'ప్రకాశిక' పత్రిక అటు ఆధునిక సాహిత్యానికి, ఇటు ప్రాచీన సాహిత్యానికి మాత్రమే గాక జానపద సాహిత్యానికి, కీర్తన సాహిత్యానికి, నాటక సాహిత్యానికి, కథా, కథానిక, నవల వంటి ప్రక్రియలకు స్థానం కల్పిస్తూ సంకుచిత మనస్తత్వం గలిగిన కొందరు సాహితీ వేత్తలకు కనువిప్పు కలిగిస్తూ ఉంది. సాహిత్య రంగానికి ఈ పత్రిక నిర్వాహకులు చేస్తున్న సేవకు ఐదు పది చేయడం నా కర్తవ్యంగా భావిస్తున్నాను.

శ్రీయుతులు గోపాలకృష్ణగారు నన్ను సంప్రదించి ప్రాచీన సాహిత్యంలో ప్రతిబింబించే సామాజికాంశాలపై కొందరి చేత వ్యాసాలు వ్రాయించి పంపమన్నారు. నేనొక ప్రణాళిక తయారుచేసుకొని పురాణ, ఇతిహాస, ప్రబంధాలు, శతక, చాటు కవితలు కూడా ఉండేటట్లు చూసుకొని, ఆయా విషయాలలో నిష్ణాతులైన వారితో సంప్రదించాను. తగిన పారితోషికం లేకుండా వ్యాసాలు వ్రాయడం జరగదని మొహమాటం లేకుండా కొందరు సెలవిచ్చారు. వారికి ధన్యవాదాలు. మరికొందరు పైకి వ్రాస్తామని అంగీకరించి రోజులు గడుస్తున్నా కోర్టులో కేసులు వాయిదావేసినట్లుగా వాయిదాలు వేసి నా నోటితో నేనే 'మీకు టైం లేకుంటే వేరేవాళ్ళతో వ్రాయించుకుంటాను' అని అనేటట్లు చేసి తప్పుకున్నారు. వారికి ........

ప్రస్తుతం వెలుగుచూస్తున్న వ్యాసాలను సకాలంలో పంపిన వారందరికి నమస్సులు. కొందరు నేను సూచించిన 'శీర్షిక' ను కాదని విషయానికి తగినట్లుగ శీర్షిక నామాన్ని మార్చి పంపారు. వారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ ప్రతిక నిరాఘాటంగా, నిరాటంకంగా, నిశ్చలంగా, నిర్భయంగా కలకాలం వెలుగుచూడాలని ఆశిస్తూ ఆ శక్తిని సమయాన్ని సంపాదకవర్గానికి ప్రసాదించమని కలియుగ దైవం శ్రీ వేంకటేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

ఆచార్య గార్లపాటి దామోదర నాయుడు
అతిథి సంపాదకులు
✆ 78939 82500

# ఇతిహాసాలు భారతీయ సంస్కృతి



ఆచార్య గార్లపాటి దామోదరనాయుడు
✆ 78939 82500

"శ్రీ విష్ణోః ప్రథమే కాంతే జగజ్జనన హేతు తా
ద్వితీయే స్థితి హేతుత్వం తృతీయే మోక్షదాయి తా
చతుర్థే గుణ సంపత్తిః పంచమే సర్వహర్తృతా
షష్ఠీ వేదాంత వేద్యత్వం సప్తమే స్రష్ట హేతుతా
ఏవం విష్ణుః పరం తత్వం రామాత్యేతి సునిశ్చితః"

శ్రీమతి మాన్య వాచకంతో స్త్రీ రత్నాలను, శ్రీమాన్ గౌరవవాచకంతో పురుష శ్రేష్ఠులను, శ్రీమత్ మర్యాద వాచకంతో ఉత్తమ గ్రంథాల్ని పేర్కొనడం భారతీయ సంస్కృతీ సంప్రదాయాలలో భాగం. శ్రీమత్ అనే పూర్వ విశేషణంతో భారతీయులు ప్రశంసించే గ్రంథాలు ప్రధానంగా మూడు. అవి ఒకటి గృహస్థ ధర్మ ప్రతిపాదిత రామాయణము. రెండవది సమాజ ధర్మ ప్రతిపాదిత భారతము. మూడవది మోక్షధర్మ ప్రతిపాదిత భాగవతము.



పై మూడు గ్రంథాల ప్రాశస్త్యాన్ని కొందరు పండిత విమర్శకులు భారత జాతీయ పుష్పమైన, పద్మంతో పోల్చి వివరించారు. పద్మం నీటిపై తేలుతూ చూపరులకు హృదయానందాన్ని కలిగిస్తుంది. పద్మం నీటిలో తేలి ఉండడానికి ఆధార భూతమైనది కాండం. ఆ కాండం బలోపేతం కావడానికి ఆధారం వ్రేళ్ళు. ఆ వ్రేళ్ళనే పర్వాలని కూడ అంటారు. పద్మం,

కాండం, ప్రేళ్ళు, యివన్నీ సజీవాలై ఉండడానికి మూలాధారం స్కంధం.

అనగా, భారతీయ సంస్కృతి పద్మమైతే, దానికి ఆధార భూతమైన కాండం కుటుంబ జీవన మార్గం. కనుకనే గృహస్థ ధర్మమే ముఖ్యంగా ప్రతిపాదికమైన రామాయణము, కాండాలుగా విభజింపబడింది. కేవలం కుటుంబమే సంస్కృతిని కాపాడలేదు. సమర్థనీయమైన సమాజం కావాలి. కనుకనే ముఖ్యంగా సామాజిక ధర్మాల్ని ప్రతిపాదింపజేసిన భారతము పర్వాలుగా విభజింపబడింది. ('పర్వ' శబ్దానికి ప్రేళ్ళు అని కూడ అర్థం ఉంది).

మానవుడు చివరికి అభిలషించేది మోక్షాన్ని. ఆ మోక్ష ప్రతిపాదిత గ్రంథం భాగవతం, స్కంధాలుగా విభజింపబడింది. ఈ విధమైన అన్వయక్రమంతో భారతీయ సంస్కృతికి మూలాధారాలైన మూడు గ్రంథాలు నిర్మింపబడినాయి. అందుకే కొందరు పండితవిమర్శకులు రామాయణాన్ని ఉదయాన్నే, అనగా చిరుప్రాయంలోనే అధ్యయనం చేయాలని, భారతాన్ని మధ్యాహ్న సమయంలో, అనగా మధ్య వయస్సులో అధ్యయనం చేయాలని, భాగవతాన్ని సాయం సంధ్యలో, అనగా వృద్ధాప్యంలో అధ్యయనం చేయాలని అన్నారు.



ఆ ఇతిహాసాలు మానవ అంతర జీవితానికి సంబంధించిన హృదయ భావాలను అధికంగా వర్ణించాయి. ప్రాచీన సాహితీకారుడు కథ అనే తీపి పదార్థంతో వైద్యానికి పనికి వచ్చే మందును నింపి శ్రోతలకు, లేదా పాఠకులకు అందించాడు. మానసిక వ్యాధిగ్రస్తులైన శ్రోతలకు లేదా పఠితులకు వ్యాధిని పోగొట్టేది మందే. కొందరు ఆ మందును గ్రహించలేక ఆ మందుపైన పూయబడిన కథ అనే తీపి పదార్థాన్ని మాత్రమే గ్రహిస్తారు. అట్టి వారికి ఆనాటి సాహిత్యం ఈనాడు పనికిరానిదిగా కనిపిస్తుంది. లౌకిక విషయాలకన్నా అలౌకిక ఆనందాల విషయాలనే ప్రాచీనులు ఎక్కువగా ప్రస్తుతించారు. అలౌకిక ఆనందానికి లౌకిక జీవన విధానం ఎలా ఉండాలో మన ఐతిహాసికులు చక్కగా వివరించారు. మన ఐతిహాసికులు ఏది చెప్పినా, సమస్త ప్రపంచ మానవాళిని దృష్టిలో పెట్టుకునే చెప్పినారు అని అనడానికి, మన వివాహ సందర్భాల్లో చెప్పే శ్లోకం ఒకటి గమనింప తగినదై ఉంది.

"శ్లో॥ పంచాదశ కోటి యోజన విస్తీర్ణే భూమండలే, లక్షయోజన విస్తీర్ణే జంబూద్వీపే.." అని అంటారు. అంటే 50 కోట్ల యోజనాలు విస్తీర్ణంగా భూమండలం, లక్షయోజనాల విస్తీర్ణంగా జంబూద్వీపం భావించబడ్డాయి. అంటే మన ఐతిహాసికులు ప్రతిపాదించిన సంస్కృతి, భావ సమైక్యత ఇంత సువిశాలమైన స్థలంలోని మానవుల జీవన ప్రగతిని దృష్టిలో పెట్టుకొని చెప్పిందే అని మనం గ్రహించాలి.

వాత్స్యాయనుడు చెప్పిన ఒక విషయం ఇక్కడ గమనింపదగినదై ఉంది.

శ్లో॥ శతాయుర్వై పురుషో విభజ్యకాలమన్యోన్యానుబద్ధమ్
పరశ్వరక్షానను ఘాతుకం త్రివర్గం సేవేత......"

అంటే మానవుడు తన జీవితకాలాన్ని ప్రత్యేకంగా విభజించుకొని ఒకదానితో ఒకటి విరుద్ధం కాని విధంగా పేర్చుకొని ధర్మార్థ కామాలు అనే పురుషార్థాల్ని సేవించాలని అతని భావం. బాల్యమందు విద్యాగ్రహణార్థ అర్థాల్ని, యవ్వనమందు ధర్మబద్ధమైన కామాన్ని, వార్ధక్యమందు ధర్మమోక్షాన్ని సేవించాలని వాత్స్యాయనుని అభిమతం.



భారతీయ సంస్కృతిని ప్రతిబింబించే నిలువుటద్దాలుగా మనకు రెండు స్పష్టమైన గ్రంథాలు కనిపిస్తాయి. ఒకటి కావ్యేతిహాసమైన రామాయణము, రెండు శాస్త్రేతిహాసమైన భారతము. వీటిని నిశితంగా పరిశీలిస్తే, ఆ కవులు సమస్త జాతికి బోధించింది చతుర్విధ పురుషార్థాలు, చతురాశ్రమ ధర్మాలు అని తెలుస్తుంది. ఈ పురుషార్థాలు, ఆశ్రమధర్మాలు సక్రమంగా పాటిస్తే ప్రతి మానవుడు తనంతట తాను సుఖపడుతూ సమాజం సుఖపడేటట్లు చేయగలడని ఆ కవులు భావించినట్లు తెలుస్తుంది. రామాయణ భారత గ్రంథాల ఆధారంగా తరువాతి కాలంలో ఎన్నో కావ్యాలు మరెన్నో ప్రక్రియా భేదాలతో సాహిత్యం వికసించింది. సనాతన సాహిత్యం ప్రతిపాదించిన భారతీయ సంప్రదాయానికి భారతీయ జీవన విధానానికి ఎక్కువగా వ్యత్యాసం కనిపించదు. ఏ వ్యక్తిగాని తన జీవన ప్రయాణంలో మరొక వ్యక్తి జీవితానికి ఆటంకంకాని, ఆపదకాని కలిగించకుండా మనుగడ జరపాలన్నదే

భారతీయ జీవన విధానం. అదే భారతీయ సంస్కృతి. ఐహిక, ఆముష్మిక అంశాలను సమన్వయించుకొని ఆధ్యాత్మిక సౌందర్యాన్ని పెంపొందించుకొని, రజస్తమోగుణాల్ని అణచిపెట్టుకొని సత్వగుణ ఆలోచనల్ని పెంపొందించుకొని జీవన ప్రయాణం చేయడమే భారతీయ జీవన విధానం, భారతీయ సంస్కృతి.



ఈ వాత్స్యాయనుడు చెప్పిన అంశాలనే రామాయణ భారతాలు కథల ద్వారా వివరించాయి. చతుర్విధ పురుషార్థాలలో మన ఐతిహాసికులు మోక్షమే జీవిత లక్ష్యంగా వుండాలని సమస్త జాతికి ఉద్బోధించారు. కామార్థాల కంటే ధర్మానికి అధిక ప్రాధాన్యమిచ్చారు. మానవుని స్వవిధులను, ఇతరుల పట్ల తాను నిర్వర్తింప వలసిన బాధ్యతలను నిర్దేశించేది ధర్మం. ధర్మార్థకామాలకు ఘర్షణ జరిగినపుడు అర్థం చేత సాధింపబడే కామానికంటే అర్థమే గొప్పదని, ధర్మం చేత అర్థం సాధింపబడుతుంది కాబట్టి ధర్మమే గొప్పదని మన ఐతిహాసికుల అభిప్రాయం. పండితార్థమేమంటే చతుర్విధ పురుషార్థాలలో ధర్మం, మోక్షం, వరనీయాలని తెలిపేది భారతీయ సంస్కృతి.

చతుర్విధ పురుషార్థాలతోబాటు చతుర్విధ ఆశ్రమ ధర్మాల్ని మన ఇతిహాసాలు వివరించాయి. అందు మొదటిది బ్రహ్మచర్యం. అనగా ఇది పూర్తిగా విధ్యాభ్యాసకాలం. రామాయణములో గురువు వద్దకు శిష్యులు వెళ్లి విద్యాభ్యాసం చేయడాన్ని మనం గమనించవచ్చు. అందుకే దశరథ తనయుల మధ్య రాజ్యంకోసం కలహాలు లేవు. బ్రహ్మచర్యాశ్రమంలో విద్యతోపాటు సామాజిక స్థితిగతులు తెలుసుకుంటూ సంస్కారాన్ని కూడ వారు పెంపొందించుకున్నారు. భారత కాలం నాటికి బ్రహ్మచర్యాశ్రమ ధర్మంలో కొంత మార్పు వచ్చింది. గురువు వద్దకు శిష్యులు వెళ్లి విద్యను నేర్చుకోవడానికి బదులు గురువులను తమ వద్దకు పిలిపించుకొని విద్య నేర్చుకోవడం కనిపిస్తుంది. అందుకే సంస్కారం కొంతవరకు తగ్గిపోయింది. దీని కారణంగా అన్నదమ్ముల బిడ్డల మధ్య రాజ్యంకోసం పోరాటం మనకు కనిపిస్తుంది. అన్నదమ్ముల మధ్య ఐక్యతయే భారతీయ సంస్కృతి.

మన ఐతిహాసికులు చెప్పిన రెండవ ఆశ్రమం గృహస్థాశ్రమం. అన్ని ఆశ్రమాలకు ఆధారమయింది గృహస్థాశ్రమం. అతిథులను పూజించడం

అనేది భారతీయ సంస్కృతియని మన ఇతిహాసాలు నినదించాయి. "సర్వదేవమయోఅతిదిః" అని మనుస్మృతి చెప్పింది. ఈ విషయాలనే అనేకానేక కథల ద్వారా మన ఇతిహాసాలు మనకు అందించాయి. గృహస్థాశ్రమ ధర్మం నిర్వీర్యం కావడమే సమాజ అనైక్యతకు మూలకారణం. ఈ అనైక్యతయే, భారతీయ సంస్కృతికి పెద్ద గొడ్డలి పెట్టు. ప్రస్తుతం మనం మన గృహస్థాశ్రమ ధర్మాల్ని కాపాడుకోగలిగితే భారతీయ సంస్కృతిని పరిరక్షించుకున్న వారమౌతాము.

మూడవది వానప్రస్థాశ్రమం. ఇది ఒకరకంగా ఈనాటి వృద్ధాశ్రమాల వంటిది. వానప్రస్థాశ్రమం స్వీకరించినవారు, గృహస్థాశ్రమ వాసులకు మార్గనిర్దేశం చేస్తూ ఉండాలి. అపుడే సమాజం చక్కని పద్ధతిలో ముందుకు సాగుతుంది.

చివరిది సన్యాసాశ్రమము ఇది మోక్షప్రాప్తికై నిర్దేశింపబడింది. ఈవిధంగా మన ఇతిహాసాలు ఒక చక్కని మానవ జీవిత విధానాన్ని నిర్దేశించి, ఆవిధంగా జీవించమని ఉపదేశించాయి. ఆ మార్గంలో పయనించేంతవరకు భారతీయ సంస్కృతికి ఏ లోపం ఉండదు. సంస్కృతిని కాపాడు కుంటున్నంత కాలం సమాజం శాంతియుతంగా కొనసాగుతుంది. అందుకే ప్రతి భారతీయుడు, మన సంస్కృతిని కాపాడుకోవడానికి ప్రయత్నించాలి.



రెండు ఇతిహాసాలలోని వ్యక్తులందరూ చాలవరకు ఈ ఆశ్రమ ధర్మాల్ని పాటించినవారే. పాశ్చాత్యులకు మనవారికి ఆత్మతత్త్వంలో భిన్నాభిప్రాయాలున్నాయి. మన ఐతిహాసికులు ఆత్మకు అగ్రపీఠం వేస్తే పాశ్చాత్యులు బుద్ధిని గద్దెనెక్కించినారు.

భగవద్గీతలో దేహం కన్నా ఇంద్రియాలు, ఇంద్రియాలకన్నా మనస్సు, మనస్సు కన్నా బుద్ధి, బుద్ధికన్నా ఆత్మ శ్రేష్ఠమని చెప్పబడింది. ఆత్మకు నాశనం లేదని ఐతిహాసికుల సిద్ధాంతం. ఆత్మ సత్తు, దేహం అసత్తు అనే ఈ సిద్ధాంతం పైన మన ఇతిహాసాలు నిర్మింప బడ్డాయి.

ఎపుడు మానవుడు ఈ సిద్ధాంతానికి బద్ధుడవుతాడో, అపుడు స్వార్థం నశిస్తుంది. తద్వారా ప్రాణులంతా ఒక్కటేననే భావన కలుగుతుంది. ఇదే మన ఐతిహాసికులు ప్రతిపాదించిన భారతీయ సంస్కృతి.

భారతీయ సంస్కృతిలో సత్యాన్ని మించిన ధర్మం మరొకటి లేదని "నానృతాత్పాతకం పరమ్" అని అన్నారు. ఈ సందర్భంలో వృద్ధ చాణక్య శతకంలోని ఒక శ్లోకం గమనింపదగి ఉంది.

శ్లో॥ సత్యేన ధార్యతే పృధ్వీ సత్యేన తపతీ రవి !
సత్యేన వాయువో వాంతి సత్యేసర్వం ప్రతిష్ఠితమ్ ||

సత్యం చేతనే భూమి ధరింపబడి ఉంది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. గాలులు వీస్తున్నాయి. ఇంతయేల సర్వం సత్యాన్ని ఆధారంగా చేసుకొని నిలచి ఉంది.

భారతీయ సనాతన ధర్మం గట్టిగా చెప్పిన విషయం ఒకటి ఇక్కడ గమనించాలి.

సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్ సత్యమప్రియమ్
ప్రియంచ నానృతం బ్రూయాత్
ఏషధర్మస్సనాతనః"

సత్యాన్ని చెప్పండి. ప్రియమైన మాటలు మాట్లాడండి. అప్రియమైన మాటలు సత్యాలే అయినా చెప్పకండి. అట్లని ప్రియమైన మాటలు గదా అని అసత్యాన్ని చెప్పకండి అని పై వాక్యాల భావం.

ఆదికావ్యమైన రామాయణము త్రేతాయుగం నాటి కథ. అపుడు ధర్మం మూడుపాదాల మీద నిలబడి ఉంది. "సత్యం" అనే పాదం అప్పటికి గట్టిగానే ఉంది. అందుకే భారత భాగవతాలల్లో చెప్పినంత విపులంగా రామాయణంలో సత్యవాక్పరిపాలనను గూర్చిన విషయాలు లేవు. అయినా ఒక విషయం మనం గమనింపవచ్చు. దశరథుడు కైకకు వరాలు ఇచ్చిన విషయం, ఆ ఇరువురికీ తప్ప మరెవ్వరికి తెలియదు. ఇది కారణంగా దశరథుడు అసత్యాన్ని చెప్పి ఉంటే రామాయణము మరొక విధంగా ఉండేది. అట్లే భద్రుడు సీతమ్మపై



నిందను దాచి ఉంచి నట్లయితే, ఉత్తర రామాయణ కథ ఉండేది కాదు. లోకానికి గృహస్థ ధర్మంతో పాటు అనేక ధర్మాలను అందించిన పూర్వ ఉత్తర రామాయణ కథకు సత్యవాక్య పరిపాలనలే ముఖ్యకారణం. సత్యధర్మం భారతీయ సంస్కృతిలో భాగం.

రామాయణము, రాముడు అనగానే అందరికి గుర్తు వచ్చే అంశం పితృవాక్య పరిపాలన. అయితే, చిత్రమైన విషయం ఏమిటంటే శ్రీరాముని వనవాసానికి వెళ్ళమని దశరథుడు చెప్పలేదు. దశరథుడు తనకు వరాలు ఇచ్చినాడని ఆ వరాలు ఇవి అని, వాటిని నేను ఇపుడు కోరుకున్నానని శ్రీరామునితో కైక చెప్పింది. శ్రీరాముడు సీతతోను, లక్ష్మణుని తోనూ కలసి వనవాసానికి సన్నద్ధుడై రథాన్ని అధిరోహించాడు. అది తెలిసిన దశరథుడు వనవాసానికి వెళ్లవద్దు ఆగమని రథం వెంటబడి పిలిచాడు. అయినా శ్రీరాముడు ఆగలేదు. తండ్రిమాట వినబడనట్లుగా వెళ్లిపోయినాడు. అటువంటప్పుడు శ్రీరాముడు పితృవాక్య పరిపాలకుడుగా ఎట్లా గుర్తింపబడినాడు? అనేది ప్రశ్న.



భారతీయ సంస్కృతి అర్థమయితే ఈ ప్రశ్నకు సమాధానం తెలుస్తుంది. పితృశబ్దానికి తండ్రి అనే అర్థమే కాకుండ అనేక అర్థాలున్నాయి. తమ వంశంలో పెద్దలు పాటించిన ధర్మాలను పాటించడం, తమ వంశంలోని పెద్దలు ఇచ్చిన మాటలను నెరవేర్చడం అనేవి వంశంలో తరువాత వచ్చిన వారి విధి.

అదియే భారతీయ సంస్కృతి. తండ్రి పినతల్లికి ఇచ్చిన మాటను తు.చ. తప్పకుండా పాటించడం ఆ వంశంలోని వ్యక్తిగా శ్రీరాముని కర్తవ్యం. ఆ కర్తవ్యాన్ని నిర్వహించిన ఉదాత్తుడు శ్రీరాముడు. నా తండ్రి నాకు చెప్పలేదు. కాబట్టి నేను అడవులకు పోనవసరం లేదని శ్రీరాముడు భావించి ఉన్నట్లయితే ఆతడు పితృవాక్య పరిపాలకుడుగా గుర్తింపబడేవాడు కాదు.

ఎవడు తనవంశంలోని పూర్వీకుల ఆచార సంప్రదాయాల్ని పాటిస్తూ, వారిచ్చిన మాటలను నెరవేరుస్తారో వారే పితృవాక్య పరిపాలకులు అవుతారు.

ఎందరో ఈ నియమాలను పాటించిన వారు ఉన్నప్పటికీ, శ్రీరామునికి మాత్రమే పితృవాక్య పరిపాలకుడనే పేరు వచ్చింది. అందుకు కారణం, తండ్రి తన మాటను

పాటించమని కోరలేదు సరిగదా వనవాసానికి వెళ్ళవద్దని చెప్పినాడు. ఇక్కడ శ్రీరాముడు తండ్రిమాట వినివుంటే వంశప్రతిష్ఠ దెబ్బతినేది.

వంశ ప్రతిష్ఠను నిలబెట్టడానికి, తండ్రి పినతల్లికి ఇచ్చిన వరాలను సార్థకం చేయడానికి తండ్రి వద్దన్నా వినిపించుకోకుండా వనవాసానికి వెళ్ళినాడు కాబట్టే ఆతడు పితృవాక్య పరిపాలకుడైనాడు. ఇది అసలు సిసలైన భారతీయ సంస్కృతి.

ద్వాపర యుగం నాటి కథ పాండవ కౌరవుల కథ. ధర్మం రెండుపాదాల మీదనే నిలచిన రోజులలో జరిగిన వృత్తాంతాల సమ్మేళ వివరణమే భారత కథ. వేదవ్యాసుడు (జయం) భారతంలో అనేక మార్లు భారతీయ సంస్కృతిని ప్రస్తావించాడు, వివరించాడు. ప్రత్యేకంగా సత్యవాక్య పరిపాలనాంశాన్ని వివిధ పాత్రల ద్వారా వివరించాడు. కవిత్రయం వారు తెనుగు భారతములో ఆ అంశాన్ని గట్టిగా సమర్థిస్తూ వచ్చారు.



భారతీయ సంస్కృతిలో గృహస్థాశ్రమధర్మం అన్నిటి కన్నా ప్రధానమయింది. సంసారాన్ని భోగదృష్టితో సాగించక యోగ దృష్టితో సాగించడం ఉత్తమోత్తమం. ఇక్కడ అన్నమయ్య చెప్పిన “సంసారమే మేలు సకల జనులకు కంసాంతకుని భక్తి కలిగితే చాలు” అన్నమాట గుర్తింపతగినదిగా ఉంది. మహాభారతములో శకుంతల దుష్యంతుని సభలో నిలబడి భర్త స్థానాన్ని ఘంటాపథంగా చెపుతుంది. శుభకార్యాల నిర్వహణలో దంపతులను ఆహ్వానించడం వారిని గౌరవించడం అనేది భారతీయ సంస్కృతిలో భాగం. ఆ సందర్భంలో శకుంతల చెప్పిన ఈ చిన్న పద్యం భారతీయ సంస్కృతిని తెలియజేస్తూ ఉంది.

సంతత గృహమేధి ఫలంబంతయు
బడయంగ నోపు ననుగుణ భార్యా
వంతుండగు వాడు క్రియా
వంతుడు దాంతుడు పుత్రవంతుండు నగున్

ఈ పద్యంలో “అనుగుణ భార్యావంతుండు” అనే చక్కని సమాసం మన (భారతీయ సంస్కృతికి నిదర్శనం. భారతీయ సంస్కృలో ప్రధాన భాగమైన దాంపత్య

జీవితంలో భార్యా భర్తల సంబంధాన్ని గూర్చి నన్నయ శకుంతల ద్వారా పలికించిన మాటలు గమనింపదగి ఉన్నాయి.

సీ॥ ధర్మార్థ కామసాధన కుపకరణంబు
గృహనీతి విద్యకు గృహము విమల
చారిత్ర శిక్ష కాచార్యకంబన్వయ
స్థితికి మూలంబు సద్గతికి నూత
గౌరవంబున కేకకారణం బున్నత
స్థిరగుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె భర్తకు, నొండ్లు గావు ప్రియము
ఆ॥ లెట్టి ఘట్టములను నెట్టి యాపదలను
నెట్టి తీరములను ముట్టబడిన
వంతలెల్లబాయు నింతుల బ్రజలను
నొనర జూడగనిన జనులకెందు



భారతీయ సంస్కృతికి అత్యద్భుతమైన ఉదాహరణ తిక్కన భారతములోని "సారపుధర్మ" మన్న పద్యం. కవిత్రయ భారతములో మంచి పద్యాలను తీసి మాలగా రూపొందించితే ఆ మాల మధ్యలో మణిగా ప్రకాశించే పద్యం ఇది. ఈ పద్యం ఉద్యోగ పర్వం తృతీయా శ్వాసంలో శ్రీకృష్ణరాయబార ఘట్టంలో ఉంది. శ్రీకృష్ణుడు పాండవుల మాటలను కురుసభలో ప్రస్తావిస్తూ...

"సారపుధర్మమున్ విమల సత్యము పాపము చేత బొంకుచే పారము పొందలేక చెడబాఱినదైన యవస్థ దక్షులె వ్వారలుపేక్ష సేసిరది వారల చేటగు గాని ధర్మ నిస్తారకమయ్యు సత్యశుభదాయకమయ్యును దైవముండిడున్" ఉత్తమమైన ధర్మం, నిర్మలమై సత్యం పాపంచేత, అబద్ధంచేత దరిచేరలేక చెడడానికి సంసిద్ధంగా ఉన్న స్థితిలో వాటిని రక్షించే శక్తి కలిగివుండి కూడ

రక్షించని వారికి చేటు తప్పదు. ఆ స్థితిలో భగవంతుడు ధర్మాన్ని ఉద్ధరించడానికి సత్యానికి శుభం కలిగించడానికి ముందుకు వస్తాడు అని నమ్మేది భారతీయ సంస్కృతి.

మహాభారతము అనుశాసనిక పర్వంలో సమన శాండిలీ సంవాదం భారతీయ సంస్కృతికి చక్కని ఉదాహరణ. కేకయ రాజపుత్రి అయిన మేమిటి అని అడుగుతుంది. అపుడు సుమనకు శాండిలీని ఇలా చెపుతుంది. "నేను అత్తమామలకు ఎదురు చెప్పను. పూజాది కార్యక్రమాల నిర్వహణలో, శ్రాద్ధ క్రియలు నిర్వహించుటలో అతిథులకు సపర్యలు చేయడం వంటి పనులు నేను కడు జాగ్రత్తగా పాటించి నిర్వహిస్తాను. మంచి నడవడికను కలిగి ఉంటాను. పరిశుద్ధ బుద్ధితో విద్యావంతులకు భిక్షపెడతాను. ఇంటిపనులను ఇష్టంతో చేస్తాను. బిడ్డలను చక్కగా తీర్చిదిద్దుతాను. నానోటిని నేను అదుపులో ఉంచుకుంటాను. గోగణాదుల సుఖజీవనాన్ని పరిరక్షించి కాపాడతాను. ఇంటిగుట్టును బయటపెట్టను - అని ఈ విధంగా తెలియజేస్తుంది. శాండిలీని ప్రతిమాట భారతీయ సంస్కృతికి ఉదాహరణయే.

భారతీయ సంస్కృతికి అద్దం పట్టే పద్యమొకటి. ఎర్రన - భారతము అరణ్యపర్వశేషంలో కనిపిస్తుంది.

శా॥ ఆలస్యంబొక యింతలేదు, శుచి యాహారంబు, నిత్యక్రియా
జాలంబేమఱ మర్చనీయ లధితుల్; సత్యంబ పల్కంబడున్.
మేలై శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిందాలు, మట్లాట నె
క్కాలంబుం బటురోగ మృత్యు భయశంకం బొందమే మెన్నడున్.

తార్క్యుడు ఒక మహర్షి . మంచి అనుష్ఠాన శీలి. అతనికి ఒక కుమారుడు ఆతడు కూడా తండ్రిలాంటివాడే ఒకనాడు అతడు కృష్ణాజినాన్ని ఉత్తరీయంగా కప్పుకొని అడవికి వెళ్ళాడు. పొదల మాటున ఉన్న ఆతనిని ఒక జింకగా భావించి, అటువైపు వేటకు వచ్చిన హైహయ వంశరాజ కుమారుడు అతనిపై బాణాన్ని ప్రయోగిస్తాడు. ఆ బాణం వేటకు ఆ ముని కుమారుడు విగతజీవుడౌతాడు. రాజకుమారుడు పాపభీతితో పురం చేరి విషయాన్ని పెద్దలకు తెలియజేస్తాడు. అందరు కలసి అరణ్యానికి వస్తారు. విప్రకళేబరాన్ని చూసి చకితులవుతారు. అందరు తార్క్యుని ఆశ్రమం చేరుకుంటారు. జరిగిన సంగతిని తార్క్యునికి తెలియజేస్తారు. తార్క్యుడు అపుడు కుమారుడిని పిలుస్తాడు. ఆతడు సశీరీరుడై వస్తాడు.

ఆ వచ్చిన వారితో తార్క్యుడు ఆశ్రమంలోని జీవన విధానాన్ని పై పద్యంలో చెప్పినట్లు

పేర్కొని, ఇట్టి సంస్కారవంతమైన నడవడి కలిగిన మా ఆశ్రమవాసులకు అకాల మరణం సంభవించదని చెపుతాడు.

అంటే అకాల మరణాన్ని కూడ తప్పించగలిగింది భారతీయ సంస్కృతి.



సనాతన ధర్మానికి ముప్పైలక్షణాలను భాగవతము గుర్తించింది. భాగవతము సప్తమస్కంధం 409వ వచనంలో, సత్యం, దయ, తపస్సు, శౌచం, ఓర్పు, సదసద్వివేకం, మనోనియంత్రణం, ఇంద్రియ జయం, అహింస, బ్రహ్మచర్యం, దానం, జపం, సంతోషం, మృదుత్వం, సమత్వం, మహాజనసేవ, నిష్కామత్వం, నిష్ఫలక్రియాత్యాగం, హితభాషిత్వం, ఆత్మాన్వేషణ, అనుమోదకదానం, ప్రాణులందు దేవతా బుద్ధి, ఆత్మ బుద్ధి, దైవస్మరణ, కీర్తనం, సేవనం, నమస్కారం, దానం, ఆత్మసమర్పణం, సఖ్యం అనేవి ధర్మానికి గల గుణగణాలు.

ఇవి సకల వర్గాలకు సమానమయినవి. అందరు ఆచరింపతగినవి. ఏ ధర్మం శాశ్వతంగా మానవ జీవితాన్ని చుక్కానివలె నడుపుతుందో అదే సనాతన ధర్మం. ఈ ధర్మానికి ఎపుడూ చ్యుతి ఉండదు.

క్షమ, దయ, సత్యం, మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి, శీలం, ధృతి, గృహస్థాశ్రమం, ప్రభువుకు ప్రజలకు గల అనుబంధం మొదలైన అంశాలు రామాయణ భారతేతిహాసాలు నొక్కివక్కాణించాయి. అవి కేవలం ఉపదేశాలుగా కాకుండా కథలతో, ఉపకథలతో, పిట్ట కథలతో మేళవించి వివరించాయి. ఆ కథల్ని మాత్రమే మనం గ్రహిస్తే హోమియోపతి మాత్రపై పూసిన తీపి పదార్థాన్ని మాత్రమే ఆస్వాదించిన వారమవుతాము. ఆ కథల సారాంశం లోని అంతరార్థాన్ని గ్రహించి మన మానసిక రుజగ్రస్థతను తొలగించుకొని జీవించగలిగితే సమైక్యతా భావం ఏర్పడుతుంది. దాని ద్వారా జాతి సఖశాంతులతో వర్ధిల్లు తుంది. ఇతిహాసాల పరమార్థం నెరవేరుతుంది. ఈ విధంగా మనకు రామాయణ భారతేతి హాసాల్లో భారతీయ సంస్కృతి స్పష్టంగా కనబడుతుంది. ఈ భారతీయ సంస్కృతియే జాతీయ సమైక్యతను కాపాడుతుంది.

ధర్మమధర్మము భంగి న
ధర్మము ధర్మంబు మాడ్కి తనయా తోచున్
నిర్మల మతి నరయ వలయు
ధార్మికతను కోరువాడు తనకేర్పడగన్.

# రామాయణ ప్రతిపాదిత సమాజం



గురు సహస్రావధాని
డా. కడిమిళ్ళ వరప్రసాద్
✆ 92478 79606



ఈమాట చిన్నప్పటినుండి వింటున్న మాట. తరతరాలుగా పాఠశాలలలో విశేషణమును గూర్చి చెప్పాల్సి వచ్చినపుడు ఉపయోగించే వాక్యం. ఇంగ్లీషులోను, హిందీలోను కూడ ఈ అర్థం వచ్చే వాక్యాలనే చెపుతూంటారు. అంటే రాముడు భారతీయుల హృదయాలలో ఎంతగా నిండిపోయాడో అర్థమవుతోంది. అంటే బాలుడుగా ఉన్నపుడు మాత్రమే మంచివాడా? పెద్దవాడయ్యాక ఆ మంచితనం జారిపోతే వాని బాల్యంనాటి లక్షణాన్ని ఎవరూ గుర్తుంచుకోరు. నిజానికి రాముడు మంచివాడు అన్నది అభిప్రాయం. మొక్కై వంగనిది మ్రానై వంగదు కనుక మంచితనమనేది బాల్యం నుండీ అలవాటు కావాలి. అటువంటివాడే పెద్దవాడయ్యాక అందరి మన్ననలు అందుకో గలుగుతాడనేది ఆ మాటలోని సారాంశం.

రామాయణానికి భారతానికి మౌలికమైన భేదమేమంటే వద్దు వద్దు అంటే రామాయణం. కావాలి కావాలి అంటే భారతం. రాజ్యం కోసం రాముడు ఆశపడలేదు, భరతుడూ తనకు రాజ్యం వద్దంటాడు. లక్ష్మణుడూ అక్కరలేదంటాడు. శత్రుఘ్నుడు సరేసరి. కాని భారతంలో కౌరవులూ రాజ్యం మాకే కావలంటారు. పాండవులూ మాకే కావాలంటారు. నిస్వార్థం మానవునికి ఉన్నతిని కలిగిస్తుందని చెపుతుంది.

రామాయణం. స్వార్థం పతన హేతువు అని చెపుతుంది, భారతం.

ఇంతకూ మంచితనమంటే ఏమిటి? ఆ మాటను నిర్వచించగలమా! సర్వజనామోదంగా ప్రవర్తించేవాడు మంచివాడు అని చెప్పవచ్చా! అలా అయితే శూర్పణఖ, రావణుడు, కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు మొదలగువారికి ఆమోదయోగ్యుడు కాలేదు కదా రాముడు. అందుకని సత్పురుషులకు ఆమోదయోగ్యంగా ఉండడమే మంచితనం అని చెప్పాలి.

చూసారా! ఇక్కడకూడా సత్ అనే మాటను ఉపయోగించాల్సి వచ్చింది. మంచివాడు అనే మాటకు సంస్కృత రూపమే సత్పురుషుడు. దీనినిబట్టి ఏం తెలుస్తోందంటే మంచితనమనేది ఇదమిత్థంగా నిర్వచించ గలిగే మాట కాదు. కాని మంచితనమంటే ఏమిటో అందరికీ తెలుసు.



భాషకందని భావమంటే ఇదే. భాషకందని భావాలు కూడా ఉంటాయా! ఉంటాయి. పంచదార ఎలా ఉంటుంది అని పిల్లవాడు అడిగాడు. తియ్యగా ఉంటుందని తల్లి సమాధానం. తీపి అంటే ఏమిటి మళ్లీ ప్రశ్నించాడు. దానికి సమాధానం చెప్పగలదా ఏ తల్లయినా? చిటికెడు పంచదార నోట్లో వేసి ఎలా ఉందని అడగాలి. చాలా బాగుంది అని అంటాడు పిల్లవాడు. ఆ బాగుండడానికే తీపి అని పేరు అనేగా చెప్పాలి. తీపి అనేది అనుభవైకవేద్యమే తప్ప నిర్వచించగలిగినది కాదు. మంచితనంకూడ సరిగ్గా అట్లాంటిదే. మంచితనం అనగా ఏమి? అన్న ప్రశ్నకు సమాధానం చెప్పలేము. మంచివాడుగా లోకమంతా భావించిన వ్యక్తిని చూపించి అదిగో! వానిలా ప్రవర్తించడమే మంచితనం అని చెప్పాలి. అలా చూపించేందుకు ఆదర్శంగా రాముని తీసికొన్నాడు వాల్మీకి మహర్షి.

తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరం
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్ ॥

ఈ శ్లోకంతో రామాయణం ఆరంభమయింది. "తపస్సు మఱియు వేదాధ్యయన ములతో కాలం గడిపేవాడు, వాగ్వేత్తలలో శ్రేష్ఠుడు, మునులలో గొప్పవాడు అయిన నారదుని, మునియైన వాల్మీకి ప్రశించాడు. ఇది ఆ శ్లోకానికి అర్థం. "లోకంలో ఏకావ్యమైనా మంగళకరమైన దైవప్రార్థనతో ఆరంభిస్తాడు ఏ కవియైనా. కాని ఆది కావ్యకర్తయైన వాల్మీకి ఆ విధానాన్ని పాటించలేదు. దైవ

ప్రార్థన పై విశ్వాసం లేక కాదు. తపస్సు అనే శబ్దమే మంగళవాచకం. ఇక్కడ ప్రశ్నించినవాడు వాల్మీకి శిష్యుడు. ఆయన ప్రశ్నలకు జవాబు చెప్పబోయేవాడు నారదుడు గురువు. గురుప్రస్తావన చేయడం కంటె మంగళకరం ఏముంటుంది. గురువు మీద గురి ఉన్నవాడే మంచివాడు. ఒక మంచి వ్యక్తిని లోకానికి పరిచయం చేసేవాడుకూడ మంచివాడై ఉఃడాలిగా?. ఇక్కడ వాల్మీకి తన మంచితనాన్ని ఈ రూపంగా నిరూపించుకొన్నాడు. ఇంతకూ నారదుని అడిగిన ప్రశ్నలేమిటి, ఎన్ని? మొత్తం పదియారు ప్రశ్నలడిగాడు.

కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్

ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో ధృఢవ్రతః ॥ అంటూ మొదలవుతాయి ఆ ప్రశ్నలు. ఇప్పుడు ఈ లోకంలో గుణవంతుడు ఎవరు? వీర్యవంతుడు ఎవరు? ధర్మజ్ఞుడు ఎవరు? సత్యవాక్యుడు ఎవరు? ధృఢవ్రతుడు ఎవరు? ఇలా సాగిన ప్రశ్నల పరంపరకు సమాధానం ఒకే ఒక్కడు కావాలి. అంటే ఆ లక్షణాలన్నీ ఒకనియందే కొలువుతీరాలి. అలాంటివాడు ఎవరంటే అనగనగా... అంటూ ఎపుడో పూర్వకాలంనాటి వ్యక్తిని ఉదాహరించవద్దు. 'సాంప్రతం' ఇప్పుడు ఉన్న వ్యక్తినిగురించే చెప్పాలి. అయితే వైకుంఠంలో అనో కైలాసంలో అనో చెప్పరాదు. 'అస్మిన్ లోకే' ఈలోకంలోనే ఆ వ్యక్తి ఉండాలి. అటువంటివాడెవడున్నాడో చెపితే వాని చరిత్ర కావ్యంగా వ్రాస్తానని వాల్మీకి ప్రశ్నించాడు. సాహిత్యమనే వస్తువు ఆరంభమయినదే వాల్మీకితో. ఆదికవి తన కావ్యాన్ని సమకాలీన సామాజిక స్పృహతో నిర్మించాలనుకొన్నాడు. అలాగే నిర్మించాడు. సరే! ఆ ప్రశ్నలన్నిటికీ సమాధానమైనవాడు రాముడే అని వాని చరిత్రను సంక్షిప్తంగా బ నేప్పాడు నారదుడు కేవలం వంద శ్లోకాలలో. అదే రామాయణంలో బాలకాండలో ప్రథమసర్గ. దానినే బాలరామాయణము అని, సంక్షిప్త రామాయణము అని వ్యవహరిస్తుంటారు.



ఇందులో మొదటి ప్రశ్న గుణవంతుడు ఎవరు అని కదా! గుణవంతుడు అంటే ఏమిటో తెలిస్తేనే కదా ఆ గుణవంతుడు ఎవరో చెప్పేది. ప్రశ్న అర్థం కాకుండా సమాధానం ఎలా వస్తుంది. సరిగ్గా మంచితనం దగ్గర వచ్చిన సమస్యే ఇక్కడకూడ వచ్చింది. మిగిలిన ప్రశ్నలు అర్థమవుతాయి. వీర్యవంతుడు అంటే పరాక్రమవంతుడు. ధర్మజ్ఞుడు అంటే ధర్మం తెలిసినవాడు. కృతజ్ఞుడు అంటే

చేసిన మేలును గుర్తుంచుకొనేవాడు. సత్యవాక్యుడు అంటే ఆడి తప్పనివాడు. ఇలా అన్ని ప్రశ్నలూ తెలుస్తున్నాయి. గుణవంతుడు అంటే ఏమని చెప్పాలి. ఏ లక్షణాలుంటే గుణవంతుడవుతాడు. ఆ మొదటి ప్రశ్నకు వివరమే మిగిలిన 15 ప్రశ్నలు. చూడండి. విష్ణుసహస్రంలో 'విశ్వం విష్ణుః' అని మొదలవుతుంది. విశ్వమే విష్ణువు అన్నతరువాత ఇంక ఆయనగురించి చెప్పడానికేముంది. విశ్వమే విష్ణువు ఎలా అయ్యాడో వివరిస్తే అవి మరొక 998 నామాలయ్యాయి. అలాగే గుణవంతుడు అనగా మంచివాడు. ఏ లక్షణాలుంటే మంచివాడు గా చెప్పబడతాడో అవే మిగిలిన పదునైదు లక్షణాలు. అవన్నీ కలవాడు రాముడు. అందుకే అతడు మంచివాడు. ఆ మంచితనం పెద్దయ్యాక ఆకస్మికంగా వచ్చిందా! చిన్ననాటినుండి సల్లక్షణ సంపన్నుడే. గట్టిగా మాట్లాడితే పుట్టుకనుండే. అందుకే 'ఆజన్మశుద్ధానాం రఘూణామన్వయం వక్ష్యే' పుట్టుక నుండే పవిత్రులైన రఘువంశీయుల చరిత్ర చెపుతున్నానంటూ రఘువంశమహాకావ్యారంభంలో చెప్పాడు కాళిదాసు. ఆకస్మికంగా మంచి లక్షణాలు వచ్చిపడితే అవి ఎప్పుడైనా చెదరిపోవచ్చు. కాని పుట్టుకనుండే మంచికి మరో పేరుగా మసలేవాడు జీవితకాలం అలాగే ఉంటాడు. అందుకనే రాముడు మంచివాడు అని కాకుండా రాముడు మంచి బాలుడు అనే మాట ప్రచారంలోకి వచ్చింది.

పూర్వం పెళ్లి సంబంధాలు చూసేటప్పుడు పిల్లతండ్రికి ఫలానా చోట ఒక అబ్బాయి ఉన్నాడని ఎవరైనా చెపితే అతను ఎలాంటివాడు? అన్నది మొదటి ప్రశ్న. ఇప్పటివాళ్లయితే ఏం చేస్తున్నాడు అన్నది మొదటి ప్రశ్న. పూర్వం గుణానికి ప్రాధాన్యం. ఇపుడు ధనానికి ప్రాధాన్యం. ఏమాటకు ఆమాటే చెప్పుకోవాలి. అబ్బాయి చాల మంచివాడు అని చెప్పగానే పిల్లనిచ్చేస్తారా ఏమిటి! మంచివాడైతే సరిపోలేదు



చదువుకోవాలి. ఏదో పని చేస్తూ నాలుగు రాళ్లు సంపాదిస్తుండాలి. అంతేకాని వంచిన తల ఎత్తడండి. ఎవరిజోలికి వెళ్లడండి. కాకపోతే ఏమీ సంపాదించడం చేతకాదంటే పిల్లనెవరిస్తారు. కనుక మంచితనంతో బాటుగా అవసరమైన మరికొన్ని

లక్షణాలుండాలి. అన్నీ కలిస్తేనే పరిపూర్ణంగా గుణవంతుడౌతాడు. అందుకనే అవన్నీ వరుసగా గుదిగ్రుచ్చి అడిగాడు వాల్మీకి. పదియారు కళలతో చంద్రుడు నింగిలో ప్రకాశిస్తున్నట్లుగా పదియారు లక్షణాలతో రాముడు అందరి గుండెలలోను ప్రకాశిస్తున్నాడు కనుకనే రాముని 'శ్రీరామచంద్రుడు' అన్నారు. నిజానికి ఉన్నది ఒకటే. అది సద్గుణం. సద్గుణాన్ని విడగొట్టి చూపిస్తే మరొక 15గా కనిపించింది. చంద్రుడైనా అంతే. పాడ్యమి నుండి పూర్ణిమ వరకు ఉన్నవి 15 తిథులే అయితే 16వ కళ ఎక్కడినుండి వచ్చింది. ఈ 15కళల సమాహార రూపమే 16వది. అందుకే చంద్రుడు షోడశ కళాపూర్ణుడు, రాముడు షోడశ గుణ ప్రపూర్ణుడు. అక్కడ పూర్ణ ఇక్కడ ప్రపూర్ణ అని ఎందుకన్నానంటే చంద్రుని కళలకు వృద్ధి క్షయాలుంటాయి. కాని రాముని గుణాలు నిత్యములు. వృద్ధిక్షయములుండవు.

గుణవంతుడుగా నిలబడాలంటే ముందుగా కావలసినది శక్తి. 'వీర్యవాన్ కః' శక్తిమంతుడు ఎవరని. తనలో మంచి ఉంటే చాలదు. చెడు దాడి చేసినపుడు దానిని ఎదిరించి మంచిని కాపాడుకోగలగాలి. జనస్థానంలో ఒకరా ఇద్దరా పదునాలుగు వేలమంది రాక్షసులు దాడికి దిగితే లక్ష్మణుని సాయంకూడ తీసికోకుండా వారందరినీ చీల్చి చెండాడేసాడు. రావణ సైన్యంతో యుద్ధం చేస్తున్నపుడు వానరుల సాయం తీసికొన్నాడు. అది నిజమైన శక్తిమంతుని లక్షణం. పదునాలుగువేలమందికి తానొక్కడే సమాధానం చెప్పగలడు. ఆ ఆత్మవిశ్వాసం ఉంది. లంకలో లక్షల సంఖ్యలో సైన్యముంది. వారిని ఎదిరించాలంటే తనకూ సాయం చేసే సేన కావాలి. అది నిజమైన శక్తిమంతుని లక్షణం. 'తనబలము నెదిరి బలమును' గమనించి ముందడుగు వేయాలి. ఎక్కడ నెగ్గాలో కాదు ఎక్కడ తగ్గాలో కూడ లోకానికి చూపించిన

ధర్మజ్ఞశ్చ కః ధర్మముకూడ తెలిసినవాడెవడు అన్నది తరువాతి ప్రశ్న. ఆ కూడ అన్న మాటచేత అధర్మము కూడ తెలిసియుండాలి. ఏది ధర్మమో తెలియాలి. అపుడు దానిని ఆచరించాలి. ఏది అధర్మమో కూడ తెలియాలి. అప్పుడు కాని దానిని దూరం పెట్టాలనే ఆలోచన కలుగదు. పాలు త్రాగడం ఆరోగ్యమని తెలిస్తే చాలదు. సారాయి త్రాగితే అనారోగ్యమనికూడ తెలియాలి. లేదంటే అమ్మ ఇచ్చింది కదా అని పాలుత్రాగినవాడు స్నేహితుడు ఇచ్చాడు కదా అని సారాయి కూడ త్రాగుతాడు. "రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్యచ రక్షితా" అంటాడు నారదుడు రామునిగూర్చి. తన ధర్మానికి తాను రక్షకుడుగా నిలబడతాడు.



తన ధర్మాన్ని నిలబెట్టుకుంటే సరిపోతుందా. తన వారిని కూడ రక్షించుకుంటాడు. అదికూడ ధర్మంలో ఒక భాగమే. నేను ధర్మంగా ప్రవర్తిస్తాను అంటే చాలదు. తన కుటుంబ సభ్యులందరూ ధర్మానికి కట్టుబడేలా చేయడమే యజమాని ధర్మం. తనవారికి ఏ కష్టాలు కలుగకుండగా చూసికోవడం యజమాని ధర్మం. స్వజనస్యచ అంటే తనవారినికూడ రక్షిస్తాడు. అంటే తన కుటుంబసభ్యులనే కాదు, తోటివారికి ఎవరికి కష్టం వచ్చినా ఆదుకుంటాడని భావం. 'రామో విగ్రహవాన్ ధర్మః' ధర్మానికి ఒక ఆకారం ఏర్పడితే అదే రాముడు అని పరపక్షమునకు చెందిన మారీచుడు ప్రశంసించాడంటే రాముని మించిన ధర్మాత్ముడు ఎవరుంటారు లోకంలో.



ఆ తరువాతి ప్రశ్న కృతజ్ఞశ్చ కః? ఇతరులు చేసిన మేలు గుర్తుంచుకొనే వాడు ఎవడు? అని. రాముడే అని సమాధానం. 'కథంచి దుపకారేణ కృతేనైకేన తుష్యతి' ఎవరైనా ఏ చిన్నపాటి ఉపకారం చేసినా జీవితకాలం గుర్తుంచుకుంటాడట రాముడు. లోకంలో కృతజ్ఞత అనే ఒక్క గుణం లేకపోతే మానవత్వం నిలబడదు. కని పెంచిన తల్లిదండ్రులను వృద్ధాశ్రమంలో పెడుతున్నారంటే వారినింతవారిని చేసేందుకు తల్లిదండ్రులెన్ని కష్టాలను అనుభవించారో అని ఆలోచించగలిగే కృతజ్ఞతాభావం లేకపోబట్టేకదా! కన్నవారిపట్లే కృతజ్ఞత లేనివాడికి మిగిలినవారి విషయంలో ఎందుకుంటుంది. అవసరం మేరకు ఇతరులనుండి సాయాన్ని పొందుతుంటాడు. వారికి అవసరం వచ్చినపుడు తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ! చివరకు మాతృదేశానికి కూడ ద్రోహం చేయడానికి వెనుకాడడు. వ్యక్తిత్వం వికసించాలంటే కృతజ్ఞతాభావం నరనరాలలో నిండియుండాలి. తనకు సాయం చేసిన జటాయువు మరణించినపుడు రాముడు బాధపడతాడు.

రాజ్యాద్ భ్రంశః వనేవాసః సీతా నష్టా హతో ద్విజః
ఈదృశీయం మమాలక్ష్మీః నిర్ద హేదపి పావకమ్ ॥

జటాయువు మరణించాడు. తన భార్యను రక్షించడంకోసం ప్రాణాలొడ్డి పోరాడి చివరకు మరణించాడు. అపుడు రాముడన్న మాట. "రాజ్యము పోయింది. అరణ్యవాసం సక్రమించింది. సీత కనబడకుండా పోయింది. ఈ పక్షి చనిపోయింది. ఇటువంటి నా యీ దురదృష్టం అగ్నిని కూడ కాల్చివేయగలదు." తనకోసం పోరాడి ప్రాణాలు విడిచి పెట్టిన పక్షిని చూసి ఆపాటి బాధపడటంలో



విశేషమేముందనిపిస్తుంది. కాని రాజ్యం పోవడం, అరణ్యవాసం ఏర్పడటం, సీత కనిపించకుండా పోవడం వాటికన్నిటికి ఏ తన దురదృష్టం కారణమో ఈ పక్షి చనిపోవడానికి కూడ అటువంటి దురదృష్టమే కారణమని బాధపడ్డాడు.

ఇంట్లో కుక్కలను పెంచుతుంటారు. అవి బ్రతికినంతకాలం తమ ఇంటికి రక్షణ కలిగిస్తూ సేవ చేస్తుంటాయి. వయసై అవి చనిపోయినపుడు బాధ కలుగుతుంది. కాని దురదృష్టముకొలది కుటుంబసభ్యులు దూరమైతే కలిగేంత బాధమాత్రం కలుగదు. ఎవరైనా మోసం చేసి తనకు కోటి రూపాయలు నష్టం కలిగిస్తే ఎంత బాధ కలుగుతుందో అంత బాధ కలుగదు. కాని రాముడు మాత్రం రాజ్యనష్టం, అరణ్యవాసకష్టం, సీత అదృశ్యంతో సమానంగా బాధపడ్డాడు. అంతేనా కుటుంబసభ్యులకు చేసినట్లుగా దానికి దహనసంస్కారాలు చేసాడు. అది రాముని కృతజ్ఞత. విభీషణుడు చేసిన సాయానికి బదులుగా లంకా సామ్రాజ్యానికి అధిపతిని చేసాడు. తనకు సాయం చేస్తానని చెప్పినందుకే సుగ్రీవుని శత్రువును వధించి కిష్కింధా నగరానికి అధిపతిని చేసాడు. వానరుడైన హనుమంతునికి ఎవరికీ దక్కని ఆలింగనరూపమైన సత్కారాన్ని అందించాడు. పడవ నడుపుకొనే గుహుని నా ఆత్మసఖుడు అని పలువురిలో ప్రకటించాడు. ఆ విధంగా తనకు ఏపాటి సాయాన్ని అందించినా వారందరినీ జీవితకాలం గుర్తుంచుకొని వారిపట్ల సుహృద్భావంతో ఉండటం రాముని లక్షణం.

సతవాక్యః కః? సత్యానికి నిలబడేవాడు ఎవడు? అంటే దానికి రాముడే సమాధానం. తెల్లవారితే నీకు పట్టాభిషేకం అని చెప్పినపుడు అలాగే అన్నాడు తప్ప ఎగిరెగిరి పడలేదు. పట్టాభిషేకం నీకు కాదు నా కుమారుడైన భరతునికి అని చెప్పినపుడుకూడ అలాగే అన్నాడు తప్ప క్రుంగిపోలేదు. అంతేకాదు పదునాలుగేండ్లు అరణ్యవాసం చేయాలన్నపుడు కూడ నేనెందుకు అడవులకు పోవాలి. నన్ను అడవులకు పంపే అధికారం మీకెవరిచ్చారు అని గొడవకు దిగలేదు. అపుడు కూడ అలాగే అనే అన్నాడు. ఒకసారి నాన్నగారి అనుమతిని తీసుకొని వెడతాను అన్నాడు. కైక ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్క లేదు. నాన్నగారి అనుమతిని తీసుకొంటాడా!?.... రాముడు అడవులకు వెళ్లేందుకు తండ్రి అనుమతిస్తాడా? ఆ వంకతో రాముడు ఆగిపోతాడా? ఇలా పరిపరివిధాల ఆలోచిస్తోంది. కైకముఖం చూసి మనసును చదువగల నేర్పరి రాముడు. వెంటనే అంటాడు. "'రామో ద్విర్నాభిభాషతే'

రాముడు రెండు మాటలు మాట్లాడడు. రాజ్యం వదలుకోవాలి, అడవులకు వెళ్లాలి అని చెప్పగానే అలాగే అని అన్నాను కదా! రెండవమాట లేదు. కంగారు పడవద్దు". అనేసరికి కైక మనసు కుదుటపడింది. అదీ రాముని సత్యవ్రతం. పైగా నేను రెండు మాటలు మాట్లాడను అనకుండా రాముడు రెండు మాటలు మాట్లాడడు అని ప్రథమపురుషలో పలుకుట భావంలోని తీవ్రతను తెలియజేస్తుంది. అంటే ఆరు నూరైనా అటు సూర్యుడు ఇటు పొడిచినా నేను ఆడి తప్పను అని ప్రతిజ్ఞ చేయడం లాంటిది ప్రథమపురుషలో పలకడం. అలాగే భరతుడు రాముని తిరిగి రాజ్యస్వీకారం చేయమని అడవులకు వెళ్లి ఎంతో బ్రతిమాలాడు. వసిష్ఠాదులు కూడ బ్రతిమిలాడారు. 'దశరథుడు మరణించాడు కనుక, ఆయన ఇచ్చిన వరాలకు కూడ కాలం చెల్లినట్లే' కనుక, తిరిగి రమ్మంటారు. కాని మనుజులు శాశ్వతం కాకపోయినా వారిచ్చిన మాట శాశ్వతం. నేను వెనుకకు వస్తే మా తండ్రి సత్యం తప్పినవాడౌతాడు. కనుక వెనుకకు రానంటాడు. తాను సత్యమునకు నిలబడటమే కాక, తన తండ్రిని కూడ సత్యవ్రతునిగా నిలబెట్టగలిగిన కుమారులు ఎవరుంటారు ఈ లోకంలో. రాముడు తప్ప. అందుకనే రాముడు మంచిబాలుడు.



దృఢవ్రతః కః? పట్టిన పట్టు వదలనివాడు ఎవడు? అంటే, దానికి రాముడే మంచి ఉదాహరణ. 'ప్రారబ్ధార్థములుజ్జగింపరు సుమీ ప్రజానిధుల్ కావునన్' అన్న సుభాషితం రామునిలో పరిపూర్ణంగా అన్వయిస్తుంది. రాముని చరిత్రలో, ఏ పనీ మొదలు పెట్టి మధ్యలో ఆపిన దాఖలా లేదు, సముద్రం అడ్డువచ్చిందని ప్రయాణం ఆపలేదు. సముద్రం పై వంతెన కట్టించడం అసాధ్యమనుకోలేదు. లంకలోకి వెళ్లాక, వారందరూ వాహనాలు, ఆయుధాలు కలవారు. తన సేనయైన వానరులకు ఆయుధాలూ లేవు, వాహనాలూ లేవు, అని నిరుత్సాహపడకుండా యుద్ధానికి సిద్ధమయ్యాడు, విజయాన్ని సాధించాడు. చారిత్రేణచ కోయుక్తః? ఆదర్శవంతమైన నడవడిక కలవాడు ఎవరు? అన్న ప్రశ్నకు కూడ రాముడే సమాధానమయ్యాడు.

కొడుకుగా, అన్నగా, భర్తగా, మిత్రునిగా, యజమానిగా, తండ్రిగా, రాజుగా ఎలా ప్రవర్తించాలో అలాగే నడచుకొని అందరికీ ఆదర్శమయ్యాడు.

"'సర్వభూతేషు కో హితః?' సర్వభూత దయ కలవాడు ఎవడు? అంటే రాముడే" అన్నాడు నారదుడు. 'నితాంతాపార భూతదయయును' కలవాడు శ్రీరామచంద్రుడు. నరులను ఎలా ప్రేమించాడో వానరులను కూడా అలానే ప్రేమించాడు. తనవారిని ఎలా ప్రేమించాడో, జాతి చేత కాని, విద్య చేత కాని, ఐశ్వర్యము చేత కాని తనతో ఏవిధంగాను తుల తూగని గుహుని కూడ అలాగే ప్రేమించాడు. జాతి కాదు గుణమే ముఖ్యమని భావించి, రాక్షస జాతికి చెందిన విభీషణుని కూడ ఆదరించాడు, ప్రేమించాడు. జటాయువు మరణించినపుడు విలవిలలాడిపోయాడు.



"విద్వాన్ కః? పండితుడు ఎవరు?" అంటే రాముడే. వసిష్ఠుడు, విశ్వామిత్రుడు వంటి గురువులు మురిసిపోయిన శిష్యసత్తముడు రాముడు. చిన్నవయసులోనే అన్నివిద్యలలోనూ ఆరితేరాడు. హనుమంతుడు మొదటిసారిగా కలిసినపుడు వాని మాటలను విన్నంత మాత్రం చేతనే, అతనికి ఏయే విషయాలలో పాండిత్యం ఉందో గ్రహించి లక్ష్మణునికి చెప్పాడు. "'నాఋగ్వేద వినీతస్య నాయజుర్వేదధారిణః నాసామవేదవిదుషః శక్యమేవం ప్రభాషితుమ్'. ఋగ్యజుస్సామవేదములు చదవని వానికి ఇలా మాట్లాడటం సాధ్యం కాదు." అన్నాడు. "బహువ్యావహరతానేన న కించిదపశబ్దితమ్ చాల విషయాలు మాట్లాడినా ఒక్క అపశబ్దం కూడ వీని నోటి నుండి రాలేదంటే, వ్యాకరణశాస్త్రం కూడ బాగా చదువుకొన్నాడు" అని చెప్పాడంటే అవన్నీ రామునికి కూడ బాగా పట్టుబడిన విద్యలేగా.

'కః సమర్థః? సమర్థుడు ఎవరు?' అన్నదానికి రాముడే సమాధానం. ఇది చాల ముఖ్యమైన గుణం. ఎన్ని ఉన్నా సామర్థ్యం అనేది లేకపోతే ఎందుకూ కొఱగాడు. 'క్రియాసిద్ధిః సత్త్వే భవతి మహతాం నోపకరణే' అని ఆర్యోక్తి. గొప్పవారికి కార్యసిద్ధి అనేది వారి సామర్థ్యమువల్లనే కాని వారు ఉపయోగించిన సాధనములవలన జరుగదు. అందుకనే 'సత్త్వానుసారిణీ లక్ష్మీః' అన్నారు. ఎక్కడ సమర్థత ఉంటుందో అక్కడే లక్ష్మి ఉంటుంది. సామర్థ్యం లేకపోతే ధనాన్ని సంపాదించనూ లేరు. పెద్దలు సంపాదించి ఇచ్చిన దానిని నిలబెట్టుకోలేరు. రాముడు కుటుంబ నిర్వహణలోను, రాజ్యపాలనలోను, రాజ్యాన్ని సుభిక్షంగా ఉంచడంలోను యుద్ధరంగాలలోను ఎప్పటికప్పుడు, ఎక్కడికక్కడ తన సమర్థతను ఋజువు చేసికొన్నాడు.

ఏకప్రియదర్శనః కః? అందరికీ అన్నివేళలా ప్రియమైన దర్శనమిచ్చేవాడు ఎవడు? అంటే కూడ రాముడే. సాధారణంగా ఎవరినైనా చూస్తే కొందరికి ఆనందం కలుగుతుంది. కొందరికి అసహనమో, కోపమో కలుగుతుంది. అలాగే కొందరిమోము ఒక్కొక్క సమయంలో చూస్తే, ప్రసన్నంగా ఉంటుంది, కొన్ని సమయాలలో అప్రసన్నంగా కనబడుతుంది. కాని రాముని మోము ఏవేళలోనైనా, ఎవరికైనా ప్రసన్నంగానే కనబడుతుంది. శూర్పణఖ వంటి రాక్షస స్త్రీ రామలక్ష్మణులపై నేరం చెపుతూకూడ వారి అందాన్ని ప్రశంసించకుండా ఉండలేకపోయింది.



'తరుణో రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ' అంటూ పొగిడింది. రాముని యుద్ధరంగంలో చూసిన రావణుడు తనకు పగవాడే అయినా రామచంద్రుని తేజస్సుని చూసి మురిసిపోయాడు. అది ఏకప్రియదర్శనత్వం అంటే.

'ఆత్మవాన్ కః?' 'ఆత్మవంతుడు ఎవరు?' ఆత్మశబ్దానికి చాలా అర్థాలున్నాయి. "ఆత్మా జీవే ధృతా దేహే స్వభావే పరమాత్మని" అని అమరం. ఇక్కడ ఆత్మశబ్దానికి ధైర్యము అని అర్థం చెప్పారు వ్యాఖ్యాతలు. అంటే ధైర్యవంతుడు ఎవరు? రాముని మించిన ధైర్యవంతుడు మరొకడు లేడనేందుకు జనస్థానంలో పదునాలుగు వేలమందితో పోరాడేందుకు తానొక్కడే ఎదురు నిలిచినప్పుడే రాముని ధైర్యం అర్థమవుతోంది. శత్రువు ఉన్న చోటుకు... అంటే లంకకు వెళ్లి స్థానబలం కలిగినవానితో స్థానబలం లేని తాను, వానర సేనను సాయంగా తీసికొని రాక్షస సేనతో తలపడేందుకు, ఒక్క తలతో మాత్రమే ఉన్న తాను పది తలల వానితో సమరానికి సై అనేందుకు, పదివేల సంవత్సరాల తపోబలం ఉన్నవానితో, కేవల పౌరుషం సాయంగా పోరాటానికి సిద్ధపడినపుడు, తన తండ్రిని సత్యవాక్యునిగా చేసేందుకు, రాజ్యత్యాగం చేసి, అరణ్యవాసం చేసేందుకు సిద్ధపడినపుడు, 'జనవాక్యంతు కర్తవ్యం' అని భావించి, ప్రాణానికి ప్రాణమైన సీతను త్యాగం చేయడానికి వెనుకాడనపుడు, రాజశాసనానికి తలవంచి ఆరవ ప్రాణమైన లక్ష్మణుని దూరం చేసికొన్నపుడు రామునిలోని ధైర్యగుణం ఎంతటిదో మనకు అర్థమవుతుంది.

రెండవ ప్రశ్న వీర్యవంతుడు ఎవరు? అని. అంటే శక్తిమంతుడు లేదా పరాక్రమవంతుడు అని అర్థం. అదీ ఇదీ ఒకటే కదా! అనిపించవచ్చు. కాని యుద్ధంలో చొచ్చుకుపోవడానికి కావలసింది పరాక్రమం. కాని తన బలము



కంటె ప్రత్యర్థి బలం ఎక్కువ, అని తెలిసికూడ సమరాంగణంలోనికి అడుగు పెట్టడానికి కావలసింది ధైర్యం. పరాక్రమం అంటే కేవలం అది యుద్ధ సమయంలో మాత్రమే కావలసిన గుణం. కాని ధైర్యం అన్ని వేళలా కావాలి. మిన్ను విరిగి మీద పడినా, పరిస్థితులు ప్రతికూలించినా సడలని గుండెనిబ్బరానికే, ధీరత్వమని గాంభీర్యమని పేరు. అదే ధైర్యమంటే. అది పుష్కలంగా కలవాడు శ్రీరాముడు.

'జితక్రోధః కః?' 'క్రోధాన్ని జయించినవాడు ఎవడు?' ఇంకెవరు శ్రీరాముడే. తనకోపమే తన శత్రువు అన్నమాట నిత్యసత్యం. ఎన్ని వేల ఏండ్లు గడచినా ఆ మాట అసత్యము కాదు. ప్రతివ్యక్తి నిత్యము స్మరించదగినమాట. ఇంటిలో గోడపై వ్రాసుకొని రోజూ చూస్తూండ వలసిన మాట. దుర్గుణాలు ఏవీ లేకపోయినా చెడ్డవారు కాకపోయినా కేవలం కోపానికి వశులై జీవితాలను పాడుచేసుకొన్నవారు, చేసుకొంటున్నవారు కోకొల్లలు లోకంలో. సామాన్యులలోనే కాదు అసామాన్యులలో కూడ ఇటువంటి సన్నివేశాలు చాల కనిపిస్తాయి.

మహాసాధ్వియైన సీతమ్మ ఒకనాడు ఒడలు తెలియని కోపంలో లక్ష్మణుని అనరాని మాటలు అన్నందుకు ఫలితంగా అతడు దూరంగా వెళ్లిపోవడం, అపుడు రావణుడు అపహరించడం ఆ రకంగా ఆమె కష్టాలపాలు కావడం మనకు తెలిసినదే. రాముడు ఎంత కోపంలోను మాట తూలడు. అన్యాయంగా తన అన్నగారిని అడవులకు పంపిస్తున్నారని లక్ష్మణుడు కోపంతో ఊగిపోయి తన తండ్రిని కైకను ఎన్నో మాటలు అన్నాడు. కాని రాముడు ఒక్క పరుషమైన మాట కూడ అనలేదు సరికదా లక్ష్మణుని బుజ్జగించాడు. అనుకోని ఈ పరిస్థితికి కాలమే కారణం కాని సవతి తల్లి యైన కైక కాదనుకొన్నాడు. వాలి వధ అయిన తరువాత వర్షాకాలం వెళ్లాక సీతాన్వేషణ చేయిస్తాను అని మాట ఇచ్చాడు సుగ్రీవుడు. వర్షాకాలం వెళ్లిపోయింది. శరత్కాలం వచ్చి చాల రోజులయింది. కాని భోగలాలసుడై సుగ్రీవుడు తన కర్తవ్యాన్ని విస్మరించాడు. అపుడు రాముడు లక్ష్మణునితో సుగ్రీవునికి వర్తమానం పంపిస్తాడు ఏమనంటే 'నచ సంకుచితః పంథాః యేన వాలీ గతో హతః' వాలి వెళ్లిన మార్గం ఇంకా మూతపడలేదు. అని. ఆ మాటలో ఎంత బరువుంది! నిజానికి చంపేస్తాను అని ఆ మాటకు భావం. కాని చంపేస్తా, నరికేస్తా, పొడిచేస్తా లాంటి మాటలు అనకుండా అంత గంభీరంగా సందేశం పంపాడంటే వచ్చిన

కోపాన్ని ఎంత అదుపు చేసికొని మాట్లాడాడు. జితక్రోధుడు అంటే అదే. కోపం లేనివాడని కాదు. కోపాన్ని అదుపులో పెట్టుకోగలవాడు. అలాంటివాడు శ్రీరాముడు.

'ద్యుతిమాన్ కః' 'కాంతిమంతుడు ఎవరు?' ఇంకెవరూ? రాముడే!. నల్లనివాడు పద్మనయ నమ్ములవాడు అంటుంది భాగవతం. అది శ్రీకృష్ణుని విషయంలో చెప్పిన మాట కదా! అనుకుంటారేమో! కాదు. ముందుగా రామావతార ఘట్టంలో పోతన గారు వ్రాసిన పద్యం

నల్లనివాడు పద్మ నయనమ్ముల వాడు, మహాశుగంబులన్
విల్లున దాల్చు వాడు కడు విప్పగు వక్షము వాడు మేలు పై
జల్లెడు వాడు నిక్కిన భుజంబులవాడు యశంబు దిక్కులన్

జల్లెడు వాడు నైన రఘుసత్తముడీవుత మాకభీష్టముల్ ॥ అంటూ శ్రీరాముని పై బ్రహ్మాండమైన పద్యం చెప్పాడు మహాకవి పోతన. అయితే తన పద్యం తనకే బాగా నచ్చి, మళ్లీ అదే ఎత్తుగడతో శ్రీకృష్ణుని పై మరి ఒక పద్యాన్ని చెప్పాడు. భాగవతంలో అందరూ చదివేది ప్రధానంగా కృష్ణ చారిత్రమే కాబట్టి ఆ పద్యం ప్రచారంలోకి వచ్చింది కాని ముందు పుట్టింది రాముని వర్ణనమే. నల్లనివాడైనా కాంతిమంతుడు. కనుకనే అందరినీ ఆకర్షించాడు. 'పుంసాం మోహనరూపాయ' అన్న మాట రాముని గురించే అంటారు. మగవారికి కూడ మరులుగొలి పేటంత కాంతి రామునిది. రాముని చూసినవారు దృష్టిని మరల్చుకోలేరు. లేదంటే అందానికి, వికారానికి తేడా తెలియని వానరులు కూడ రామునికి అంత వశమైపోవడమేమిటి.



తానెవరో తెలియకూడదని రూపం మార్చుకుని వచ్చిన హనుమంతుడు రాముని చూడగానే మైమరచిపోయి తానెవరో నిజం చెప్పేయడమేమిటి. సీత హనుమను సందేహించి, నిజంగా నీవు రాముని వద్ద నుండే వచ్చినవాడవైతే నా రాముడు ఎలా ఉంటాడో చెప్పమంటే రామః కమల పత్రాక్షః సర్వసత్వ మనోహరః అంటూ శ్రీరాముని శరీరంలోని ప్రతి అవయవమూ అందమైనదిగా వర్ణించి చెప్పడమేమిటి. నరమాంస భక్షణము మాత్రమే కోరుకొనే రాక్షస జాతికి చెందిన శూర్పణఖ రాముని

కామించడమేమిటి. రాముడు కాంతిమంతుడు అనడానికి ఇవన్నీ తిరుగు లేని ఉదాహరణములే. అసలు అందమంటే రంగు కాదు కాంతియే. చర్మంలో నైగనిగ్యముండాలి. అదే ఆకర్షణ. లావణ్యమంటే అదే. లవణమంటే ఉప్పు. సముద్ర సమీపంలో ఉప్పుమళ్లు కనిపిస్తుంటాయి. వాటిని చూస్తే తళతళా మెరుస్తుంటాయి. ఉప్పులో కాంతి ఉంటుంది. ద్రవత్వ లక్షణం ఉంటుంది. చర్మంలో కాంతి ఉండాలి. పొడిబారిన చర్మం కాకుండా ద్రవత్వ లక్షణం కలిగియుండాలి. దానినే లావణ్యమంటారు. అటువంటి లావణ్యం పుష్కలంగా కలవాడు శ్రీరాముడు.



'అనసూయకః కః' 'అసూయ లేనివాడు ఎవరు?'.. రాముడే అని సమాధానం. 'గుణేషు దోషారోపః అసూయా' ఎవరియందు మనకిష్టముండదో వారిలోని గుణాలను కూడ దోషాలుగా వక్రీకరించి మాట్లాడుతుంటాము. అదే అసూయ అంటే. కాని రాముడు కేవలం గుణగ్రాహి. శత్రువైనా మిత్రుడైనా గుణాన్ని గుణం లాగే చూస్తాడు. రాక్షస జాతి వాడే కాదు సాక్షాత్తు తనకు పగవాడైన రావణుని తమ్ముడైన విభీషణునిలో కూడ, గుణాన్ని గ్రహించి మిత్రునిగా స్వీకరించాడు. కేవలం స్త్రీలౌల్యం రావణుని పాడుచేసింది కాని లేదంటే ఆతడు చాల గొప్పవాడు. శత్రుత్వమనేది ఆ వ్యక్తి బ్రతికియున్నపుడే. మరణించాక వానితో మనకున్న శత్రుత్వం కూడ అంతరించినట్లే. రాముడు, 'మరణాంతాని వైరాణి' అని చెప్పి, విభీషణునిచేత రావణునికి శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరిపించాడు. అనసూయకుడు అన్నమాటకు అసలు సిసలు ఉదాహరణం శ్రీరాముడే.

'కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే' ఎవరికి కోపం వస్తే దేవతలు కూడ భయపడతారు? ఆ ప్రశ్నకు కూడ సమాధానం శ్రీరాముడేనట. ఎంత వింత!! జితక్రోధుడు రాముడేనట. ఆయనకు కోపం వస్తే దేవతలుకూడ భయపడతారట. పరస్పర విరుద్ధంగా లేవూ ఈ రెండు మాటలు. అస్సలు విరుద్ధములు కావు. వెనుకటికి ఒక మహర్షి కాటువేయడం మానేయమని ఒక పామును ఆజ్ఞాపిస్తే, ఆ ఆజ్ఞను శిరసావహించిందట ఆ సర్పం. అప్పటినుండి కప్పలు దాని నెత్తిమీదకెక్కి నాట్యం చేయడం మొదలు పెట్టాయి. అపుడా పాము ఆ మహర్షిని కలిసి స్వామి తమ ఆజ్ఞను శిరసా వహించాను. నాటినుండి నా పరిస్థితి ఇలా తయారయింది అని చెప్పగానే నిన్ను కాటువేయవద్దన్నాను కాని బుస కొట్టవద్దనలేదు కదా!? అన్నాడట. అలాగ కోపానికి వశమైపోయి ఒడలు మఱచి అనరాని మాటలనడం,

చేయరాని పనులు చేయడం తప్పు. కాని అసలు కోపమనేదే లేకపోతే కడుపున పుట్టిన పిల్లలుకూడ తల్లిదండ్రుల మాట వినరు. వారు తప్పుటడుగులు వేస్తుంటే సరియైన దారిలో పెట్టేందుకు కోపాన్ని ప్రదర్శించాలి. శిష్యులను సరియైన మార్గంలో పెట్టేందుకు గురువులు కోపాన్ని ప్రదర్శించాలి. ఎప్పుడూ శాంతంగా ఉంటూ ఎట్టకొకనాడు కోపంతో కళ్ళెర్ర జేస్తే "అలుగుటయే యెఱుంగని మహామహితాత్ముడజాత శత్రువే అలిగిన నాడు, సాగరములన్నియు నేకము కాకపోవు' అన్నటులుంటుంది వ్యవహారం. అయినదానికీ కాని దానికీ కోపపడటమే స్వభావమైపోతే వాని కోపానికి పిల్ల కాలువ కూడ అదరదు బెదరదు. రామునికి కోపం ఒకంతట రాదు. రాక రాక వస్తే దేవతలైనా భయపడిపోవాల్సిందే. ఇక దానవులు, మానవుల సంగతి చెప్పాలా? తనకు రాజ్యం పోయినా అరణ్యవాసం వచ్చినా కోపం రాని రాముడు, సీత నెత్తురు కళ్ల చూసి నందుకు కాకి పైనే బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. పదునాలుగు వేల మందిని ఒంటి చేతితో చీల్చి చెండాడేసాడు. రావణుని పక్షం వహించి యుద్ధానికి వచ్చిన ఏ ఒక్కరినీ విడిచి పెట్టలేదు. పైగా మహాభారత యుద్ధంలో ఇరుపక్షాలవారూ చనిపోయారు. కాని రామ-రావణ యుద్ధంలో రావణ పక్షంలో ఒక్కడూ మిగలలేదు. రాముని పక్షంలో ఒక్కడూ మరణించలేదు. అదీ రాముని శక్తి. అందుకే అన్నారు 'రామరావణ యోర్యుద్ధం రామరావణ యోరివ' అని.

ఈ విధంగా పదునారు లక్షణాలు ఎవరిలో ఉంటాయో వారే ఈ సమాజానికి ఉపయోగపడతారు. వారే మంచివారు. అటువంటి మంచివారి అవసరం సమాజానికి నిత్యం ఉంటుంది. ఎప్పుడైనా మంచితనానికి రాముడే ఆదర్శం. బాల్యం నుండి తమ పరిధిలో ఈ లక్షణాలు అలవాటు చేసికొన్నవాడే మంచి బాలుడు అవుతాడు. క్రమంగా మంచివాడు అవుతాడు. అంతేకాని మంచితనం అనేది ఒక్కమారుగా ఊడిపడదు. వ్యక్తిత్వ వికాసమంటే ఏవేవో చెప్పనక్కరలేదు. ఈ పదియారు లక్షణాలు వివరిస్తే సరిపోతుంది. ఎవరైనా ఈ రాముని గుణాలను గమనించి, వాటిలో తమకు ఎన్ని గుణాలు ఉన్నాయో, అవికూడ ఏ స్థాయిలో ఉన్నాయో పరిశీలించి, ఉన్న గుణాల స్థాయిని పెంచుకోవడానికి, లేని గుణాలను అలవాటు చేసికోవడానికి ప్రయత్నం చేస్తే ఉత్తమ వ్యక్తులుగా తయారవుతారు. భారత దేశ కీర్తికి మూల కారకులవుతారు. వాల్మీకి మహర్షి రాముని కథ చెప్పుకుంటూ వెళ్లిపోవచ్చు. అలా చేస్తే ఆ కథ కావ్యానందాన్ని మాత్రమే ఇస్తుంది. కాని తన రామాయణము సమాజాన్ని ప్రభావితం చేయాలి అనుకున్నాడు. మొత్తం రామకథ నుండి రాముని గుణగణాలను ఏరుకోవడం జనాలకు సాధ్యం కాదని భావించి, ఆ కష్టం కూడ తానే పడి ఆరంభంలోనే వాటిని ఏకరువు పెట్టాడు. పొలం ఇస్తాను,

దున్నుకొని, విత్తనాలు నాటి, చెట్లు పెంచి ఫలాలు తినమంటే సరిపోతుంది. పాపం ఆ కష్టం కూడ పడలేరు జనాలని ముందుగానే ఊహించి, తానే పొలాన్ని దున్ని, పదియారు రకాలైన విత్తనాలు నాటి ఫలవృక్షాలను నీరుపోసి పెంచాడు. ఆ పండ్లు కోసికొని తినడానికి కూడ జనాలకు ఒడలు వంగకపోతే ఆయనేం చేస్తాడు. కనుక ఆ ఫలాలలో ఉండే రుచిని నేటి యువతరానికి తెలియజేసి, బలవంతంగానైనా ఒక్కసారి తినిపిస్తే, ఆ తరువాత వారే వదలరు. ఆవురావురు మంటూ తింటారు. ఆరోగ్యంగా బ్రతుకుతారు. స్వస్తి.

వందే వాల్మీకి కోకిలమ్'



# నన్నయ భారతం నాటి సమాజ స్థితిగతులు



ప్రాచార్య లింగంనేని బసవ శంకరరావు
✆ 96000 84875

## ఉపోద్ఘాతం :

పరాశరాత్మజుడైన వ్యాసుడు ఏకరాశీభూతమైన వేదాన్ని నాలుగు భాగాలుగా వింగడించటంవల్ల 'వేదవ్యాసుడైనాడు. మహావిష్ణువు ఏకవింశత్యవతారాల్లో వేదవ్యాసుడొకఅవతారం.వేదవ్యాసుడు 'పంచమవేదం'గా పరిగణింపబడుతున్న మహాభారతాన్ని విరచించాడు. మహాభారత ఖిలభాగంగా గణింపబడుతున్న హరివంశాన్ని కూడా సంతరించాడు. అష్టాదశ పురాణాల్ని అవలీలగా రచించాడు. వేదవ్యాసుని ప్రధాన శిష్యులైన పైల, సుమంత, జైమిని, వైశంపాయనాదులు భారతాన్ని వ్యాప్తి గావించారు (ఆది. 1-66).

1. రాజరాజ నరేంద్రుని కోరికపై నన్నయభట్టు సంస్కృత మహాభారత బద్ధనిరూపితార్థ మేర్పడ తెనుగున రచియించాడు. నన్నయ 'అనువాదం' చేశాడని కొందరు విమర్శకులు; అలా కాదు, నన్నయ భారతాన్ని 'అనుసృజన' చేశాడని మరికొందరు విమర్శకాగ్రేసరులు భావిస్తున్నారు. నన్నయభట్టు 'తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్' (ఆది. 1-25). దేవసంబంధమైన కథ అయినా, పౌరాణిక సంబంధమైన కథ అయినా, చారిత్రక సంబంధమైన కథ అయినా కవి కాలం నాటి సమాజ స్థితిగతులు ఆ యా రచనల్లో ప్రతిబింబించటం సర్వసాధారణం. ఈ అభిప్రాయానికి ఏ గ్రంథం అపవాదం కాదు. మహాభారతంలో ప్రతిబింబించాయనటంలో



ఎటువంటి సందేహమక్కరలేదు. నన్నయ అనుసృజన చేయటంలో సందర్భానుసారంగా ఎడనెడ తనకాలంనాటి సమాజాన్ని పేర్కొనటం అత్యంత సహజం. నన్నయ భారత భాగంలో కూడ వేదవ్యాసుని కాలంనాటి సమాజమే ఎక్కువగా ప్రతిబింబిస్తుంది. వేదవ్యాస కాలంనాటి సమాజ స్థితిగతుల్ని పేర్కొంటూ, నన్నయ కూడ తనకాలంనాటి సమాజ స్థితిగతుల్ని అక్కడక్కడ ప్రదర్శించినపుడు ఆ విషయాలు పేర్కొనబడతాయి.

2. రాజరాజ నరేంద్రుని సభలో 'అపార శబ్దశాస్త్ర పారంగతులైన వైయాకరణులును భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులునూ, మృదుమధుర రసభావభాసుర నవార్థ వచనరచనా విశారదులైన మహాకవులును, వివిధ తర్కవిగాహిత సమస్తశాస్త్రసాగర గరీయఃప్రతిభులైన తార్కికులును నాదిగాగలుగు విద్వజ్జనంబులు పరివేష్టించి' ఉన్నారని నన్నయ ఆ సమాజాన్ని పేర్కొన్నాడు (ఆది. 1-8).

3. పైలుని శిష్యుడు ఉదంకుడు. గురుపత్ని కోరికపై పౌష్యమహారాజు దేవిదగ్గరనుండి కుండలాలు తీసుకొన్నాడు. ఉదంకుని భోజనం చేసి వెళ్లమన్నాడు పౌష్యుడు. అన్నం కేశదుష్టమైన కారణంగా ఉదంకుడు రాజును శపించాడు. రాజు తిరిగి ఉదంకుని శపించాడు. ఆనాడే కాదు, నేటి కాలంలోనూ ఆ విధానం ఉంది. ఆ అన్నాన్ని తినకపోవటం ఉంది. (8. 1-99).

4. ఉదంకుడు ఒక జలాశయం దగ్గర శుచిప్రదేశంలో కుండలాలు పెట్టి ఆచమిస్తున్నాడు. ఇంతలో తక్షకుడనే సర్పరాజు ఆ కుండలాల్ని గ్రహించి అహిలోకానికి వెళ్లాడు. వాని వెనుక ఉదంకుడు వెళ్లి, ప్రధాన సర్పాలైన అనంతుని, వాసుకుని, ఫణిరాజుల్ని-చివరికి తక్షకుని కూడా స్తుతించి కుండలాల్ని పొందాడు. దొంగతనం చేసినవాడిని కూడా పొగడి వస్తువును గ్రహించటం విశేషం (ఆది. 1-107).

5. కద్రూవినతల కథలో సపత్నుల్లోని ఈర్ష్యాసూయలు సువ్యక్తం. కద్రువ వేయిమంది పుత్రులు కావాలని కశ్యప ప్రజాపతిని వేడగా, ఆ పిల్లలకన్న బలవంతులైన ఇద్దరు కొడుకుల్ని ప్రసాదించమనటంలో అసూయ వ్యక్తమవుతోంది (ఆది. 2-3). కద్రువ మోసం చేసి వినతను దాసిగా పొందటంలో సపత్నుల విభేదం తెలుస్తోంది (ఆది. 2-33).

6. ఒక మంచి కథనో, ఇతివృత్తాన్నో విన్నప్పుడు ఈ కథను విన్నవారు, చదివినవారు భోగభాగ్యాలు పొందుతారని, నమ్మేవారు. కద్రూవినతల కథవల్ల ఉరగరక్షోభయా లుండవని భావించేవారు (ఆది. 2-123).

**7. రాక్షసులు ఇచ్చిన సురను సేవించిన శుక్రాచార్యుడు సురాపానం మహాపాతకం అని శపియించాడు (ఆది. 3-122). సురాపానం అనాదిగా ఉంది.**

**8. దేవయాని శర్మిష్ఠను దాసిగా పొందటం అమానుషమైన చర్య. తప్పు చేసినవారిని దాసిగా చేస్తారు కాబోలు! (ఆది. 3-153). పందెంలో ఓడిన వినత కూడా దాసి అయ్యింది (ఆది. 2-37).**

**9. నూతిలో పడి ఏడుస్తున్న దేవయానిని యయాతి తన దక్షిణకరంతో దేవయాని దక్షిణకరాబ్జం పట్టిన కారణంగా పాణిగ్రహణం అయ్యింది. కాబట్టి వివాహంతో సమానమని భావించేవారు కాబోలు! (ఆది. 3-160).**

**10. భారత కాలంనాటి ధర్మం ఏమిటంటే-పాత్రునికి ధనం ఇవ్వాలట! ఇతరుల్ని ధనంకోసం వేడకూడదట! ఆశార్థుల్ని వృథా పుచ్చక చేయాలట! (ఆది. 3-204).**

**11. అష్టవిధ వివాహాలుండేవి. ఆ వివాహాల్లో క్షత్రియులకి గాంధర్వ రాక్షస వివాహాలు ప్రశస్తాలు (ఆది. 4-54). దుష్యంతుడు శకుంతలను గాంధర్వ వివాహం చేసుకొన్నాడు (ఆది. 4-60). ఈ నేటి కాలంలో కూడా ఇట్టి వివాహాలున్నాయి గదా!**

**12.'దీర్ఘతము'డనే ముని 'పతిహీనలయిన భామిను లతిధనవంతులయ్యును,కు లజలయ్యును ననలంకృత లయ్యేడు, మాంగళ్య రహిత లయ్యేడు' నని శాపమిచ్చాడు (ఆది. 4-228). ఆనాటి నుండి నేటివరకు పతిహీనలయిన స్త్రీలు ఇలాగే ఉన్నారు.**

**13. ధృతరాష్ట్ర, పాండు, విదురుల జన్మలు ఆనాటి సంప్రదాయం కాబోలు! ఇటువంటి పుట్టుకలున్నాయని దృష్టాంతంగా చెపుతారు. దేవరన్యాయము భారత కాలంలో ఉండేది (ఆది. 4-254). పాండవుల జననం కూడా ఇంతే కదా! ఇప్పుడు 'సరోగసి' ఉంది.**

**14. మాండవ్యుడనే మహర్షి 'జన్మంబు మొదలుగా పదునాలుగు సంవత్సరములు దాటునంత వరకు పురుషుడు బాలుండు, వాడెద్దీ సేసిన పాపం పొంద'డని ఒక చక్కని మర్యాద చేశాడు (ఆది.4-270). చిన్న పిల్లలు చేసే తప్పులకు తల్లిదండ్రులే బాధ్యులంటాం గదా!**

**15. గాంధారీ గర్భగత పిండాన్ని నూట ఒక ప్రక్కలు చేసి వేరు వేరు. ఘృతకుండంబుల పెట్టి శీతలజలముల తడుపుచుండగా దుర్యోధనాదులు జనియించటం 'టెస్టుట్యూబు' జననంలాగా ఉంది. (ఆది. 5-101). ధృతరాష్ట్రునికి నూటొక్క భార్యలున్నారు.**

**16. నిద్రపోతున్న భీముని చెట్టు వేరులచేత, తీగలచేత కట్టివేసి గంగ మడువులో త్రోయటంలాంటి మోసాలు ఈ కాలంలోనూ మనం చూస్తున్నాం గదా! (ఆది. 5-172).**

**17. బలవంతుడైన భీమునికి అన్నంలో విషం కలిపి దుర్యోధనుడు పెట్టించాడు. విపరీతమైన ఆకలితో ఉన్న భీముడు వారించినా వినకుండా, ఆ విషాన్నాన్ని భుజించి జీర్ణించుకొన్నాడు (ఆది. 5-179). కోడి రామమూర్తిగారికి ఆంగ్లేయులు విషాన్నం పెడితే తిని వ్యాయామం చేసి అరిగించుకొన్నాడని విన్నాం గదా!**

**18. శంతన మహారాజు మృగయా వినోదార్థం అడవికి వెళ్లగా, అక్కడ మగపిల్లవాడిని, ఆడపిల్లను చూసి, కృపాయత్తచిత్తుడై పెంచటంవల్ల కృపాచార్యుడుగాను, కృపిగాను అభివృద్ధి చెందారు. పసికందుల్ని జాలితో పెంచడం ఆనాడే ఉందన్నమాట! (ఆది 5-188). నేడు కూడా పసిపిల్లల్ని కని కుప్ప తొట్లో వేయడం మనం చూస్తున్నాం గదా!**

**19. ఆ కాలంలో అంటే ద్వాపర యుగంలో గురుదక్షిణలు బాగా ఇచ్చేవారు. ద్రోణుడు కోరగానే నిస్సందేహంగా ఏకలవ్యుడు దక్షిణాంగుష్ఠం ఇవ్వటం హృదయవిదారకం (ఆది. 5-243).**

**20. ధనుర్విద్యను నేర్చుకొనే సమయంలో చెట్టుమీద ఉన్న పిట్టను కొట్టాలంటే నిజమైన పక్షిని కొట్టేవారు కాదు. అది పాపమని ద్రోణుడు ఒక చెట్టుమీద కృత్రిమపక్షిని పెట్టి దాని తలను తెగవేయమనగా, అందరూ చేయలేని పనిని అర్జునుడు సాధించాడు. అంటే, ఆ కృత్రిమపక్షి తలను తెగవేశాడు (ఆది. 5-254).**

**21. ఘోరాస్త్ర శస్త్రవిద్యల్లో ఆరితేరిన కౌరవ పాండవుల ధనుర్విద్యా విన్యాసాన్ని ప్రదర్శించటంకొరకు ఒక రంగాన్ని తయారుచేశారు. శిష్యులు తమ తమ నామాంకితాలైన శరాలతో లక్ష్యాల్ని ఛేదించారు (ఆది. 6-11).**

**22. ద్వంద్వయుద్ధం చేయాలంటే ఆ వీరులు తమ తల్లిదండ్రుల పేర్లు చెప్పి సమమైతేనే గాని యుద్ధాన్ని అంగీకరించరు. కానీనుడైన కర్ణుని ఆ విధంగా అడిగి అర్జునునితో ద్వంద్వయుద్ధం చేయటానికి అనర్హుడవని చెప్పారు కృపాచార్యులు. కృపాచార్యుడు ద్వంద్వయుద్ధ నిర్వహణలో నిపుణుడు (ఆది. 6-43).**

**23. ఇష్టమైతే రాజ్యాన్ని కూడా దానం చేసేవారు. దుర్యోధనుడు కర్ణునిపై ప్రేమతో అంగరాజ్యాభిషిక్తుని చేశాడు (8. 6-47).**

**24. ద్రోణాచార్యుడు ఒక రోజు శుభోదయాన, శిష్యుల నెల్ల రావించి, తనకు గురుదక్షిణ ఇమ్మని కోరాడు. ద్రుపదుని నోడిచిపెట్టి తేవటమే తనకు గురుదక్షిణ అని శిష్యులకు చెప్పాడు (ఆది. 6-62). అర్జునుడు పట్టి తెచ్చి గురువైన ద్రోణాచార్యుని కప్పగించాడు (ఆది. 6-87). ఎంత కష్టమైనా గురుదక్షిణ సాధించి ఇస్తారు.**

**25. దుర్యోధనుని దుర్మంత్రం కారణంగా పాండవులు లాక్షాగృహంలో ఉన్నారు. ఆ రోజుల్లో అవసరమైతే లాక్షా గృహాల్ని నిర్మించేవారు కాబోలు! ఆ లాక్షాగృహంనుండి వెలువడటానికి విదురచోదితుడై ఒక ఖనకుడు రమ్యమైన బిలాన్ని ఎవ్వరికీ తెలియకుండా నిర్మించి పాండవులకు చెప్పాడు (ఆది. 6–157).**

**26. లాక్షాగృహాన్ని భీముడే తగులబెట్టి తల్లిని, సోదరుల్ని మోసుకొంటూ అడవిలోకి వెళ్లిపోయాడు. ఆ రాత్రి సమయంలో దాహం కోసం భీముడు వాళ్లను వదలి, కొలనులో కృతావగాహనుండై నీళ్లు త్రాగి కమలపత్ర పుటికలతో నీళ్లు తెచ్చి వారికిచ్చాడు (ఆది. 6-173). తామరాకులో నీళ్లు పట్టటం ఇప్పటికీ పల్లెల్లో ఉంది.**

**27. పాండవులు అడవిలో ఆ రాత్రి వటవృక్షం క్రింద బాగా అలసిపోయి ఉన్న కారణంగా పై పుట్టాలు పరచుకొని తమ బాహుదండాలు తలగడలుగా నిద్రించారు. బాహుదండాల్ని తలగడలుగా వాడటం అత్యంత సహజమైన, సార్వకాలికమైన సామాజిక విషయం (ఆది. 6-176).**

**28. 'కమలపాలిక'అనే నామాంతరంగల హిడింబి భీముని ప్రేమించానని ఒప్పుకోకపోతే ఇప్పుడే ప్రాణాలు విడుతునని చెప్పింది. ప్రేమకోసం ప్రాణత్యాగం చేయటం ఉందన్నమాట! (ఆది. 6-219). ఆ సమాజంలో నామాంతరాలుండేవి.**

**29. హిడింబికి భూత వర్తమాన భవిష్యత్తు లెల్లను తేట తెల్లముగా తెలుసుననటమే కాకుండా భవిష్యత్తును చెప్పింది. ఆమె చెప్పినట్లుగానే భవిష్యత్తు జరిగింది. జ్యోతిషంలాంటి విద్య స్త్రీలకు కూడా ఉందన్నమాట! (ఆది. 6-219).**

**30. పాండవులు బ్రాహ్మణ వేషధారులై ఏకచక్రపురానికి వెళ్లవలసిందని వేదవ్యాసుడు చెప్పాడు. వేషాలు మార్చటం ఉంది. ధర్మరాజు భవిష్యత్తులో రాజసూయాశ్వమేధాది క్రతువులు చేస్తాడని వ్యాసభగవానుడు జ్యోతిషం చెప్పాడు (ఆది. 6–228). ఆ సమాజంలో జ్యోతిషులుండేవారు. నేడు కూడా ఉన్నారు గదా!**

**31. ఏకచక్రపుర నివాసులు బకాసురునకు భయపడి వానితో సంధి చేసుకొన్నారు. బలవంతులు బలహీనుల్ని పీడిస్తుంటే, వానితో సంధి**

చేసుకోవటం సామమార్గమని తెలుస్తోంది. రోజుకు ఇలువరుస ప్రకారం ఒక్క మనిషి, రెండెనుపోతులు పూనిన శకటంతో అపరిమిత భక్ష్యాలతో వెళ్లాలి. ఆ మనిషిని, ఎనుపోతుల్ని, ఆహారాన్ని మొత్తం బకాసురుడు భక్షిస్తాడన్న మాట! (ఆది. 6-265).

32. బ్రాహ్మణ వేషధరుడైన అర్జునుడు మత్స్యయంత్రాన్ని ఛేదించగా, అర్జునునితో కర్ణుడు యుద్ధానికి దిగాడు. అర్జునుని అపారశరావలుల్ని కర్ణుడు ఆపలేక; నా యెదుట భార్గవుడు, ఇంద్రుడు, అర్జునుడు తప్ప వేరెవరు నిలువలేరు. నీవు ఎవ్వరవని కర్ణుడు అడుగుతాడు. అప్పుడు అర్జునుడు 'ఏను నీ చెప్పిన వారి లోపల నెవ్వడగాను గానీన' అని అబద్ధం చెప్పాడు. రహస్యాన్ని రక్షించటంకోసం అబద్ధం చెప్పటం ఆనాడే ఉంది (ఆది. 7-200).

33. ఒక స్త్రీకి ఐదుగురు భర్తలుండటం కొన్ని ప్రాంతాల్లో ద్వాపరయుగంలో ఉంది కాబోలు! సాల్వేయ, శూరసేన, శ్రుతసేన, బిందుసారాతిసారులను వారేవురు ఔశీనరపతి కన్యక నజితను స్వయంవరంలో పొంది వివాహమాడారు (ఆది. 7-278). దృష్టాంతంకోసం పాండవుల కీ విషయం, కథ చెప్పారు.

34. ద్రౌపది పాండవుల వివాహనికి ద్రుపదుడు పురాన్ని అష్టశోభనం గావించాడు. వివాహమండపాన్ని అద్భుతంగా నిర్మించాడు. కదళీస్తంభాలున్నాయి. నవాశ్వత్థ పల్లవమాలాలంకృత ద్వారతోరణాలున్నాయి. కల్యాణవేదిక మధ్య సమిద్ధాగ్ని కుండమండితమైంది (ఆది. 7-281).

35. ద్రుపదుడు పాండవులేవురికి అనర్ఘ్యమణి ఖచితాలైన ఆభరణా లిచ్చాడు. సౌవర్ణాలైన శయ్యాసనపరికరాల్ని, నూరేసి భద్రగజాల్ని, కాంచన రథాల్ని, వెయ్యేసి కాంభోజహయాల్ని, పదేసి వేలు దాసీజనాల్ని, నూరేసి పాడి మొదవుల్ని అగ్నిసాక్షికంగా వరకట్న మిచ్చినట్లుగా భావింపవచ్చును (ఆది. 8-2).

36. బ్రహ్మవరదానలబ్ధులైన సుందోపసుందులనే రాక్షసులు హిరణ్యకశిపుని వంశంవారు. మునిపల్లెలకు వెళ్లి మునుల్ని వేధించేవారు (ఆది. 8-102). ఆ రోజుల్లో మునులకు అడవి ప్రాంతంలో ప్రత్యేకమైన పల్లెలుండేవి.

37. విప్రుని గోరక్షణార్థం ఆయుధాలకోసం అర్జునుడు ఆయుధాగారానికి వెళితే, అక్కడ ద్రౌపదీ ధర్మజుల సమయభంగం చేశాడు. వారు చేసుకొన్న మర్యాద ప్రకారం అర్జునుడు ద్వాదశ మాసికవ్రతాన్ని సలుపుతానన్నాడు. ఇటువంటి వ్రతాలున్నాయని భావించవచ్చు (ఆది. 8-120).

38. అర్జునుడు సుభద్రకోసం ద్వారకానగరానికి వెళ్లాడు. శ్రీకృష్ణుని సలహాపై

పార్థుడు యతివేషధారు డయ్యాడు. బలదేవాదులకు తెలియకుండా కృష్ణుడు సుభద్రార్జునుల వివాహం రహస్యంగా జరిపించాడు. రహస్య వివాహము లుండేవని మనం తలంచవచ్చు. బృహస్పతి వివాహలగ్నాన్ని నిర్ణయించాడు (ఆది. 8-194).

39. సుభద్రార్జునులు ద్వారకనుండి బయలుదేరి ఇంద్రప్రస్థానికి వచ్చేటపుడు తొఱుపట్టుల విశ్రమించారు (ఆది. 8-210). అవి ఆలమందల విడిదు లన్నమాట. ఘోషయాత్ర అంటే ఆలమందల్ని పరికించటమే.

40. సుభద్రార్జునులు వెళ్లిపోతుంటే యదుసైన్యం అడ్డగించింది. అపుడు సుభద్ర రథాన్ని తోలటంవల్ల ఆ రోజుల్లో స్త్రీలకు రథచోదకత్వం తెలుసునని మనకు బోధపడుతోంది (ఆది. 8-202). ఆ రోజుల్లోనే అర్జునునికి అరణమిచ్చారు.
41. సుభద్రార్జునులకు అభిమన్యుడు ఉదయించాడు. ధౌమ్యనిర్మిత జాతకర్మ చౌలోపనయనుడయి అభిమన్యుడు అభ్యుదయం పొందాడు (ఆది. 8-226).

42. వేసవి కాలం వచ్చింది. శ్రీకృష్ణార్జునులు నిదాఘదివసాలు గడిపారు. ఆ సమయంలో అర్జునుడు ఖాండవ వనవిహారం చేద్దామని కృష్ణునితో చెప్పి వనవిహారం చేశారు. చెట్ల కారణంగా అడవులు చల్లగా ఉంటాయి కదా! వేసవి ఎండకు తట్టుకోలేక చల్లని ప్రాంతానికి వెళతారన్నమాట! (ఆది. 8-232).

43. అవసరార్థం ఆనాటి ప్రజలు అడవుల్ని దహింపచేసేవారని ఖాండవవన దహనకారణంగా తెలుస్తోంది (ఆది. 8-263). అగ్నిసూక్తం పఠిస్తే అగ్ని కాల్చడట!

44. మయుడు తన ప్రాణాన్ని రక్షించిన అర్జునునితో 'నేనేమి ప్రియము మీకు చేయగలను'. తాను దానవ విశ్వకర్మననీ చెప్పాడు. శిల్పకళాకుశలుడు కాబట్టి మయుడు ఏమి నిర్మించమంటారో చెప్పమన్నాడు. అప్పుడు కృష్ణుడు 'పెద్దయుం బ్రొద్దు విచారించి ధాత్రికపూర్వమైన సభాభవనాన్ని నిర్మించ'మని కోరాడు. ద్వాపరయుగంలో అతిమానుషమైన సభానిర్వహణ చేయగలరన్నమాట! (సభా. 1-5). నీరులేని చోట నీరున్నట్లు, సమస్థలంలో నీరున్నట్లుగా నిర్మించాడు.

45. మయడు మయసభను పదునాలుగు నెలల కాలంలో నిర్మించాడు (సభా.1-13).

46. మయసభా ప్రవేశం చేసినపుడు 'వీరుడు ధర్మజుండు పదివేవురు విపులకొప్ప పాయసాహారము భక్తి' పెట్టాడు. (సభా. 1-14). శుభముహూర్తంలో సభాప్రవేశం చేశాడు. మూలంలో మాంసాహారం బ్రాహ్మణులకు పెట్టినట్లుండగా నన్నయ పాయసాహారం బ్రాహ్మణులకు పెట్టించాడు. వ్యాసుని కాలంలో

బ్రాహ్మణులు మాంసాహారాలు, నన్నయ కాలంలో శాకాహారులని తెలుస్తోంది.

47. నూతగృహప్రవేశం చేసినపుడు వివిధ దేశాల రాజులు వచ్చి ధర్మరాజుకు రకరకాల బహుమతు లిచ్చారు. 'మద మాతంగ తురంగ లసన్మాణిక్యగాణిక్య సంపద లోలింగొని వచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించారట!' (సభా. 1-18). మాణిక్యాల తోపాటు గాణిక్యాలు అంటే వేశ్యాజనాన్ని కూడా ఇచ్చారు.

48. నారదుడు ధర్మరాజును రాజనీతి విషయాల్ని అడగటాన్నిబట్టి ఆ రోజుల్లో రాజ్యపరిపాలనావిధం సువ్యక్త మవుతోంది. నిఖిలయోగవృత్తులందు యోగ్యులయిన వారినే నియోగించారా? (సభా. 1-25). నీవు నమ్మినవారిని హితులు మాననీయులైన వారినే సేనాధ్యక్షులుగా చేశావా? దివ్యాంతరిక్ష భౌమోత్పాత ప్రతీకారులయిన వారా నీ దైవజ్ఞులు. చోరభయ వర్జితముగా పరిపాలిస్తున్నావా? భృత్యకోటికి తగినట్లుగా జీతమిస్తున్నావా? చోరుల దగ్గరనుండి ధనం తీసుకొని నీభటులు చోరుల్ని రక్షింపరు గదా? వణిజులకు శతైకవృద్ధిగా ఋణా లిస్తున్నావా? కుంటివారిని, మూగవారిని, గ్రుడ్డివారిని, వికలాంగుల్ని దయతో చూస్తున్నావా? ఆదాయంలో నాల్గవ భాగం కాని, మూడవ భాగం కాని, అర్ధ భాగం కాని వ్యయం చేయాలే గాని, అంతకంటే ఎక్కువ వ్యయం చేయరాదని సూచించాడు (సభా. 1-46). ఈ లోకం వార్తమీద ఆధారపడి ఉంది. వార్త నిర్వహించాలి రాజులు.

ఆ.వె. వార్తయందు జగము వర్తిల్లుచున్నది. అదియు లేనినాడ యఖిలజనులు

నంధకారమగ్న లగుదురు, గావున
వార్త నిర్వహింపవలయు పతికి. (సభా. 1-50)

49. భీమజరాసంధులు మల్లయుద్ధం గావించారు. 14 రోజులు మల్లయుద్ధం గావించటం విశేషం. గంధ మాల్యంబులందు లక్ష్మి ఉంటుందనే విశ్వాసం వారికుండేది (సభా. 1-184).

కం. హరియును కిరీటియును నొండొరులూ. బలవంతులూ ధీమంతులైన వారిద్దరి మధ్య మంచి స్నేహముంటే ఇతరులు ఈర్ష్యపడటం మానవనైజం అంటే అలాగే ఉంటుంది.

50. దుర్యోధనుడు, కృష్ణార్జునులు ఏకాత్ములని చింతిస్తున్నాడు. దొరుల కభీష్టములు సలుపుచుండుదు రంద య్యిరువురు నేకాత్ములు జన శరణ్యులుత్తములు నిత్యసాంగత్యమునన్. (సభా. 2-112)

## సమాజం

51. ధర్మరాజు చేసినటువంటి రాజసూయ యాగానికి విభిన్న దేశాలనుండి రాజులు వచ్చారు. అనేక బహుమానా లిచ్చారు. మూలంలో ఏకలవ్యుడు ధర్మజునకు స్వర్ణపాదుకలు సమర్పించినట్లుండగా నన్నయ ఏలనో ఈ విషయాన్ని విస్మరించాడు. ఏకలవ్యుడు ఎవరో కాదు. ధర్మరాజు పెద్దతల్లి బిడ్డడని హరివంశం (హరివంశం 3–139). 2-114).

52. ఒక్కొక్కసారి లక్షమంది భోజనం చేసేవారట! బ్రాహ్మణులకు ఎంతగానో ధనరాసు లిచ్చారట! అతిథులు భోజనం చేసిన తరువాతే అర్ధరాత్రంబు నపుడుగాని ద్రౌపది భుజించదట! (సభా. 2-118). ఏతెంచిన రాజులు ఎందరో అజావిగోమహిషంబులును, హయాల్ని, మత్తేభాల్ని, యోషిత్సహస్రాల్ని, హిరణ్యరత్నరజత కంబళాంబరాదుల నిచ్చారు (సభా.

53. దుర్యోధనుడు పాండవులతో జూద మాడాలని ధృతరాష్ట్రునితో చెప్పినపుడు దీనికి ఒప్పుకోకపోతే ఈ క్షణమ సర్వభక్షుచే భక్షితుండ నగుదునని బెదిరించటంతో ఆనాడు ఆత్మహత్య లుండేవన్నమాట! (సభా. 2-127).

54. ఆనాటి రాజలోకంలో పాచికలతో జూదమాడటం ఉంది. శకుని అభిమతాక్షాలు తీసుకొన్నాడు. పాచికల్లో ఇష్టమైనవి ఉంటాయి కాబోలు! (సభా. 2-176).

55. ధర్మజుడు తమ్ముళ్ళే కాదు, భార్య ద్రౌపదిని కూడా పణంగా పెట్టి జూద మాడాడు. ఈ రోజుల్లో కూడా మనం క్వాచిత్కంగా జూదంలో భార్య నొడ్డినవారిని చూస్తున్నాం. ద్రౌపది అడిగిన దానికి సమాధానాన్ని భీష్మద్రోణ విదురాదులు చెప్పలేకపోయారు. కౌరవ సభలో ద్రౌపది ఈ విధంగా ప్రశ్నించింది:

తే.గీ. మున్ను దన్నోటువడి మఱి నన్ను నోటు వడియెనో, నన్ను మున్నోటువడి విభుండు గ్రన్న దన్నోటువడియెనో యన్న నాకు నెఱుగజెప్పుము దీని నీ వెఱుగు దేని? (సభా. 2-209)

56. పాండవులు ద్వైతవనంలో కాలం గడుపుతున్నపుడు భీముడు తన అన్న ధర్మరాజుతో ఈ వనంలో 'పదమూడు మాసంబులు సలిపితిమి. సంవత్సర ప్రతినిధిగా మాసంబులు సేసికొనుట యెందునుం గలయదియ,

**దీన ధర్మవిరోధంబు లేదని' చెప్పాడు (ఆరణ్య. 1-266). ఆ కాలంలో ఈ ధర్మం ఉండేది కాబోలు!**

**57. సరియైన స్నేహం ఎలాగ ఉంటుందంటే కృష్ణార్జునుల మైత్రిలాగా! శ్రీకృష్ణుడు అర్జునునితో నేను నీవను భేద నియమంబు లేదైక్యనిష్ఠయ మనకు నిరువురకును నీకు నిష్టుండ, నాకు నిష్టుండు, మఱి నీ కనిష్టుండ, నాకు కర మనిష్టుండట్లుగా నమ్ముమన్నాడు (ఆరణ్య. 1-132). అటువంటి స్నేహితులు ఎక్కడ కనబడతారు.**

**58. మన కిష్టమైన వ్యక్తులు కనబడినపుడు మనం గడచివచ్చిన, అనుభవించిన కష్టాల్ని సానుభూతికోసం ఏకరువు పెట్టుకుంటాం. ఇలాంటివి నాడు, నేడు కూడా ఉన్నాయి. పాండవులు అరణ్యవాసం చేస్తున్నపుడు కృష్ణుడు అక్కడకు వెళ్లాడు. అపుడు ద్రౌపది 'నీ కన్నీ తెలుసనుకో, అయినా నా పడిన పరాభవం బెఱింగించెద నని కౌరవ సభలో తాను పడ్డ అవమానాన్ని తెలిపింది (ఆరణ్య. 1-136).**

**59. పాండవులు అరణ్యవాసం చేస్తున్నప్పుడు కృష్ణద్వైపాయనుడు ధర్మరాజుతో పార్థునికి ప్రతిస్మృతి అనే విద్య నుపదేశిస్తానన్నాడు. ప్రతిస్మృతి అనే విద్య కారణంగా అర్జునుడు అధిక తపోవిభవవీర్యుడై ఇంద్ర, యమ, వరుణ, కుబేరాది దేవతలను ఈశ్వరుని ప్రత్యక్షంబు సేసికొని దివ్యాస్త్రాల్ని పొందుతాడని చెప్పాడు (ఆరణ్య. 1-276). అటువంటి విద్యలు ద్వాపర యుగంలో ఉండాయి కాబోలు!**

**60. జూదాలు నెలలు తరబడి ఆడేవారు కాబోలు! నలుడు పుష్కరునితో అనేక మాసంబులు దుర్వ్యసనాసక్తుండయి, జూదమాడి ఓడిపోయాడు. నలదమయంతులు పెక్కు కష్టాలుపడి చివరకు మళ్లీ నలుడు పుష్కరునితో దమయంతిని పణంగా ఒడ్డి పునః ద్యూతమాడి జయించాడు. నలుడు, ధర్మరాజు ఇద్దరూ భార్యల్ని పణంగా పెట్టి జూదమాడటంవల్ల ఆ రోజుల్లో ఈ లక్షణం ఉంది కాబోలు! నేడూ ఉంది.**

**ఈ సామాజికాంశాలన్నీ వేదవ్యాస కాలంనాటివే! ఎక్కడైనా ఒండు రెండు నన్నయ కాలంలోనివి ఉదాహృతాలు. సాహిత్యంలో సమాజం ఇలా ప్రతిబింబిస్తుంది కదా!**

# తిక్కన భారతంలో సామాజిక స్పృహ



ఆచార్య బూదాటి వేంకటేశ్వర్లు
✆ 94413 30511

ఔదాసీన్యమునుజ్జగింపుము వయస్యా! కర్మవీరుండవై
పాదమ్మూంచుము యుద్ధరంగమున నీ స్వాతంత్ర్య శంఖధ్వనుల్
వేదవ్యాస ప్రబంధ భవ్యకవితావేశమ్ములో మ్రోగు ని
నాదర్శమ్ముగ చెప్పుకొందురు భవిష్యత్ భారతీయ ప్రజల్

ఇది విజయశ్రీ కావ్యంలోని కరుణశ్రీ పద్యం. భారత స్వాతంత్ర్య రణరంగోత్సాహానికి, పేరిణీ నృత్యంలా భారతకథ భారతీయులకు ప్రేరకమై, కవి పండిత గాయక నటవైతాళికుల కళా చైతన్యాన్ని పాలించిందంటే ఇంతకంటే సామాజిక దోహదానికి ఉదాహరణ ముంటుంది?

'సామాజిక స్పృహ' - అనే పదం 1930వ దశకం నుండి కుడియెడమగా 80వ దశకం వరకు సాహిత్యలోకంలో వీరవిహారం చేసింది. 'సామాజిక స్పృహ' - అంటే 'సమాజం', అందులోని సమస్యలు రాసే గ్రంథంలో ఉండాలనా? లేక సమాజానికి ఉపయోపడాలనే స్పృహతో కవి రాయాలనా? ఒక వేళ ఆ రెండు సందర్భాలను పట్టించుకుని చూస్తే, భారతానికి మించిన అర్హతగల గ్రంథం భారతీయ సాహిత్యంలో మరొకటి కనిపిస్తుందా?

లోకం కోసం, వాళ్ల సంతోషం కోసం రాస్తున్నామని చెప్పిన కవి తిక్కన. మానవ జీవితంలో సందేహం వస్తే భారత ముకురంలో చూసి తీర్చుకొమ్మని పెద్దలు చెపుతారు.

'ఆంధ్రావళిమోదముంబొరయ' - తిక్కన రాసిన భారతం మానవ సమాజానికి ప్రత్యక్ష దర్పణం. ఇంటింటి భారతాలన్నీ కలిసి మహాభారత్ అయితే ఆ మహాభారతాన్ని రాసిన కవి అనుభవం కూడా మహాభారతమైందే.

తిక్కన చూచిన జీవితమే ఒక మహాభారతం. ఆయన జీవితం చుట్టూ తిరిగిన సన్నివేశాలన్నీ మహాభారతపు సన్నివేశాలవంటివే. ప్రభుత్వ రాజకీయాలతో మతం కలిస్తే దేశమెలా అన్యాయమై పోతుందో పల్నాటి భారతం కళ్ళముందే బోధపరచింది. మనుమసిద్ధితో కలిసి చేసిన ప్రయాణం రాజకీయ చతురతను, లోకవృత్తాన్నీ, యుద్ధనీతిని నేర్పింది. మనుమసిద్ధికి దాయాదులవలన ఏర్పడిన క్లిష్టతలను స్వయంగా చూశాడు. అజ్ఞాతవాసం అంటే ఏమిటో మనుమసిద్ధితో కలిసి అనుభవించటంతో తెలిసింది.

"తానే ఒకప్పుడు ధర్మరాజై, మరొకప్పుడు కృష్ణుడై, వ్యాసుడై జీవిత భారతాన్ని నిర్వహించాడు. ముందు ఎంత కథ నడిచినా దాయాదులకుట్రకు గురియై, మనుమసిద్ధి గద్దెను కోల్పోయి అడవులలో అజ్ఞాతవాసం చేస్తున్న తరుణంలోనే తిక్కన పాత్ర కీలకపాత్రగా మారింది. తిక్కన భారత రచన కూడా అక్కడే మొదలయింది. సోమయాజి తిక్కన అంపశయ్యమీది భీష్ముడు. పాండవ మహాప్రస్థానానంతర వ్యాసుడు. వ్యాసుని వేదనం మూలభారతం. తిక్కన సంవేదనం తెలుగు భారతం" (సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు, పుట-8) అందుకే భారతం నిండా సమాజంలోని పాత్రలే సాక్షాత్కరిస్తాయి.

> నన్నయ భారతం కంటే తిక్కన భారతంలోని పాత్రలే మానవస్పందనలకు దగ్గరగా కనిపిస్తాయి. ఏ పాత్రను తీసుకున్నా ఆ పాత్ర మనలను పట్టి ఊపుతాయి.

నన్నయ భారతం కంటే తిక్కన భారతంలోని పాత్రలే మానవస్పందనలకు దగ్గరగా కనిపిస్తాయి. ఏ పాత్రను తీసుకున్నా ఆ పాత్ర మనలను పట్టి ఊపుతాయి. సంఘటనలు, సంఘర్షణలూ, కాలం ఎంత గడచినా మృతిలోని మానవోద్రేకాలూ, సాధారణ మానవ మనస్తత్వాలూ అడుగడుగునా తారసపడతాయి. ప్రతిపాత్రా సమాజంలో ఉన్నదే. ఆహార్యంలో మార్పు తప్ప అంతరంగంలో ఒకటే. వ్యవహరించే తీరులో ఒకటే.

మర్మమెరిగి బొంకులాడే ధర్మరాజుడు, నేటి రాజకీయ నాయకునికి దగ్గులు నేర్పినవాడు కాడా? పాపాలు చేసేకొడుకుల్ని కాపాడే మన మంత్రులు, అధికారులు

ధృతరాష్ట్ర బుద్ధులుకారా? కుటుంబాల కోసం పెళ్లి పెటాకులు లేకుండా జీవితాన్ని ధారవోసే ఆడా, మగా మన భీష్ముని పోలిక కాదా? అసలు కథకు మూలమైన అన్నదమ్ముల ఆస్తి తగాదాలే కదా! భర్త నిర్వహణలో కుటుంబం అప్పులపాలై చితికిపోతే, ఎంత అణకువగా ఉన్న భార్యయైనా ఏదో సందర్భంలో భర్తను తిరస్కరించి మాట్లాడుతుంది. భారతంలో ద్రౌపది ధర్మరాజును ఎన్ని సందర్భాలలో అలా మాట్లాడిందో ప్రత్యేకంగా పరిశీలించాలి. శ్రీకృష్ణుని వంటి మేనల్లుళ్లు, కుంతివంటి ఇంతులు, పాండవుల వంటి సోదరులు ఎంత ఆదర్శంగా కనిపిస్తారో అంత సజీవంగానూ కనిపిస్తారు. భీముడు, సవ్యసాచి, దుశ్శాసనుడు, సైంధవుడు, అభిమన్యుడు, శల్యుడు, కీచకుడు, కుంతి వంటి పాత్రలను ఈనాడు కొన్ని గుణాలకు సంకేతించి, ప్రతీకాత్మకంగా చెప్పుకుంటున్నాం. పద్యాలు చెప్పమని ఎవరైనా అడిగితే తడవుకోకుండా నేను తిక్కన భారతంలో ముచ్చటగా చెప్పే పద్యాలు మూడు

1. ఒరులేయవి యొనరించిన
   నరవర! యప్రియము ధనమనంబునకగుఁదా
   నొరులకు నవిసేయకునికి
   పరాయణముపరమధర్మపథములకెల్లన్. (శాంతి 5-220)

ఈ పద్యం యుద్ధ విజయానంతరం, అంపశయ్యపై పరున్న తాత దగ్గర ధర్మాదుల్ని నేర్చుకుంటూ 'ధర్మ' మంటే ఏమిటి? దాని తీరుతెన్నులు చెప్పమంటూ మనుమడడిగిన ప్రశ్నకు తాత చెప్పిన సమాధానమిది. మనుమడు ధర్మజుడు. తాత భీష్మాచార్యుడు. ఇంతకంటే మనిషి మనుగడకు ఆదర్శమైన ధర్మముంటుందా? దీనిని మించిన సమాజ హితాన్ని కోరే బోధ ఉంటుందా? వ్యక్తి కేంద్రకంగా మనుగడ సాగించే సమాజపు శోభకు ఇంతకుమించిన ఆదర్శవంతమైన చట్టముంటుందా? నాకు మేలు జరిగితే నా కులం మొత్తానికో, నా జాతి మొత్తానికో మేలు జరిగినట్లని భావించే అస్తిత్వ చైతన్యపు వెలుగులో నడుస్తున్న ప్రస్తుత సమాజానికి ఇది వసివాడని శాశ్వతమైన ఆదర్శనీతి. సృష్టి ఉన్నంతవరకు 'లోకాస్సమస్తాసుఖినోభవంతు' - అనటానికి ఆదిమూలమైన శ్రేయోవాక్కు ఇది. 'Ever green forever ఇదే సమస్త ధర్మసారం. సర్వజంతు సంతానంలో, వృక్షాలలో, శిలలలో, పచ్చిగడ్డిలోనూ ప్రాణమున్నదన్న ఋషులు, సర్వసృష్టిలోని ప్రాణం - జీవం - ఆత్మ కళకళలాడాలని, సర్వ ప్రాణికోటిని సమాదరించి సమారాధించే భూతదయను సమాజానికి నేర్పటం కోసం హిమాలయోత్తుంగ శృంగంగా వెలిగించిన దివ్యజ్యోతి ఈ భావం.

ఇక రెండవ పద్యం.

2. "సారపుధర్మమున్ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
 బారముఁ బొందలేక చెడఁ బారినదైన యవస్థ దక్షులె
వ్వారలుపేక్ష సేసిరది వారల చేటగుఁ గాని ధర్మని
స్తారకమయ్యు సత్య శుభదాయకమయ్యు దైవముండెడున్"
(ఉద్యో.3-273)

ఇది రాయబారానికి వెళ్లిన శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో అన్నమాటలు. ఇది సమాజంలోని పాలకులకు, ధర్మానికి పాపం వలన నిర్మలమైన సత్యానికి బొంకువలన ఇబ్బంది ఏర్పడి ఒడ్డుకు చేరలేక చెడిపోయే స్థితి ఏర్పడినప్పుడు, వాటిని కాపాడి రక్షించే స్థితిలో ఉండి కూడా స్పందించకుండా ఉపేక్షాభావంతో ఎవరు ఉంటారో, అది వాళ్లకే చేటు కలిగిస్తుంది. అంటే దక్షత కలిగి కూడా, ధర్మపుమనుగడకు దోహదం చేయని వారికి చేటుతప్పదు. ఆ చేటుకు కారణం ఉపేక్షయే.

ప్రస్తుత సమాజంలో చదువుకున్నవాళ్లు, ఉన్నత పదవులు నిర్వహిస్తున్నవాళ్లు, పాలకులు, ధర్మం పట్ల తూష్ణీభావాన్ని వహిస్తున్నారు.

ప్రస్తుత సమాజంలో చదువుకున్నవాళ్లు, ఉన్నత పదవులు నిర్వహిస్తున్నవాళ్లు, పాలకులు, ధర్మం పట్ల తూష్ణీభావాన్ని వహిస్తున్నారు. తమ మేలు తప్ప సమాజం గురించిన పట్టింపే లేదు. చట్టాల్ని కాపాడవలసినవాళ్లే, ఆ అధికారమున్నవాళ్లే చట్టాన్ని చట్టుబండలు చేస్తున్నారు. కొందరు శక్తి ఉండి కూడా అన్యాయాన్ని అన్యాయమని అనకుండా, నోరెత్తితే లభించబోయే ప్రయోజనం పోతుందేమోనని భావించే ఉపేక్షాభోగజీవులున్నారు. వాళ్లు పొందేది చివరికి చేటే గాని దైవం దగ్గర చోటుకాదు. ఈ వేళ సమాజంలోని అన్ని రుగ్మతలకు కారణమీ ఉపేక్షయే.

పక్కింట్లో దొంగతనం జరుగుతుంటే మనిల్లు కాదుగదా అనుకోవడం, ఓటు వేయటానికి పోకుండా ఇంట్లోనే కూర్చోవటం తప్పును తప్పుగా ఖండించకపోవటమూ దేశమంతా వరదలో కొట్టుకుపోతున్నా నేను మాత్రమే క్షేమంగా ఉండాలనుకోవటమూ ఉపేక్షే. ఈ ఉపేక్షవల్లనే సామాజిక నష్టాలు

కొల్లలు... కొల్లలు. ఇటీవల కాలంలో పవన్ కల్యాణ్ ప్రస్తావించిన పాస్టర్ మార్టిన్ నియోమోలర్ చేసిన వ్యాఖ్యల్ని ఈ సందర్భంలో చెప్పటం ఈ ఉపేక్షకు సరయిన ఉదాహరణ. "మొదట్లో నాజీలు సోషలిస్టుల కోసం వచ్చారు. నేను సోషలిస్టును కాను. కాబట్టి స్పందించలేదు. తర్వాత వాళ్లు ట్రేడ్ యూనియన్ నాయకులకోసం వచ్చారు. నేను యూనియన్లలో లేను కాబట్టి అప్పుడూ స్పందించలేదు. తరువాత యూదుల కోసం వచ్చారు. నేను యూదుడును కాదు గనుక స్పందించలేదు. చివరిగా వాళ్లు నా కోసం వచ్చారు. అప్పుడు నాకోసం మాట్లాడటానికి ఒక్కరూ లేరు." - అని మార్టిన్ చెపుతాడు. ఇదే ఉపేక్ష చేయటం వలన కలిగే ధర్మహాని. ధర్మగ్లాని. అలా ఉపేక్ష వీడి 'ధర్మో రక్షతి రక్షితః' - అన్న సత్యోక్తిని నమ్మి చైతన్యశీలంతో జీవించమని ఒక సామాజిక బాధ్యతను గుర్తుచేస్తోంది. హెచ్చరిస్తోంది ఈ పద్యం.

3. పగయడగించు టెంతయు శుభం బదిలెస్సయడంగునే పగం
బగ, వగగొన్న మార్కొనక పలకయుండగవచ్చునే కడుం
దెగమొదలెత్తి పోవఁ దీర్పఁగ వచ్చిన క్రౌర్యమొందునే
మిగతిఁదలంచినంబగకు మేలిమిలేమి ధ్రువంబు కేశవా!
(ఉద్యో. 3-210)

ఈ పద్యాన్ని ఐక్యరాజ్యసమితి పతాకంపై సువర్ణాక్షరాలతో వ్రాయదగ్గ దీక్షా వాక్యమని మా మస్తాన్ రెడ్డి లాంటి వాళ్లు. మానవజీవితం సంక్షుభితం కావటానికి సగం కారణం పగ. ఈ పగ పర్యవసానం ఎలా ఉంటుందో వివరిస్తుందీ పద్యం. ఏ విధంగా చూసినా పగకు మేలిమిలేదన్నది నిశ్చితాభిప్రాయం. ఓడినవాడు కోర్టులో ఏడిస్తే, గెలిచినవాడు ఇంటికొచ్చి ఏడ్చాడట. యుద్ధమైనా అంతే! ఎన్ని యుద్ధాలను ఆధునిక కాలంలో చూడలేదు. ప్రస్తుతం ఉక్రెయన్పై జరుగుతున్న యుద్ధం చూడండి! ఎంతటి దారుణ మారణకాండ. నాగరికతకే సవాలు విసరుతోంది! ఆక్రౌర్యాన్ని దానికి మూలమైన ఈర్ష్యాసూయల్ని వదలివేయమని ఈ పద్యం తెలుపుతోంది. వ్యక్తి, కుటుంబం, ప్రాంతం, దేశం ప్రపంచం అన్యోన్యానురాగంతో వర్తిల్లి తామరతంపరగా వర్ధిల్లాలన్నది తాత్పర్యం.

స్త్రీ పర్వంలోని ఆక్రందనలన్నీ యుద్ధం వలన కలిగిన సర్వనాశనపు ప్రస్తావనేకదా! రెండవ ప్రపంచయుద్ధంలో హిరోషిమా, నాగసాకి మీద జరిగిన బాంబుదాడి తరువాతి స్థితిని తలపింప చేసేవాతావరణమిది. అందుకే మహాభారత కావ్యాన్ని ఇరావతికార్వే వంటి వాళ్లు విషాదాంత కావ్యంగా భావించారు.

యుద్ధ విజయం తరువాత ధర్మరాజు మనఃస్థితి యేమిటి? కృష్ణ, వ్యాస, భీష్మాది పెద్దలెంత బోధించినా ఆ మనసులో ఇష్టజన బంధు సందోహాన్ని

కోల్పోయామన్న మానసిక వేదన నిరంతరం తొలుస్తూనే ఉంది. ఆశ్రమవాసంలో ఉన్న ధృతరాష్ట్ర దంపతుల్ని, తన తల్లిని చూడటానికి వచ్చి ధర్మరాజు మరలి రాజ్యానికి తరిమినా వెళ్లనని, మీ సేవలో యిక్కడే ఉండిపోతానని ఏడుస్తూ

కII "విను పాంచాలురు మాత్స్యులు
వనితాజనశేషులైరి; వారలు లేమిన్
జననీ? శూన్యంబైతో
చినయది రాజ్యంబునాదు చిత్తంబునకున్" (ఆశ్ర. 2-138)

అని అంటాడు. పాంచాలరాజు వారి సంతానం ద్రౌపది తరపు బంధుత్వం. మత్స్యదేశపాలకులు వారి సంతానం, అభిమన్యుని భార్య ఉత్తర తరపు బంధుత్వం. వాళ్లులేని రాజ్యం నాకు మానసికశూన్యంగా ఉందని రోదిస్తాడు. అదే శత్రుత్వం, పగ, ఈర్ష్య, క్రోధం వంటి ఏ పేర్లు పెట్టి పిలిచి చెప్పుకున్నా చివరి పర్యవసానం మానసిక అశాంతి. మనశ్శూన్యం. అందువలన 'వలదధిక దీర్ఘవైరవృత్తి'- అన్న సుభాషితం చెదలుపట్టని శాశ్వత సత్యం. సకల సంపదాప్తికి పరమసాధనం.

విరాటపర్వంలో అజ్ఞాతవాసానికి ఉద్యుక్తులవుతున్న పాండవులకు ధౌమ్యుడు రాజసభలో, రాజులతో ఎలా మెలగాలో చెపుతాడు. వాటిలో ఏ ఒక్కటీ అసందర్భమైందిలేదు. ఇప్పటికీ వర్తిస్తాయి. అదేమిటండీ! మనం ప్రజాస్వామ్యయుగంలో జీవిస్తున్నాం కదా! ఎప్పుడో ఫ్యూడల్ వ్యవస్థలో జీవించిన కాలంనాటి code of conduct ఇప్పుడెలా వర్తిస్తుందని అనుకోవచ్చు. మన డెమొక్రసీ హిపోక్రసీతో కూడింది. మేడిపండు లాంటిది మన పాలకులు పాటించే ప్రజాస్వామ్యం. మన పాలకుల బుద్ధులన్నీ రాచరిక వ్యవస్థలోని ఏ రాజుకంటే తీసివేయలేనివి. మన ముఖ్యమంత్రులు, ప్రధానమంత్రులు, వాళ్ల మంత్రులు, ఉన్నతాధికారులు అందరి బుద్ధులు వ్యవహారంలో ఫ్యూడల్ తత్త్వమే. వాళ్ల కింద పనిచేసే ఉద్యోగులందరూ ధౌమ్యులవారు చేసిన హితబోధను అక్షరాక్షరం పాటించేవాళ్లే.

> "విరాటపర్వంలో అజ్ఞాతవాసానికి ఉద్యుక్తులవుతున్న పాండవులకు ధౌమ్యుడు రాజసభలో, రాజులతో ఎలా మెలగాలో చెపుతాడు. వాటిలో ఏ ఒక్కటీ అసందర్భమైందిలేదు."

'రాజగృహంబుకంటె నభిరామముగా నిలుగట్టఁ గూడదు' (విరా.123) - అన్న వాక్యాన్నే చూడండి. ఒక సి.ఎం. పేషీలోని ఉద్యోగిగాని, పి.ఎం. కార్యాలయ ఉద్యోగి గాని తమ 'బాస్' కంటే మంచివిలువైన అందమైనదైన ఇంటిని కట్టుకుంటే సహిస్తాడా? ఆఖరుకు ప్రైవేట్ కంపెనీ బాస్ అయినా తన కంపెనీ ఉద్యోగి తనకంటే మించిపోతే భరిస్తాడా? అందుకే మించిపోయేస్థితి వాస్తవానికి ఉన్నా, ఆస్థానంలో ఉద్యోగిగా ఉన్నంతవరకు, ఉండాలని అనుకున్నంతవరకు ఈ జాగ్రత్త పాటించాలని చెపుతాడు. రాజులాగా వేషభాషలు విహారాలు కూడదని, సంపదననుభవించటం రాజుకు కంటకం కాని రీతిలో ఉండాలనటం, రాజుగారి దగ్గరుండే చీమతో దోమతోనైనా వైరం తగదనటం, రాజుకు ఇష్టంలేని వాళ్లతో, రాజు నిరాదరించినవాళ్లతో స్నేహం చేయవద్దని చెప్పటం, రాజు ఆంతరంగిక విషయాలు తానై బయట చెప్పేవరకు సేవకుడు బయటకు చెప్పరాదనటం వంటివన్నీ ప్రభుత్వోద్యోగులకు ముఖ్యంగా సి.ఎం., పి.ఎం. వంటి ఉన్నత పదవులు నిర్వహించే వారి ఆస్థానాలలో (పేషీల)లో ఉండే I.A.S., I.P.S. వంటి అధికారులందరూ పాటించవలసిన code of conduct protocall.

> కీచకవధ, రావణవధ రెండింటి నీతి ఒక్కటే. పరస్త్రీ పట్ల పెంచుకున్న అధర్మకామ పరిణామాన్ని చెప్పటమే. కాలేజీలలో, విశ్వవిద్యాలయ వీధులలో ఆడపిల్లల్ని వేధించే నీచులైన కీచకుల్ని మనం చూస్తూనే ఉన్నాం.

కీచకవధ, రావణవధ రెండింటి నీతి ఒక్కటే. పరస్త్రీ పట్ల పెంచుకున్న అధర్మకామ పరిణామాన్ని చెప్పటమే. కాలేజీలలో, విశ్వవిద్యాలయ వీధులలో ఆడపిల్లల్ని వేధించే నీచులైన కీచకుల్ని మనం చూస్తూనే ఉన్నాం. తన ప్రేమ నంగీకరించలేదని యాసిడ్ దాడులో, మరోవిధమైన మారణకృత్యాలో చేయబూనే వాళ్లందరూ 'విరాటుని సభకు రక్షించమని పరుగెత్తుకొని పోయిన ద్రౌపదిని నేలకూలేలాగా కొట్టిన కీచకుని చర్యల వంటివే కదా?! మానవుడి నడవడిని తీర్చిదిద్దుకోవటానికి ఉపకరించే అక్షర దర్పణాలివి.

విదురనీతులలో ఏ ఒక్కటీ తీసివేయతగినది కాదు. భీష్మద్రోణ పర్వాలలోని భీష్మ ద్రోణుల వ్యవహారమంతా ఓడిపోతామని తెలిసికూడా, పార్టీని వదలివేరే పార్టీలోకి వెళ్లలేక, అధిష్ఠానం మాట

తిరస్కరించలేక నలిగి పోయే మన రాజకీయ నాయకులను తలపింపచేస్తుంది. చివరకు ఎన్నికలలో నిలబడి ఓడిపోవటం లాంటిదే వారి మృతి కూడా? కర్ణుని మితిమీరిన ఆత్మవిశ్వాసం, కృతజ్ఞతతో కూడిన స్వామిభక్తి వంటివన్నీ పదవులు పొంది, అధిష్ఠానం మెప్పుకోసం అవతలి పక్షం వాళ్లను నోటికొచ్చినట్లు తిట్టే ఆధునిక రాజకీయ నాయకులకేమీ తీసిపోని వ్యవహారమే. పాలకుడు చెప్పుడు మాటలు వింటే ఎలా మోసపోతాడో వ్యాఘ్రగోమాయు సంవాదం వంటి ఘట్టాలు వివరిస్తాయి. భీష్ముడు ధర్మరాజుకు బోధించి అంశాలలో చాలావరకు నేటి పాలకులకు కూడా ఒజ్జబంతులే (Guidelines). భీష్ముడు చెప్పిన కణికనీతి రాజకీయ నాయకులందరికీ అభ్యాసవిద్య. మాక్ విల్లీ లాంటి ఆధునిక రాజనీతిజ్ఞుడు చెప్పినట్లు అనిపిస్తుంది. లోకంలో నష్టపడి ఏడుస్తున్న వాడి దగ్గరికి పోయి తమ స్వార్థాన్ని తాము చూచుకుంటూనే ఎలా సలహాలు చెప్పి, ఓదార్పు నటిస్తారో 'గృధ్రుజంబుకోపాఖ్యానం' - వంటివి చెపుతాయి. తగాదా వచ్చినప్పుడు, స్త్రీల పట్ల అపరాధం చేస్తే, దాని తీవ్రత ఎలా ఉంటుందో దానికి ప్రత్యక్ష ఉదాహరణ భారతకథ. స్త్రీల విషయంగా లౌల్యాదులున్నవారు ఎంతటి దగ్గరి ఆత్మీయులైనా ఎలా కలహించుకొని నశిస్తారో సుందోపసుందులకథే నిదర్శనం.

భారతం, కుటుంబ జీవనానికి ఉపయోగపడే వందల సంఘటలను చిత్రించింది. అశ్వమేథపర్వంలో వ్యాసుడు ధర్మజుని అశ్వమేధానికి ప్రధాన ఋత్విక్కు. యాగానంతరం భూరి దక్షిణలతోపాటు, అర్జునుడు యాగాశ్వం వెంట వెళ్లి జయించిన భూమిని మొత్తాన్ని వ్యాసుడికి ధర్మరాజు దానం చేయగా, మాకు రాజ్యందేనికి దానికి మారుగా బంగారాన్ని ఇమ్మని వ్యాసుడు అడుగుతాడు. దానమిచ్చిన రాజ్యం తిరిగి తీసికోనని ధర్మజుడు అంటాడు. సోదరులూ అన్నగారినే సమర్థిస్తారు. అప్పుడు వ్యాసుడు ఈ భూమిని అమ్ముతాము. మీ ధనంతో కొనండని చెపుతాడు. అప్పుడు ధర్మజుడు కోటి మాడలకు కొని, ఆ ధనాన్ని వ్యాసులవారికి యిస్తాడు. ఆ ధనాన్ని వ్యాసుడు మిగిలిన విప్రులందరికీ పంచి, తనవంతు ధనాన్ని తన చిన్న కోడలైన కుంతికి యిస్తాడు. ఈ సందర్భంలో

> భారతం, కుటుంబ జీవనానికి ఉపయోగపడే వందల సంఘటలను చిత్రించింది. అశ్వమేథపర్వంలో వ్యాసుడు ధర్మజుని అశ్వమేధానికి ప్రధాన ఋత్విక్కు.

వ్యాసుని ప్రవర్తన మన కుటుంబాలలో ఉండే పెద్దవాళ్లను పోలుతుంది. ఇంటికి వచ్చిన బంధువులు, ఉద్యోగిస్తున్న పిల్లలు ఇళ్ళల్లో ఉన్న వయసు పైబడ్డ వాళ్ళకు పెద్దవాళ్లు కదా అని ప్రేమతో పండ్లు కొనుక్కోమనో మరో అవసరానికి ఉపయోగించమనో రూపాయో పరకో యిస్తే 'నాకెందుకురా? అని తీసికొని ఆ డబ్బుని మళ్లీ కోడలికో మనుమరాలికో ఇస్తుంటారు. అదుగో అటువంటి సందర్భమే యిది.

మౌసల పర్వం అంతఃకలహాలవల్ల కలిగే నష్టం ఎలాంటిదో తెలుపుతుంది. ఆశ్రమవాస పర్వంలో, శోకం నుండి తేరుకున్న హృదయాలు ఎలా వర్తిస్తాయో గమనించగలం.

> వ్యక్తుల పట్ల ఎక్కువకోపముండి అది తీర్చుకోవటానికి ప్రత్యక్షంగా వీలుకానప్పుడు వాళ్ల పంటలనో, పశువులనో, ఆస్తులనో పరోక్షంగా నష్టపరుస్తుంటారు.

వ్యక్తుల పట్ల ఎక్కువకోపముండి అది తీర్చుకోవటానికి ప్రత్యక్షంగా వీలుకానప్పుడు వాళ్ల పంటలనో, పశువులనో, ఆస్తులనో పరోక్షంగా నష్టపరుస్తుంటారు. వ్యక్తిగత కక్షల నేపథ్యంలో బత్తాయి చెట్లను నాశనం చేయటం, అరటితోటను నరికివేయటం, పత్తిచేను బాగా విరగకాచి, పత్తికాయలు పగిలి విచ్చుకున్నప్పుడు ఆ చేనును తగలబెట్టటం వంటి చర్యలు చేయటం వంటివే అశ్వత్థామ నిర్వహించిన సౌప్తిక ప్రళయం.

మన పాలకులు ఔరంగజేబుకు వారసులై రకరకాల పన్నులతో ప్రజానీకాన్ని పీడించటం, సామాజిక వనరుల్ని అధికారం అడ్డుపెట్టుకొని దోచుకోవటం మనం చూస్తూనే ఉన్నాం. ప్రజాసంక్షేమాన్ని కాంక్షించే పాలకుడు ఎలా పన్నులు విధించాలో భారతం చెపుతుంది. కార్యసాధకుడు ఎలా ఉండాలో చెప్పిన ఈ పద్యాన్ని గమనించండి -

"మాలకరి పుష్పములు కోయలమాడ్కిఁ, దేటి
పువ్వు దేనియ గొనియెడి పోల్కి నెదురు
గందకుండఁగఁ గొనునది కార్యఫలము
బొగ్గులకుఁబోలె మొదలంటఁబొడువఁ జనదు" (ఉద్యో. 2-57)

మాలకోసం పూలను కోసేవాడు ఎలా చెట్టునుండి పూలను సేకరిస్తాడో, తుమ్మెద కుసుమంనుండి మధువును సేకరించిన విధంగా, ఎదుటివాడు బాధపడని రీతిలో ఫలాన్ని పొందాలని చెపుతాడు. పాలకోసం పొదుగును కోసినట్లుగా, బొగ్గులకోసం చెట్టును మూలంతో సహా నరికితే పొందే ప్రయోజనం లాంటిదే ఎదుటి వారిని కష్టపెట్టి పొందే ప్రయోజనమని తాత్పర్యం.

సందర్భం వేరయినా తప్పని సరిగా పాలకులు ప్రజల పట్ల వ్యవహరించవలసిన తీరు ఇదే!

ఇలా చెప్పుకుంటూ పోతే ఎంతయినా, తిక్కన భారతాన్ని గురించి చెప్పుకోవచ్చు. లోకంలో భారతాన్ని చదవటం కష్టమని, భాగవతానికి అర్థం చెప్పటం కష్టమని అంటారు. దానికి కారణం తిక్కనగారు భారతంలో ఒదిగించిన కాకువే. ఆ వాక్ వైచిత్రిని, రసానుగుణమైన సంభాషణల ఒడుపును తెలుసుకొని చదవటం కష్టమని తాత్పర్యం. అందువలననే భారతంలో ముఖ్యంగా తిక్కన భారతంలో సజీవ సమాజం సాక్షాత్కరిస్తుంది.



*"Freedom is not a mere matter of political decision or new constitutions... it is of the mind and heart and if the mind narrows itself and is befogged and the heart is full of bitterness and hatred, then freedom is asent."*
- జవహర్‌లాల్ నెహ్రూ

# ఎర్రన రచనలలో ఆధునిక భావాలు

కీ. శే. ఆచార్య పి.ఎల్. శ్రీనివాసరెడ్డి

కొత్త ఒక వింత పాత ఒక రోత' అనే సామెతను స్మరించుకుంటూ గతమంటే ఖతం అని అనుకుంటున్న తరుణంలో ఆధునిక మహాకవి గురజాడ అప్పారావు మంచి గతమున కొంచెమేనోయ్ అన్నాడు. గతంలో కొంచెం మంచి వుందని సూచించాడు. అందువల్ల గతంలోని మంచికి స్వాగతం పలుకుదాం. అలాగే ప్రాచీన కవిత్వంలోని ఆధునికతను ఆహ్వానిద్దాం.

'పేదలు' ఖండికలో వాళ్ళ కళ్లని వర్ణిస్తూ శ్రీ శ్రీ
'అంతేలే పేదల కన్నులు
వినమ్రములు వెతల వ్రణమ్ములు తుఫానులో తడిసిన జడిసిన
గోమాతల కన్నుల తమ్ములు' అన్నాడు.



శ్రీశ్రీ మహాకవి రచించిన ఈ గేయ భాగానికి, 14వ శతాబ్దం నాటి ఎర్రన మహాకవి హరివంశంలోని గోవర్ధనోద్ధరణ ఘట్టానికి లంకె వుందంటూ గోవులు 'నిరంతర ధారాపాతంలో తడిసి, కొమ్ములొడ్డి, కన్నులుమోడ్చి, కడరెప్పల నీళ్ళు కారన్, తలలు డిగ్గవైచి, నెమరులుడిగి, మూర్ఛపోయి నట్లున్న ఈ సంపూర్ణ చిత్రం కళ్ళ ముందు కనబడ్డాక పైన పేర్కొన్న శ్రీశ్రీ గేయభాగం అర్థం బోధపడుతుంది అంటాడు ప్రాచీనాధునికాంధ్ర సాహిత్యాన్ని ఆపోశన పట్టిన అపర అగస్త్యుడు, "సమగ్రాంధ్ర సాహిత్యం" రచయిత ఆరుద్ర..

మహాబలిశాలి అయిన ఒక విలుకాడు తన వెన్నంటివున్న అమ్ములపొదిలో నుంచి తీసి, వింటినారి మీదవుంచి, ఆకర్ణాంతం లాగి వదిలిన బాణం అతని శక్తియుక్తుల ఆధారంగా ఎంతో దూరం... అనూహ్యమైన దూరం-వెళుతుంది. అలానే ఒక మహాకవి గతంలో జరిగిన ఇతివృత్తాన్ని గ్రహించి తన పదునైన మేధలోనుంచి ఝరీవేగంతో వెలువరించిన అక్షరాలు సుదూర భవిష్యత్తులోకి చొచ్చుకు పోతాయి. అవి ఎంత దూరం వెళతాయనేది అతని గొప్పతనం మీద ఆధారపడివుంటుంది. అలాంటి గొప్ప కవుల కోవలోకి వచ్చే మొదటి కవి ఎర్రన...

'పురుషులందు పుణ్యపురుషులు వేరయా' అన్నట్లు ప్రాచీన కవులలో ఆధునికత ఆనవాళ్లున్న విలక్షణమైన కవి ప్రబంధ పరమేశ్వరుడు. ఆ ప్రాచీన కవి కవితలలో నూతనత్వమెలా వుందో గమనిద్దాం. ఉదాత్త సమాజ నిర్మాణాకాంక్ష:

తండ్రి కూతుర్ని తల్లీ! అని సంబోధించడం సాధారణం. కానీ ద్యుమత్సేనుడు తన కోడలు సావిత్రిని (సత్యవంతుని భార్యను) తల్లీ! అని ఆప్యాయంగా సంబోధిస్తాడు. కోడలు సాక్షాత్తు కూతురు కాకపోయినా, **daughter in-law** కదా మరి. ఇంకొక సందర్భం కంసునికి సోదరి సంతానం వల్ల ప్రాణభయ ముందని ఆకాశవాణి వక్కాణించింది. తానేమో రాజదర్బారులో వున్నాడు. సోదరి ప్రసవించిందని వార్త వచ్చీ రాకనే జుట్టూ, కట్టుకున్న వస్త్రం ఊడిపోతూ వుంటే కూడా పట్టించు కోకుండా కంసుడు సంభ్రమంతో పరుగెత్తాడు. అంత వేగంగా వెళ్లినవాడు ఆ సూతికా నిలయద్వారం దగ్గరే ఆగిపోయి 'శిశువున్ తేతెమ్ము తెమ్మంచు' పరిచారికలను పురమాయించాడు. అతడు రాక్షసుడు. పైగా రాజు. అతను లోపలికి వెళితే అడ్డుకునేవాళ్ళు గానీ, కనీసం ఆగమని చెప్పేవాళ్ళు గానీ ఎవరూ లేరు అయినా లోపలికి వెళ్లకుండానే ప్రసూతికా నిలయ ద్వారం ముందే నిలబడి పోయాడు, కంసుడు కాన్పుల గదిలోకి వెళ్లాడు. శిశువును చంపాడు అని కవి రాసి వుంటే ఎవరైనా చేయగలిగింది ఏమీ లేదు. నిలబడిన వాడు కంసుడు. కానీ నిలబెట్టిన వాడు కవితాంసుడు.

> తండ్రి కూతుర్ని తల్లీ! అని సంబోధించడం సాధారణం. కానీ ద్యుమత్సేనుడు తన కోడలు సావిత్రిని (సత్యవంతుని భార్యను) తల్లీ! అని ఆప్యాయంగా సంబోధిస్తాడు.

జాతి సంస్కృతీ పరిరక్షణ బాధ్యతను నెత్తికెత్తుకున్నాడు కవి. మానసిక ఉద్విగ్న పరాకాష్ఠలో వున్న రాక్షసరాజు తనను తాను నియంత్రించుకున్నాడని, సంప్రదాయాన్ని పాటించాడని చెప్పడం ద్వారా మానవులకు చెప్పనవసరం లేకుండా చేసుకున్నాడు ఎర్రన మహాకవి.

## ధర్మాగ్రహం :

ఎర్రనకు కోపం వచ్చింది అది వ్యక్తిగతమైంది కాదు. తనకెవరో ఏదో ఒరగబెట్టలేదని కాదు. ధర్మానికి క్షతి కలిగిందని. ఆ సందర్భాన్ని చూడండి.

> అరణ్యావాసంలో వున్న పాండవులు ఆ దరిదాపుల్లో లేని అదను చూసి, సైంధవుడు ద్రౌపదిని బలాత్కారంగా ఎత్తుకు పోయాడు.

అరణ్యావాసంలో వున్న పాండవులు ఆ దరిదాపుల్లో లేని అదను చూసి, సైంధవుడు ద్రౌపదిని బలాత్కారంగా ఎత్తుకు పోయాడు. విషయం తెలుసుకున్న భీమార్జునులు అతన్ని వెంటాడారు. అప్పుడు సైంధవుడు ద్రౌపదిని విడిచి పెట్టి రథం తోలుకొని వెళ్ళిపోయాడు. ధర్మరాజు ద్రౌపదిని తోడ్కొని ఆశ్రమానికి వెళ్ళాడు. భీమార్జునులు సైంధవుని తరుముకొని, అతని గుర్రాలను పడవేశారు. పడవేస్తే తల్లడిల్లి, రథం దిగి, విల్లమ్ములు విడిచిపెట్టి, శరీరమంతా చెమటలు పోస్తూ వుంటే, నిట్టూర్పుకుంటూ పరుగెత్తాడు. అప్పుడు కవి అంటాడు - 'అమ్మనుజ పశువు పెలుచన్ పఱచెన్' అని. అదీ కవి ధర్మాగ్రహం. విశ్వంలో ఎక్కడ ఏమూలలో ఏం జరిగినా-చీమ చిటుక్కుమన్నా - సత్కవి స్పందిస్తాడు. అందుకే అతని కావ్యం విశ్వ......

## ఈనాటి పలుకుబడి :

- మీకేం తెలియదు. మీరు ఊరికే పొండి' అని మనం ఇప్పుడు అంటాం.

- మీరేమియు నెఱుంగ రూరక పొండు' అని ఎర్రన ఆనాటి భాషలో అంటాడు. అలాగే

మనం ప్రస్తుతం encyclopedia అనే ఆంగ్ల పదానికి అర్థంగా వాడే విజ్ఞాన సర్వస్వం అనే పదబంధం ఎర్రన మహాకవిది.

'నిశ్చల కళా విజ్ఞాన సర్వస్వమో అరుదీ చందమనంగ నిల్చె' అని

## అందమైన అభివ్యక్తి :

ఎవరైనా శ్రద్ధగా విన్నారంటే చెవియొగ్గి విన్నారనికానీ మనసు పెట్టి విన్నారని కానీ అనడం కద్దు. ఆంగ్లవక్త శ్రోతల్ని అడుగుతాడు 'లెండ్ మీ యువర్ ఇయర్స్' (మీ చెవులను నాకు అప్పగించండి) అని, అతనే ఇంకా కొంచెం గడుసరి అయితే 'లెండ్ మి యువర్ మైండ్స్'- (మీ మనసుల్ని నాకు అప్పగించండి) అని అంటాడు. ఇలాంటి సందర్భంలో ఎర్రన మహాకవి ఏమంటాడో గమనించండి.

అహోబిల క్షేత్ర మహాత్మ్యాన్ని చెప్పవలసిందని గాలవుడు అడిగినంతనే దేవశ్రవుడు చెబుతూవుంటే అక్కడ వున్న మునీంద్రులందరూ తమ 'నెమ్మనములు చెవులకు సొమ్ముగ నొసరించి'రి అన్నాడు.

ఈ రోజు విడివిడిగా పేర్కొనబడుతున్న చెవి, మనసు రెండింటిని ఆనాడు ఎర్రన ఒకటిగా కలిపి వుంచాడు. ఎంత అద్భుతమైన అపూర్వమైన అధునాతనమైన ఆశ్చర్యకరమైన అభివ్యక్తీకరణ!

## అనంతర కవులపై ప్రభావం :

శ్రీశ్రీ దృష్టిలో తెలుగులో ముగ్గురే మహాకవులు. ప్రాచీన కాలంలో తిక్కన, మధ్యయుగంలో వేమన, ఆధునిక కాలంలో గురజాడ. ఈ ముగ్గురిలో మధ్యముడు వేమన. ఆయన ప్రసిద్ధ పద్యం,

ఆ. చంపదగిన యట్టి శత్రువు తనచేత
  చిక్కెనేని కీడు చేయరాదు
  పొసగ మేలు చేసి పొమ్మనుటే చాలు'

దీనికి మూలమనదగిన భావం ఎర్రనలో కనిపిస్తుంది.

కం. శరణంబని వచ్చిన భీ
  కర శత్రువునైన ప్రీతి కావగ వలయున్
  కరుణాపరుల తెరంగిది
  యిరవుగ సరిగావు దీని కేధర్మంబుల్

అలాగే

ఆధునిక కవి రాయప్రోలు సుబ్బారావు 'లేదురా యిటువంటి భూదేవి యెందు' అని తన జన్మభూమి గేయంలో అంటే ఎర్రన హరివంశంలో యాదవులు తామున్న చోటినుంచి తప్పనిసరిఅయి ఇంకొక చోటికి వలస వెళ్ళినప్పుడు ఇలా అనుకుంటారు. 'మన భూమి బోలు భూమి యెందును పుట్టదు' అని.

## అభ్యుదయానికి ఆలంబన :

'అరచేతిని అడ్డం పెట్టి సూర్యకాంతిని ఆపలేం' అనేది విప్లవానికి ఉప్పందించే సుబ్బారావు పాణిగ్రాహి వాక్యం. దీనికి మూలం ఎర్రనలో కనిపిస్తుంది.

సూర్యుని వరంతో పొందిన శిశువును పెట్టెలో పెట్టి, నదీ ప్రవాహంలో వదిలిన కుంతి ఎంతగానో కుమిలిపోయింది. కొడుకుని తలచుకొని ఓ కుమారా! అరచేయి అడ్డం పెట్టినంత మాత్రాన సూర్యుడు కనిపించకుండా పోతాడా? ఎప్పుడైనా నిన్ను నేను ప్రేమగా దర్శించక పోతానా! ఎలా అంటే కీర్తించబడే నీ శరీర సౌష్ఠవం, చెవులకు వేలాడే మణికుండలాలు, వజ్రకవచం వెలుగొందకుండా వుంటాయా? అంటూ 'ఇను డలచేత మాటువడుటెన్నడు కల్గునె' అంటుంది.

## అమ్మపాల అమృతత్వం :

ప్రభుత్వాలు అప్పుడప్పుడు తల్లిపాల వారోత్సవాలను పనిగట్టుకొని నిర్వహిస్తాయి. సామాజిక స్పృహ కలిగిన కొందరు వైద్యులు ప్లకార్డులు పట్టుకొని ప్రజలకు తల్లిపాల శ్రేష్ఠత్వాన్ని గురించి అవగాహన కలిగించే ప్రయత్నం చేస్తున్నారు. 'బ్రెస్ట్ ఫీడింగ్ ఈజ్ ఫర్ ది బేబీ' అనే ఆంగ్ల నినాదాన్ని కూడా ఆలంబనంగా స్వీకరిస్తున్నారు.

అయితే తల్లిపాల గొప్పదనాన్ని గూర్చి ఎర్రన ఎప్పుడో చెప్పాడు. చిన్ని కృష్ణుడు అమ్మపాలిస్తానంటే తాగకుండా బయటికి వెళ్లి కడవల పాలు, పెరుగు, నెయ్యి వగైరా తాగి గొడవలు తెస్తున్నాడు. గొల్లెతలు వచ్చి యశోదమ్మకు ఫిర్యాదు చేశారు. ఆ తల్లి వాళ్ళను సముదాయించి పంపించి, వెంటనే కృష్ణుడితో పాలుతాగమని చెబుతూ ఇలా అంది.

తే|| 'తల్లి చనుబాలు గ్రుక్కెడు తక్కినయవి
పుట్టెడును ఒక్కరూపు......... అని

ఒక్క గుక్కెడు తల్లిపాలతో సమానం కావాలంటే తక్కిన ఏపాలైనా పుట్టెడు కావాలని చెప్పడం వల్ల తల్లిపాల గొప్పతనం తేటతెల్ల మవుతోంది.

ప్రాణి సమతుల్యత (Ecological balance)

మాంసభక్షకులైన పాండవులు అరణ్యావాసం చేస్తున్న సందర్భంలో జరిగిన సంఘటన యిది.

సీ. ద్వైతవనంబున ధర్మజుండొకనాడు.
నిద్రింపగా తద్వనేచరంబు
లగునట్టి మృగజాతులన్నియు కలలోన

వచ్చి కన్నుల నశ్రు వారి తొరుగ
తమ్మెఱింగించి యాతని తోడ నిట్లను
ధర్మాత్మ! మీరు నిత్యంబు కడఁగి
చంపంగ చంపంగ సమసి అల్పావశి
ష్టములయ్యె నిప్పుడస్మత్కులంబు

తే. లేము బీజమాత్రమ చిక్కియిట్లు వనరు
చున్న వారము మీరింక నొండు కడకు
నరిగి మము కావరే కరుణార్ద్ర బుద్ధి
ననిన నల్ల కాకని వాని కభయ మిచ్చి

కం. జనపతి మేల్కని అంతయు
ననుజుల కెఱిగించి యిట్టులను అబ్దముపై
నెనిమిది నెలలుండితి మి
వ్వనమున తగునింకనొండు వలనికి పోవన్

జంతువులు వాటి సంతతిని, జాతిని (spicies) అవిచ్ఛిన్నంగా కొనసాగించు కునేందుకు నేరుగా ధర్మరాజుకు కలలో కనిపించాయి. అందంగా, ఆర్తితో ధర్మాత్మా! అని సంబోధించాయి. 'ఆరంభం బాగుంటే తలపెట్టిన పని సగం అయిపోయినట్టే' అన్నట్లయింది ఆ పిలుపుతో, 'మీరు పగలంతా పనిగట్టుకొని చంపుతూ వుంటే మా ముందు వెనక ఎవరూ లేరు. ఈ వచ్చిన వాళ్ళమే వున్నాం. మీరు మీ మకాం ఇక్కడినుంచి తొందరగా ఎత్తేసి, కరుణార్ద్ర బుద్ధితో మమ్మల్ని, మాజాతిని కాపాడండి' అని ప్రాధేయపడ్డాయి. జ్ఞానంలేని జంతువులు తమ జాతి భావితరాలను కాపాడుకునేందుకు పడిన తపన ఇక్కడ ప్రస్ఫుటమవుతోంది. జ్ఞాని అయిన మానవుడు మాత్రం భ్రూణహత్యల ద్వారా లోక వినాశనానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

> జంతువులు వాటి సంతతిని, జాతిని (spicies) అవిచ్ఛిన్నంగా కొనసాగించు కునేందుకు నేరుగా ధర్మరాజుకు కలలో కనిపించాయి.

శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం సహాయంతో స్వార్థంతో తల్లిదండ్రులు కలసి ఆడపిల్లని అమ్మకడుపులోనే అంతం చేయాలని ప్రయత్నం చేస్తున్నారు. కనీసం

కొందరైనా ఈ ఘోరబలిని ఆపవలసిందిగా దక్షులైన వాళ్ళకు విన్న వించాలనే సూచన వుంది. ఇందులో, మానవాళికి మహత్తరమైన సందేశాన్నిస్తుందీ ఘట్టం.

కులం-గుణం

ధర్మవ్యాధునితో కౌశికుడు ఇలా అన్నాడు

“పాప వర్తనుండు బ్రాహ్మణుండయ్యును
నిజము శూద్రుకంటె నీచతముడు
సత్య శౌచ ధర్మశాలి శూద్రుండయ్యు
నతడు సద్ద్విజుండ యనిరి మునులు’ అని.

పాపపు పనులు చేసేవాడు బ్రాహ్మణ కులంలో పుట్టినా అతడు శూద్రుని కంటే నిజంగా చాలా నీచుడు. ఆత్మశుద్ధి కలిగి సత్యధర్మాలను పాటించే వ్యక్తి శూద్రుడయినా అతడు సద్బ్రాహ్మణుడే అని మునులన్నారు. జటిలమనుకుంటున్న విషయాన్ని సులువుగా సుస్పష్టంగా చెప్పాడు ఎర్రన మహాకవి.

## దారిద్ర్యపు దుర్భరత్వావిష్కరణ :

తక్కెడలో పెట్టి తూస్తే ఒక ఇద్దరు ఏమాత్రం ఎక్కువ తక్కువ కాకుండా సమానంగా తూగుతారని అంటాడు ఎర్రన. ఎవరా ఇద్దరు? అని మనకు ఉత్కంఠ కలుగుతుంది. తక్కెడలోని ఒక పాత్రలో దరిద్రుణ్ణి పెట్టమంటాడు. ఇపుడు మరీ ఉత్కంఠ. దరిద్రునితో సమానంగా తూగగలిగిన ఏ వ్యక్తిని ఆపక్క పాత్రలో పెట్టమంటాడని. దరిద్రునితో సమానంగా తూగగలిగిన వాళ్ళు ప్రపంచంలో ఎవరూ లేరు. కానీ ఒక వ్యక్తి వున్నాడంటాడు ఎర్రన. ఎవరంటే ఏమాత్రం ఆలస్యం లేకుండా అంటాడు - మృతుడు అని. అంటే ఆ పక్క శవాన్ని పెట్టమంటాడు.

ఏ ఆర్థిక శాస్త్రవేత్త అయినా ఆఖరికి నోబెల్ బహుమతి గ్రహీత అమర్త్యసేన్ అయినా చెప్పేదొకటే. ప్రపంచంలో ఎక్కడైనా దారిద్ర్యరేఖకు దిగువనవున్న ప్రజల్ని ఆరేఖ కన్న పైకి తీసుకురావాలని.

కృష్ణుడు విశ్వకర్మ చేత తన వాళ్ళకోసం ద్వారవతి అనే పట్టణాన్ని నిర్మింపజేసి, శంఖనిధిని ఆహ్వానించి

ఉ. .......................................ఏను నా

వారల యందు దీను కృశ వైభవు సౌఖ్య విహీను చూడగా

నేర దరిద్రుడన్ మృతుడు నిక్కము తుల్యులు గారె ధారుణిన్... అంటాడు.

ఎరుపు ఉదయానికీ, అభ్యుదయానికి ప్రతీక. ఆ దృష్ట్యా ఎర్రన సార్థక నామధేయుడు. ఈనాటికి పనికివచ్చే ఇలాంటి ఇంకా ఎన్నో మంచి విషయాలను ఆనాడే రాసిన ఎర్రన తెలుగు జాతికి, ప్రత్యేకంగా తెలుగు సాహితీలోకానికి ప్రాతఃస్మరణీయుడు.

## పాద సూచికలు

1. పేదలు, మహాప్రస్థానం, పుట 86
2. హరివంశం పూర్వ. భా 7-171
3. సమగ్ర ఆంధ్ర సాహిత్యం, మొదటి సంపుటి, పుట 569
4. అరణ్యపర్వం 7-200
5. హరివంశం పూర్వ. భా. 5-124
6. అరణ్యపర్వం, 6-244
7. హరివంశం, పూర్వ, భా. 1-108
8. నృసింహ, 2-88
9. నృసింహ, 1-21
10. అరణ్యపర్వం, 5–413
11. హరివంశం ఉత్తర భా. 2-102
12. అరణ్యపర్వం 7-347
13. హరివంశం పూర్వ భా. 5-238
14. అరణ్యపర్వం 6-98
15. అరణ్యపర్వం 6-99
16. అరణ్యపర్వం 5-137
17. హరివంశం ఉత్తర భా, 2-174

# సమాజానికి భగవద్గీత ఆవశ్యకత

డా. వరలక్ష్మి పూజారి
9000 84713

గురువే సర్వలోకానాం భిషజే భవరోగినాం ।।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః ॥

ఏకవి అయినా ఏ ఋషి అయినా ఏ రచయిత అయినా సమాజ ప్రయోజనాన్ని దృష్టిలో ఉంచుకునే రచిస్తారు, ప్రవచిస్తారు. ప్రబోధిస్తారు, ఉపదేశిస్తారు. వీటిలో మానవాళి శ్రేయస్సే ప్రధానంగా, ఔన్నత్యమే వీరి లక్ష్యంగా ఉంటుంది. ఈ పంచభూతాత్మక సృష్టి ఓ నియతి ప్రకారం ప్రకృతి సహజసిద్ధంగా కొనసాగుతూ ఉంటుంది. మానవుడు ఆ నియతిని అనుసరించి తన జీవనాన్ని కొనసాగించాల్సి ఉంటుంది. తదనుగుణంగా సమాజమంతా కూడా మనః ప్రశాంత స్థితిలో ఉండి, జీవంతో జీవితాన్ని జీవించాలి. అదే మానవజీవిత లక్ష్యం, జన్మ సార్థక్యం కూడా! అయితే ఇది తెలియని మానవుడు స్వస్థితిని విస్మరించి లేనిపోని ఆరాట పోరాటాలకులోనై అస్తవ్యస్థమైన మానసిక స్థితికి దిగజారిపోయి అస్వస్థతకు లోనౌతున్నాడు. అందుకు కారణం సృష్టి పట్ల ప్రకృతి పట్ల తనపట్ల అవగాహన, లోతైన పరిశీలన లేకపోవడం.

ఈ పరిస్థితిలోని మనిషికి సదవగాహనను కల్పించి ఓ నిశిత పరిశీలన చేసే దృష్టికోణాన్ని మనకు ప్రసాదించగల్గింది శ్రీమద్భగవద్గీతా శాస్త్రం.



సమాజమంటే వ్యక్తి లేదా వ్యక్తుల సమూహం సమాజ ప్రయోజనమంటే వ్యక్తి ప్రయోజనమే! వ్యక్తికి ప్రయోజనం చేకూరడమంటే ఏంటి? వ్యక్తి ఎల్లవేళలా ప్రశాంత మనః స్థితితో ధర్మాచరణలో ఉండాలి. ఇదే ప్రయోజనం! ప్రతి వ్యక్తి ఈ ప్రయోజనాన్ని పొందాల్సిన

ఆవశ్యకతను తెలియాలి. అంతేగాని రాకపోకలకు సంబంధించిన భౌతిక ధన కనక వస్తువాహనాదులు పోగు చేసుకోవడం కాదు కదా ! ఈ దృష్టితో చూస్తే ఇలాంటి అత్యున్నతమైన ప్రయోజనాన్ని ప్రస్తుత సమాజానికి నెరవేర్చ గల్గినదే శ్రీమద్భగవద్గీతా ప్రసాదం. కారణం, భగవద్గీత మానవజీవన విధానం గురించి సృష్టి నియతి గురించి ప్రతి దిశనుండి, ప్రతి కోణం నుండి మనకు దర్శింపజేస్తుంది తరచి తరచి చూసే వినూత్నమైన దృష్టికోణాన్ని మనకు అలవరుస్తుంది. ప్రతి మనిషిని సంస్కార వంతునిగా తీర్చిదిద్దుతుంది. వేదాలను ఇంకా పెద్దపెద్ద గ్రంథాలను చదువుకోవడానికి ఏ మాత్రం సమయాన్ని కేటాయించలేని నేటి అధునాతన నాగరిక సమాజానికి సైతం భగవద్గీత అరచేతిలో కరదీపికగా ఉండి తనవైపు చూసిన మనిషిని మనోన్నతంగా ఎదిగించగలదు. తనలో ఉన్న పరిపూర్ణతను తాను తెలిసి పరిపూర్ణులుగా తయారుకావడానికి ఉపయోగపడే దివ్య సాధనం భగవద్గీత. మనిషిలో నిరంతరం సంఘర్షించే బాహ్య అంతర భేదాలను స్పష్టంగా ఎత్తి చూపి నైతిక ఆధ్యాత్మిక శిక్షణనిచ్చి సమాజ సంక్షేమానికి దోహదపడుతుంది. ప్రపంచ వాఙ్మయంలో భగవద్గీతకు ఒక అపూర్వమైన స్థానం ఉంది, శక్తి ఉంది.

జీవిత మనేది వడ్డించిన విస్తరికాదు. సుఖదుఃఖాలు, కష్టసుఖాలు మనిషిని స్పృశిస్తూ ఉంటాయి. ఆవేదనకు ఆందోళనకు గురిచేస్తూ ఉంటాయి. అయితే ఎలాంటి క్లిష్ట పరిస్థితుల్లోనైనా తన చూపు మాత్రంతో సంపూర్ణంగా సంరక్షించగల ఔషధం శ్రీ మద్భగవద్గీత. ఇది మనిషికి తనను లేదా తన చుట్టూ ఉన్న సమాజాన్ని ఎలా దర్శించాలో సశాస్త్రీయ కోణంలో నేర్పగలదు, దర్శింపజేయగలదు. ఈ దర్శనంలో శరీరం లోపల-బయట కూడా సర్వత్రా సమంగా ఉంటున్న, సదా ఉన్న అత్యద్భుత శక్తి ప్రవాహాలను గమనించే గ్రహించే జ్ఞానచూపు అందుతుంది. తద్వారా ఈ భౌతిక దేహం అలాగే ఈ దృశ్యమయవిశ్వం అంతా కూడా అతుకులబొంతలాగే అలంకారపు తగిలింపులాగే స్పష్టంగా తెలియవస్తుంది. ఆదిశంకరులు కూడా ఈ దృశ్యమయ జగత్తును “దర్పణ దృశ్యమాన నగరీతుల్యం” అన్నారు. అలా జ్ఞానమనే చూపుతో దర్శిస్తే ఆ సమ్యక్ దర్శనంతో ఈ సమస్తంలోనూ ఆంతర్యామిగా ఉన్న

> “జీవిత మనేది వడ్డించిన విస్తరికాదు. సుఖదుఃఖాలు, కష్టసుఖాలు మనిషిని స్పృశిస్తూ ఉంటాయి. ఆవేదనకు ఆందోళనకు గురిచేస్తూ ఉంటాయి.”

విశ్వవ్యాపక దైవ శక్తి అంతా జ్ఞానమనే చూపుతో దర్శనమౌతుంది. దాన్నే మనం ముక్తి, మోక్షమని వ్యవహరిస్తూ ఉంటాం. ఈ దర్శనం జోలికి వెళ్ళనప్పుడే మనిషి ప్రపంచ విషయాల్ని చూసి కంగారుపడుతూ సుఖదుఃఖాలకు లోనౌతూ అజ్ఞానపు అంధకారంతో చిక్కి బిక్కరిస్తూ ఉంటాడు. అది దర్శించగల్గిన యోధుడైన మనిషి ఈ మారుతూ మార్పుకు లోనౌతూ ఉన్న ఈ సమస్త సమాజాన్ని చూసి అవేవీ తనకు సంబంధంలేనట్లు -

జలజ పత్రమునందు సలిలమంటనియట్లు
అద్దమందును రూపమంటనట్లు
ఋరదయా కుమ్మరిపురుగుకంటనియట్లు
నాజ్యంబు జిహ్వాయందంటనట్లు
భువిచింతపండుపై బొబ్బరంటనియట్లు
పలుచల్లలో వెన్నగలయనట్లు
చిత్రభానుకునుచీకటంటనియట్లు
ఆకాశమున వాయువంటనట్లు

గీ|| బ్రహ్మవేత్తలు మాయా ప్రపంచమందు
అఖిల వ్యవహారములు చేసి అంటరధిప...

ఇలా అసంగంగా, అస్పర్శయోగంతో, జీవన్ముక్త తత్త్వంలో ఉంటారు, వారి జీవన విధానం ఇలా ఉంటుంది. వీరు వీరిలోని భావనతో భౌతిక జగత్తులో ఏ జీవ పదార్థ సార ఆకృతులూ లేకుండా అశరీరధారులుగా జీవన్ముక్తులుగా ఉంటారు. ఇదే పెద్దలు చెప్పే జన్మరాహిత్య స్థితి.

> ప్రకృతి, ప్రపంచం, సమాజం, కుటుంబం ఇవన్నీ కూడా ఒకదానితో మరొకటి అవినాభావ సంబంధాన్ని కల్గి ఉంటాయి.

ప్రకృతి, ప్రపంచం, సమాజం, కుటుంబం ఇవన్నీ కూడా ఒకదానితో మరొకటి అవినాభావ సంబంధాన్ని కల్గి ఉంటాయి. అయితే వీటిలో ఉన్న ఏకత్వపు ఆంతరంగిక సంబంధాన్ని దర్శించగల్గితే జీవితాన్ని జీవంతో జీవించడానికి కుదురుతుంది. అలా లేకపోతే జీవితమనేది అస్తవ్యస్థంగా అయోమయంగా గందరగోళంగా అనిపిస్తుంది. ప్రతి అంశంలోనూ శాస్త్రీయత, నిబద్ధత అనేవి అత్యంత

ఆవశ్యకం. మన జీవితంతో ముడిపడి ఉండే ప్రతి అంశాన్ని నిశితంగా పరిశీలించాలి. అందుకు భగవద్గీతా శాస్త్రం ఓ దిక్సూచివంటిదని ఖచ్చితంగా తెలియాలి. మనిషి ఔన్నత్యానికైనా పతనానికైనా మనిషే పూర్తి బాధ్యత వహించాల్సి ఉంటుంది. ఇందులో ఎలాంటి సందేహం లేదు.

ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్|
ఆత్మైవ హ్యాత్మనో బంధుః ఆత్మైవ రిపురాత్మనః॥ - 6.5
బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః॥
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్|| -6.6

మనిషి ఈ సంసారసాగరం నుండి తమను తామే ఉద్ధరించు కొనవలెను. తమకు తామే అధోగతిపాలు కారాదు. లోకంలో వాస్తవంగా తమకు తామే మిత్రులు, తమకు తామే శత్రువులు. మనస్సును, ఇంద్రియాలను, శరీరాన్ని జయించిన వారు తమకు తామే మిత్రులు. అట్లు జయించనివారు తమకుతామే శత్రువులు. జితేంద్రియులకు మనస్సు, ఇంద్రియాలు, శరీరము భగవత్ప్రాప్తిసిద్ధికై మిత్రునిలా సహకరిస్తాయి. అలాకానివారికి మనస్సు, ఇంద్రియాలు, శరీరము శత్రువులుగా ప్రవర్తించి లక్ష్యసాధనకు అవరోధకాలుగా నిలుస్తాయి.

మనిషి ఈ సంసారసాగరం నుండి తమను తామే ఉద్ధరించు కొనవలెను. తమకు తామే అధోగతిపాలు కారాదు. లోకంలో వాస్తవంగా తమకు తామే మిత్రులు, తమకు తామే శత్రువులు.

వ్యక్తి ప్రభావం కుటుంబం మీద, కుటుంబ ప్రభావం సమాజం మీద, సమాజం ప్రభావం ప్రపంచం మీద, ప్రపంచం ప్రభావం ప్రకృతి మీద ప్రత్యక్షంగా ఉంటాయి. వీటిని సరైన పంథాలో నడపాల్సింది మానవుడే కదా! అయితే ప్రస్తుత సమాజంలో ఈ పరిస్థితి గాడితప్పింది. ఆత్మీయతను అందుకో లేని అంధకార దుస్థితి. పట్టాలు తప్పిన రైలు పల్టీలు కొట్టినట్లు మనిషి దారితప్పి గమ్యం తెలియని ప్రయాణంలో పల్టీలు కొడ్తున్న పరిస్థితిని మనం కళ్ళారా చూస్తున్నాం. బాహ్యకాలుష్యమైతే తగిన వాటితో నియంత్రించవచ్చు కాని మనోకాలుష్యంతో సమాజమంతా కూడా సమస్యలతో

సతమతమౌతూ ఉంది. ఈ కారణంగా పంచభూతాలు పూర్తిగా కలుషితమై ప్రకృతి మాతకే ప్రమాదం పొంచి ఉన్న పరిస్థితి. ఇవన్నీ సంస్కరించ బడాలంటే భగవద్గీతా శాస్త్ర అవగాహన తప్పనిసరి.

భౌతికపరమైన అభివృద్ధి మీద దృష్టిని కేంద్రీకరించడం బాహ్యాముఖంగా చేసే ప్రయాణం. అంతరంగ శుద్ధి మీద దృష్టిని కేంద్రీకరించడం అంతర్ముఖ ప్రయాణం. అందుకే వ్యక్తి అంతరంలో పరిశుద్ధంగా ఉండాలి. వ్యక్తిలోని అంతరవ్యవస్థ మారకుండా వ్యక్తి ద్వారా రూపొందే బాహ్యావ్యవస్థలో మార్పును చూడలేం. "అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా"అన్నది లలితా సహస్రనామం. కాబట్టి మానవాళి మహెూన్నతికి ఈ అంతరంగ శుద్దే శాశ్వత పరిష్కారం. అంతరంగ శుద్ధికి మనల్ని సశాస్త్రీయ పంథాలో నడిపే భగవద్గీతా మార్గమే శరణ్యం.

> భౌతికపరమైన అభివృద్ధి మీద దృష్టిని కేంద్రీకరించడం బాహ్యాముఖంగా చేసే ప్రయాణం. అంతరంగ శుద్ధి మీద దృష్టిని కేంద్రీకరించడం అంతర్ముఖ ప్రయాణం.

వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన|
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోవ్యవసాయినామ్ || – 2.41
నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా!
న చాభావయతః శాంతిః అశాంతస్య కుతః సుఖమ్|| – 2.66

ఓ అర్జునా! ఈ (నిష్కామ) కర్మయోగంలో నిశ్చయాత్మకబుద్ధి ఉంటుంది. కాని భోగాసక్తులైన వివేకహీనుల బుద్ధులు చంచలమై, ఒకదారీ తెన్నూ లేక కోరికలవెంట నలువైపులా పరుగులు తీస్తూ అనంతాలుగా ఉంటాయి. ఇంద్రియాలు, మనస్సు వశమునందుండని వారిలో నిశ్చయాత్మక బుద్ధి ఉండదు. అట్టి అయుక్తమనుష్యుని అంతఃకరణమందు ఆస్తికభావమే కలగదు. తద్భావనాహీనులైన వారికి శాంతి లభించదు. మనశ్శాంతి లేనివానికి సుఖం ఎలా లభిస్తుంది ?

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోను విధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి|| - 2.67

నీటిపై తేలుచున్న నావను గాలినెట్టి వేస్తుంది. అలాగే ఇంద్రియార్థాలయందు సంచరించే ఇంద్రియాలలో మనస్సు ఏ ఒక్క ఇంద్రియంతో కూడివున్నా ఆ ఒక్క ఇంద్రియమే మనోనిగ్రహం లేని మనిషిని, బుద్ధిని అంటే విచక్షణా శక్తిని హరించి వేస్తుంది.

ఈ వివేకం, స్పృహ మనిషికి లేకపోవటానికి కారణం తనపై తనకు (మనిషిపై మనిషికి) ఈ జగత్తుపై తనకు సరైన అవగాహన లేకపోవడమే ! సమస్త దృశ్యమయ జగదుత్పత్తికి కారణం త్రిగుణాత్మక ప్రకృతి. అవిద్యా అజ్ఞానం వల్ల ప్రకృతికి వశమైవున్న గుణాలతో సంగమిస్తున్న మనలోని తెలిసే తెలివి ద్వారా భ్రాంతి చెంది మిథ్యా సంబంధాన్ని ఏర్పరుచుకోవడం వల్లనే జన్మ భావన కల్గుతూ ఉంది. ఆ మిథ్యా సంబంధాన్ని మనం అదే తెలిసే తెలివితో గుర్తెరిగే గుర్తుతో మనం అజ్ఞానంతో చేసే ప్రతి కార్యానికి కారణాన్ని దైవానికి అంటగడుతూ అజ్ఞానానికి వశమై వివశులై వివేకశూన్యులుగా ఉన్నాం. సృష్టి అనే సంసారానికి కారణమౌతున్న ఆ త్రిగుణాల స్వరూపమేదో మరింత స్పష్టంగా అవగాహన కావాలి. ఇవి ఖచ్చితంగా నిర్ధారణ అయితేనే మనకు తత్త్వజ్ఞానార్థ దర్శనం అనుభవం కావడానికి. త్రిగుణాత్మక ప్రకృతి నుంచే 25 తత్త్వాలు ఏర్పడ్డాయి. ఇంతకూ ఆ త్రిగుణాల పరిస్థితి ఏంటి వాటి స్వరూప స్వభావ ప్రభావాలెలా ఉంటాయనే అంశాలన్నింటినీ కూడా భగవద్గీత సవివరంగా ఉద్బోధిస్తుంది.

> ప్రకృతి త్రిగుణాత్మకం. జడరూపం. వీటి సమష్టి రూపమే ఈ దృశ్యమాన భౌతిక ప్రపంచం.

ప్రకృతి త్రిగుణాత్మకం. జడరూపం. వీటి సమష్టి రూపమే ఈ దృశ్యమాన భౌతిక ప్రపంచం. మాయమయ దృశ్యమాన ప్రకృతికి మూలమైన త్రిగుణాల్ని లేదా గుణత్రయాన్ని విభజించి వాటిని స్పష్టంగా దర్శించాలి. ఆ త్రిగుణాలేవి ? ఏ గుణంలో ఏ విధమైన సంగమం ఏర్పడుతుంది?? అసలు గుణాలు అంటే ఏమిటి?? అవి ఏవి?? గుణాలు ఎలా బంధిస్తాయి. ఈ గుణాల నుండి విముక్తిని పొందేది ఎలా?? మొదలైన అంశాలన్నీ కూడా మనతో మనం విచారించి నిర్ధారించుకోవాల్సిన అవసరం ఉంది. గుణాలు ప్రకృతి సంభవాలు కదా!! కార్యాన్ని కారణం విడిచిపెట్టదు. కారణాన్ని విడిచి కార్యం ఉండలేదు. ప్రకృతి వల్ల ఏర్పడిన గుణాలలో ప్రకృతి లక్షణాలే ఉంటాయి. గుణం అంటే ముడి లేక త్రాడు అని అనే అర్థం ఉంది. ఆ ముడి ఏర్పడడానికి కారణం

గుణంతో ఏర్పరుచుకున్న అవిద్యా అజ్ఞానసంగమే. ఇదే అజ్ఞాన అవివేకానికి కారణం.

> జీవులందరూ ఒకే చైతన్యం నుంచి ఆవిర్భవించినప్పుడు అందరూ ఒకేలా ఉండకుండా ఇన్ని ప్రవర్తనలు స్వభావాలు కల్గడానికి కారణం ఏంటి?

జీవులందరూ ఒకే చైతన్యం నుంచి ఆవిర్భవించినప్పుడు అందరూ ఒకేలా ఉండకుండా ఇన్ని ప్రవర్తనలు స్వభావాలు కల్గడానికి కారణం ఏంటి? కార్యంలో ఉన్నది కారణమే అయినప్పుడు ఒకే కారణం నుండి ఉత్పన్నమైన కార్యాలలో భేదాలు ఎందుకు? సమస్త జీవుల రూపంలో, క్రియలో, ప్రవర్తనలో మొదలైన అనేక అంశాల్లో వివిధ వ్యత్యాసాలకు కారణం ఏంటని అన్వేషిస్తే అసలు సత్యం బోధపడుతుంది. వివిధ ఆకారాలుగల పాత్రలలో నీటిని నింపితే ఆయా ఆకారాలు గల పాత్రనుబట్టి కదా నీరు ఆయా ఆకారాలుగా కన్పిస్తుంది. ఈ కన్పించే రూపాలన్నీ పాత్రలకు సంబంధించినవేగానీ నీటికి సంబంధించినవి కావు కదా! ఈ భేదాలన్నీ కూడా మిథ్యామయమైన సంగమం వల్ల అనిపించేవే! మూడు విధాలైన గుణ వికారాలే ఈ సమస్త ప్రపంచం కదా?? త్రిభిర్గుణ మయైర్భావైః అని 7.13. గుణ వికారాలతో విశేషంగా కన్పించే ఈ దృశ్య ప్రపంచం వాస్తవానికి సామాన్యమైన వికారాలతో కూడివున్నది. అయినా విశేషమైనది. అలా గుణ విశేషాలతోకూడిన ఈ ప్రపంచం సామాన్య సత్తాస్వరూపంలో చైతన్యానికి భిన్నంగా లేదు. ఉదాహరణకు కడలిలో కెరటం విశేషంగా అనిపిస్తుంది. కానీ ఆ కెరటం కడలిలో ఉంటుందిగానీ ఆ కడలి ఆ కెరటంలో ఇమడలేదు కదా!! అలా అన్వయించుకుంటే మనకు అర్థమవుతుంది.

ఈ అవగాహనతో త్రిగుణాల్ని దాని స్వరూపాన్ని చూడాలి. ప్రపంచం త్రిగుణాత్మకం కదా!! విశేషంగా కన్పిస్తున్న ఈ మార్పుకు లోనయ్యే మాయమయ ప్రపంచాన్ని మనం చూస్తున్నాం. కానీ అందుకు మూలమైన సత్తారూప చైతన్యాన్ని దర్శించగల్గినప్పుడే ఈ ప్రపంచపు విశిష్టత మనకు అవగాహన అవుతుంది. ప్రకృతి అంతరాన్ని వీడి బాహ్యదేహాన్ని మాత్రమే చూస్తే ప్రయోజనం శూన్యం. దాని లోతుల్ని మనం దర్శిస్తేనే ఈ మాయమయ దృశ్యప్రపంచం గుణమయంగా త్రిగుణమయంగా ఉందని తెలుస్తుంది. త్రిగుణాలు అంటే సత్త్వరజస్తమో గుణాలు.

బాహ్య ప్రపంచంలోని వస్తువులలోనూ, మన దేహేంద్రియ మనోబుద్ధులలోనూ ఉన్నవన్నీ కూడా మార్పుకు లోనయ్యేవేననీ, గుణమిళితమైనవేననీ మనకు తెలియాలి. దేహాలు సృష్టితం కావడం నాశితం కావడంలాంటి మార్పులన్నీ ప్రకృతి సహజమేనని స్వీయ అనుభవ జ్ఞానం కల్గుతుంది. ప్రకృతి స్వభావాలైన ఈ త్రిగుణాల సమ్మేళనం మనిషి ప్రతిమనిషి ప్రతిజీవి గీత(ద్త్రెవిక) మార్గాన్ని అనుసరిస్తే తప్ప ఈ గుణాల నుండి విడిపడలేరు. అయితే ఇక్కడ సూక్ష్మాంశాన్ని మనం గమనించాల్సి ఉంటుంది. ఇవి కూడా స్వతంత్రత గలవి కావు, ఇవి జడమే. ఈ సున్నితమైన సూక్ష్మం మనిషికి తెలియడం లేదు.

మనిషిలోని తెలిసే తెలివి ఏ గుణంతోకూడితే ఆ గుణమే అతనిలో ప్రధాన భూమికను పోషిస్తూ ఉంటుంది. నువ్వే గుణంతో కూడుతున్నావే గానీ గుణం స్వయంగా తనకు తానుగా వచ్చి నీతోకూడదు, సంగమించదు. నువ్వే నీ తెలిసే తెలివి లేదా గుర్తెరిగే గుర్తుతో, నీకు నువ్వే నీ చేతనను నీ తెలివితో ఆయా గుణాలతో ఏకం చేస్తున్నావనే వాస్తవం నీకు తెలియాలి. ఈ కీలకమైన అంశం నీకు, నీ తెలిసే తెలివికి, ఎరిగే ఎరుకకు ఎరుకైతేనే, తెలిస్తేనే నీకు గుణాలు వశమవుతాయి. లేకపోతే నువ్వే వాటికి వశమవుతావు. ఈ అంశం అవగతమైతేనే త్రిగుణాల నుండి విముక్తి .... లేకపోతే లేదు గాక లేదు. ఉదా॥ నీకు నువ్వుగా కావాల్సిన వస్తువుల్ని కొనుక్కుంటున్నావు. నీకు నువ్వుగా కావాల్సిన వాహనాల్ని కొనుక్కుంటున్నావు. కావాల్సిన విధంగా ఇల్లు కట్టుకుంటున్నావు. ఏ వస్తువూ ఏ ఆహారపదార్థమూ ఏ వాహనమూ ఏ ఇల్లూ నీ దగ్గరికి తనకు తానుగా రావడం లేదు కదా!! అలాగే గుణాలు కూడా వాటికవే మనిషిని ఆశ్రయించవు. మనిషే అజ్ఞానవశంతో, అంధత్వంతో జడరూప గుణాల్లోకి వెళ్ళి ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడన్న సంగతి మనిషికి తెలియాలి. గుణాలు కూడా మనకు భౌతికంగా కన్పిస్తున్న అవయవాల్లాంటివే. ఇవి పనిచేయడానికి తగినవి కనిపించే అవయవాలైతే, గుణాలు మనిషి మనుగడకు కావలసిన అవ్యక్త అవయవాలు.

> “మనిషిలోని తెలిసే తెలివి ఏ గుణంతోకూడితే ఆ గుణమే అతనిలో ప్రధాన భూమికను పోషిస్తూ ఉంటుంది.”

అవయవాలు లేని మనిషిని ఎలా ఊహించలేమో అలానే... అసలు గుణాలు లేని మనిషిని ఊహించలేం. గుణాలే మనిషిని ఇబ్బంది పెడుతున్నాయనుకుంటే అది అబద్ధం.... మిథ్య... భ్రమ.. అవి ఎప్పటికీ మనల్ని ఇబ్బంది పెట్టవు. అవి

మనిషి మనుగడకు చాలా అవసరమైనవి. అవి లేకపోతే మనలో ఆకలి అనిపించదు. తగిన సమయానికి విశ్రాంతి తీసుకునే నిద్రలాంటివి కుదరదు. దైవధ్యానను కల్గించే భావన మనలో కలగదు. కార్య నిర్వహణ, కార్యదక్షత, కర్మపై ఆసక్తి (ఇక్కడ కర్మపై మాత్రమే గాని కర్మఫలంపై కాదని గమనించాలి.) ఉండదు కదా! మనలో ఇవన్నీ జరగాలంటే ఈ త్రిగుణాలే శరణ్యం. కాబట్టి దేహేంద్రియయ మనోబుద్ధులు ఎంత అవసరమో వీటన్నింటికీ మూలమైన త్రిగుణాలు కూడా అంతే అవసరం. కాబట్టి లోపం ఉంటే మనిషిలో జీవునిలో ఉండాలేగానీ త్రిగుణాల్లో ఎప్పుడూ ఉండదుగాక ఉండదు!! అవి మనిషి మనుగడకు అవశ్యమేనని తెలియాలి. త్రిగుణాల తీరును వాటి స్వరూపాన్ని స్వభావాన్ని వాటి లక్షణాలను మనం తెలిసి వాటిని సద్వినియోగం చేసుకోవాలి. అంతేగానీ గుణాల్ని నిందించడంలో ప్రయోజనం లేదు. ఎలా అంటే కత్తిని ఉపయోగించి హత్య చేస్తే ఆ తప్పు మనిషిదికానీ కత్తిది, దాన్ని తయారుచేసినవారిది, అది తయారు కావడానికి కారణమైన లోహానిది, ఆ లోహం తయారు కావడానికి కారణమైన భూమిది, లేదా భూమి ఏర్పడటానికి కారణమైన నీటిది.... అందుకు కారణమైన అగ్ని, వాయువు ఆకాశానిది కాదు కదా!!

ఇదే అంశాన్ని దేహానికి అన్వయించి చూద్దాం...! ఆ కత్తిని పట్టుకున్న చెయ్యిదా! ఆ చెయ్యి కత్తిని ఎత్తడానికి కారణమైన ఆ చేతిలోని సత్తా స్వరూప చేతనా శక్తిదా! అలాంటి ఆలోచనను ఆలోచించడానికి తగిన ఆలోచించే లక్షణం కల్గిన మనసుదా! హత్య చెయ్యాలనే నిర్ణయానికి తగిన నిర్ణయించే లక్షణం కల్గిన బుద్ధిదా! ఈ బుద్ధి పనిచెయ్యడానికి తగిన ప్రకాశాన్నిస్తున్న మనలోని ప్రతిబింబానిదా ! ఆ ప్రతిబింబానికి మూలమైన నిజబింబానిదా! ఆలోచిద్దాం ఇదే కదా సత్యాన్వేషణ చేసే విధానం. ఇక్కడ ఇప్పటి వరకు చర్చించిన వాటిలో ఎక్కడైనా నేను అనే అహం భావన ఉందా కన్పించిందా. లేదు కదా ! అవన్నీ కూడా వాటివాటి లక్షణాలతో అవి తమ తమ కార్యాల్లో ప్రవర్తిల్లుతూ ఉంటాయి.

మరైతే ఈ హత్యాయత్నం ఎక్కడి నుంచి కల్గినట్లు స్ఫురించినట్లు. ఇప్పటి వరకూ మనం చూసిన వాటిలో ఎక్కడా కూడా లేనటువంటి దానికంటూ ఒక అస్తిత్వంగాని ఉనికిగాని లేనటువంటి ఓ మిథ్యారూపమైన నేననే అహంకారానికి మాత్రమేనని తేలిపోయింది కదా! 'అహం'(నేను) భావన వేరు. అహంకారం వేరు. 'నేనే, నాది, నేనే చూస్తున్నాను నేను లేకపోతే నువ్వు లేనే లేదు, నేను ఉండబట్టే ఇదంతా చెయ్యగల్గాను! ఇలాంటివన్నీ కూడా అహంకారపూరితమైనవే కదా! ఇదెక్కడుంది దీని చోటెక్కడ వెతకి వెతకి చూస్తే దానికంటూ ఓ స్థానంగానీ నామంగానీ లేదు. అందుకే అది మిథ్య, భ్రమ. అనిపించే భ్రమ. ఇంతటి

విశ్లేషణ మనలో జరిగితేనే మనకు త్రిగుణాలు దర్శనం కావడానికి. ఇప్పటి వరకూ మనం చర్చించినవన్నీ వాస్తవాలు. కాని కనిపించకనే అనిపించే ఈ అహంకారపూరితమైన నేను ఎక్కడుంది? దాని స్థానమెక్కడ..?! దేహేంద్రియ మనోబుద్ధులు పంచభూతాది అంశాలు అన్నీ వాస్తవాలు యదార్థాలు కానీ ఈ అహంకార భావన లేనిది, యదార్థం కానిది. ఇదే ఈ సమస్తాన్ని కప్పేయకల్గిన దాటశక్యం కాని మాయ, ఎందుకు కప్పేయగల్గింది అంటే మనిషే అందులో కూరుకుపోయి ఉండటమే! ఈ జ్ఞానం, ఎరుక, జాగ్రద, మెలకువ కల్గితే...తక్షణం ఈ మాయ పటాపంచలైపోతుంది. గుణాలు మాయకాదు ఆ గుణాల్ని ఆశ్రయించే నేనే అనే అహంకారమే మాయ. శరీరం మాయ కాదు. శరీరమే నేననే అహంకారమే మాయ.



జగద్గురు ఆదిశంకరులు, స్వామి వివేకానంద, రమణ మహర్షిలాంటివారు చేసే మహోన్నతమైన కార్యాల నిర్వహణకు తగినట్లుగా ఆలోచించడానికి ఉపయోగపడే మనసు, నిర్ణయించడానికి వినియోగమయ్యే బుద్ధీ, ఆయాగుణాలు ఇవన్నీ పని చెయ్యడానికి తగిన సత్తాగానీ అంతా కూడా అదే దేహం ద్వారానే కదా! ఇలా సద్వినియోగపడేదీ దేహమే! అక్కడ దుర్వినియోగానికి పాల్పడుతున్నదీ అదే దేహం, మనోబుద్ధీంద్రియాలు గుణాలు అయితే తేడా ఎక్కడుంది!? దాన్ని మనం ఎవరికి వారుగా భగవద్గీతాశ్రయంతో తమలో కెళ్ళి తరచితరచి అరసి అరసి కనిపెట్టాలి. ఆ వెతుకులాటలో అన్వేషణలో మనకు అవగతయ్యేదే మాయమయపు నేననే ఎగిసిఎగిసిపడే భ్రాంతి. అప్పుడు యధార్థం యధార్థంగానూ మాయ మాయగాను తెలుస్తాం. తద్వారా జ్ఞానోదయం కల్గుతుంది. ఆ జ్ఞానంతో ఉన్నది ఉన్నట్లుగానే లేనిది లేనట్లుగానే స్పష్టంగా అనుభవజ్ఞానంగా జ్ఞాన చక్షువుతో స్పష్టంగా దర్శించగలం.

గుణాలలో ప్రవర్తిల్లే వారు కర్తగా ఉంటారు. వీరు గుణదోషాలలో చిక్కుకొని ద్వంద్వాలకు బలైపోయి అలమటిస్తూ అల్లలాడుతూ గిలగిలా కొట్టుమిట్టాడే వారు సామాన్యులు, సాధారణమనుషులు. అయితే గుణత్రయానికి సంబంధించిన భగవద్గీతా జ్ఞానం కల్గిన సాధకులు గుణాతీతంగా అకర్తగా

సర్వత్ర సమదర్శినులుగా ఉంటారు. ఎప్పుడు ఈ గుణత్రయ విభాగయోగం ప్రాప్తించేది? విషాదంతో మొదలైన గీతామార్గాన్ని పట్టుకున్నప్పుడు క్రమంగా ఈ సదవకాశం సంప్రాప్తిస్తుంది. అప్పుడే ప్రశాంత మనఃస్థితిని కల్గిన సమాజాన్ని మనం చూడగలం.

నేడు ప్రపంచాన్ని అత్యంత శక్తివంతంగా ప్రభావితం చేస్తున్న అంశం ప్రపంచీకరణ. దీని ప్రభావం వలన ప్రపంచంలోనే అత్యున్నతమైన సాంస్కృతిక దేశంగా ప్రఖ్యాతి వహించిన భారతదేశంలో కూడా సాంస్కృతికమైన పునాదులు పెకలించివేయబడే విషాద వాతావరణం నెలకకొంటున్నది. మానవ సంబంధాలు, సహనశీలం, అనుకూలభావన, నైతిక విలువలు నిశశిస్తున్నయి. కర్తవ్యదృష్టి లోపించి పోయింది. వ్యక్తిత్వం విచ్ఛిన్నమయిపోతుంది. ఈ తరుణంలో సమాజంలో సుస్థిరతను, సంస్కృతి మూలాలను నిలిపి ఉంచే శక్తి ఒక్క భగవద్గీతకే ఉంది. ఇది ఆచరణ శాస్త్రం కనుక నిత్యజీవితంలో దీన్ని ఆచరించటం ఆవశ్యకం. ఇదే భగవద్గీత సామాజానికి చేకూర్చే ప్రయోజనం.

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః |
తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతిర్మతిర్మమ ||

ఓం శాంతి....



*"If the freedom of speech is taken away then dumb and silent we may be led, like sheep to the slaughter.."*

- జార్జ్ వాషింగటన్

# భాగవతము - సామాజిక భక్తి

ఆచార్య జక్కంపూడి మునిరత్నం
80741 39227

తే. మహిని విజ్ఞాన సర్వస్వమనగ నొప్పి
మానవుని మాధవునిజేయ పూనికొనిన
భాగవత మూర్తా మూర్త పరమ కృతికి
ప్రణతలర్పింతు సర్వదా భక్తిమీర



భారతీయ సాహిత్యాన్ని గురించి ఆలోచిస్తే ప్రధానంగా నాలుగు విభాగాలు ప్రస్ఫుటమవుతాయి. అవి 1) వేదాలు 2) పురాణాలు 3) ఇతిహాసాలు 4) కావ్యాలు. మిగిలిన సాహిత్యమంతా కూడా ఈ విభాగాలలోనే ఇమిడిపోతుంది. ఆర్ష సాహిత్యంలో భారత, రామాయణ, భాగవతాలకు అనుపమ ప్రాధాన్యముంది. అనూహ్య ప్రామాణ్య ముంది. సనాతన ధర్మానికే ప్రాతిపదికలుగా ప్రవర్తిల్లే ధర్మార్థకామమోక్షాలనివి ప్రతిపాదిస్తాయి. భారతం ధర్మార్థలను గురించి ప్రస్తావిస్తే రామాయణం కామానికున్న ఉభయపార్శ్వాలను ఉటంకిస్తుంది. భాగవతం మోక్ష మార్గాన్ని సూచిస్తుంది.

వేదవ్యాస మహర్షి రచించిన పద్దెనిమిది మహాపురాణాలలో భాగవతానికి ప్రముఖ స్థానమే ఉంది. పురాణ లక్షణాలన్ని దీనిలో పుష్కలంగా ఉన్నాయి. భారతం ఇతిహాసం. దీనితో సంబంధమున్న భాగవతానికి కూడ ఇతిహాస స్పర్శ ఉంది. కావ్యమైన రామాయణంలోని కావ్యలక్షణాలు కూడా అక్కడక్కడ అడపాదడపా

భాగవతంలో గోచరిస్తాయి. వీటనన్నిటిని దృష్టిలో పెట్టుకొని ఆలోచిస్తే భాగవత భౌతిక విశిష్టత విదితం కాగలదు.

శ్రీమద్భాగవతం విష్ణుపారమ్యప్రతిపాదకం, భక్తి ప్రబోధకం, మోక్షమార్గసూచికం, విశిష్ట విజ్ఞాన విలసితం అందుకేనేమో భాగవతాన్ని హృదయంతో అధ్యయనం చేస్తే బాగవుతామని భాగవతజ్ఞులభరోసా, పరీక్షిత్ ఆర్తినుంచే ఆవిర్భవించిన అమరపురాణం, అమృతపురాణం భాగవతం. ఇది అధ్యాత్మజ్ఞానాన్ని అందించడానికి ఆవిర్భవించిందే కానీ సమకాలీన సమాజ జ్ఞానాన్ని సమకూర్చడానికి కాదు. అయితే సందర్భోచితంగా దొరలే సంగతులను బట్టి ఆనాటి సమాజాన్ని రేఖామాత్రంగానైనా అంచనావేసేందుకు అవకాశముంది.

వేదవ్యాస మహర్షి దృష్టి, పోతనాదుల సృష్టి సమ్మిళితమై సాహిత్య పరిపుష్టికి దోహదం చేశాయి. ఆంధ్ర భాగవతానువాదకులు అదనంగా తెలుగుదనాన్ని కొంత వాడుకున్నప్పటికి మూలవిధేయంగానే రచన సాగించారు . కొబట్టి సంస్కృతాంధ్ర భాగవతాలకు పెద్ద తేడాలేదు. దీన్ని మనస్సులో పెట్టుకొని పోతనాదుల భాగవతాధారంగా నేనీ వ్యాసం రాయతల పెట్టాను.

భాగవతం ద్వాపరయుగాంతంలోనో, కలియుగ ప్రారంభంలోనో వెలువడింది. ద్వాపరయుగ కాలపరిమితి 8లక్షలా 64వేల సంవత్సరాలు. అయితే భాగవత మీద్వాపర యుగాంశాలనే గాక కృతయుగాది నుంచి జరిగిన వాటిని కూడ సంతరించుకొని సమస్త విషయ సమాహారంగా సందర్శనమిచ్చింది. కాబట్టి భాగవతం ప్రదర్శించిన సమాజాన్నిక్కడ రేఖామాత్రంగా చూడబోతున్నాం

## సమాజవ్యవస్థ :



భాగవతమంతటిని దృష్టిలో పెట్టుకొని ఆలోచిస్తే ఆనాడు జనావాస భూభాగం కంటే అడవి భూభాగమే అధికంగా ఉన్నట్టు తోస్తుంది. ఆరోజుల్లోనూ బ్రాహ్మణులు, క్షత్రియలు, వైశ్యులు, శూద్రులు ఉండేవారని తెలుస్తుంది. నవమ స్కంధంలోని రంతి దేవుని చరిత్రలో మాత్రం చండాలుడి ప్రస్తావన కనిపిస్తుంది. బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, సన్యాసులుండేవారని విధితమౌతుంది. సప్తమస్కంధములో నారదుడు ధర్మరాజుకు చతుర్వర్ణాలవారి ధర్మాలను, చతురాశ్రమాలవారి ధర్మాలను తెలియజేయడమిక్కడ గమనార్హం.

## సంతాన సంపాదన :

ఆనాటివారు గొప్ప సంతానం పొందడంకోసం అనేక పద్ధతులను అవలంభించేవారు. కొందరు తపస్సు చేసేవారు. మరికొందరు వ్రతాలు చేసేవారు. ఇంకొందరు యజ్ఞాలు చేసేవారు. మరికొందరు మహనీయుల నాశ్రయించి వారి అనుగ్రహంతో మంచి సంతానం పొందేవారు.

పృసిన్ని సుతకులనే దంపతులు సంతానం కోసం విష్ణువునుద్దేశించి 12వేల దివ్య సంవత్సరాలు (43 లక్షల వేలు) కఠోర తపస్సు చేశారు. విష్ణువు ప్రత్యక్షమైయాడు. వారి కోరిక మేరకు పృసిన్ని గర్భుడనే పేరుతో కుమారుడుగా జన్మించాడు ఈ ఉదంతం దశమస్కంధంలోవుంది.

కశ్యప ప్రజాపతి సూచనమేరకు అదితి విష్ణువును ఆరాధించింది. 12రోజులపాటు పయోభక్షణమనే వ్రతం చేసింది. విష్ణువు ఆమెకు ప్రత్యక్షమైయాడు. వామన కుమారుడుగా జన్మించాడు.



సూరసేనదేశ రాజు చిత్రకేతువు. అతనికి సంతానం లేదు. అంగీరస మహర్షి అనుగ్రహంతో పుత్రకామేష్ఠి చేశాడు. పుత్రున్ని పొందాడు. ఇలాగే ఎన్నో ఉదాహరణలు భాగవతంలో దర్శనమిస్తాయి.

## జననకాల క్రియలు :

బిడ్డలు పుట్టినప్పుడు తల్లిదండ్రులు శౌచం చేసుకుంటారు. బిడ్డకు జాతకం రాయిస్తారు. జ్యోతిష్యం చూపిస్తారు. దానాలిస్తారు. ఇవి భాగవత కాలంలోనూ జరిగేవి. పరీక్షిత్తు పుట్టినప్పుడు ధర్మరాజు అతనికి జాతకకర్మ చేయించాడు. పుణ్యాహవాచనం చేశాడు. బ్రాహ్మణులకు దానాలిచ్చాడు. జ్యోతిష్యలను పిలిపించి బిడ్డ జాతకాన్ని చూసి చెప్పమని కోరాడు. వారికి దండిగా సంభావన ఇచ్చిపంపాడు.

వ్రేపల్లెలో నందుడు తనకు కొడుకు పుట్టిన విషయం తెలిసికొని మహానంద భరితుడైనాడు. సమర్థులైన వేదపండితుల్ని రావించాడు. తాను స్నానంచేసి పరిశుద్ధుడై చక్కగా అలంకరించుకొన్నాడు.



స్వస్తివాచక పుణ్యాహవచనమంత్రాలను చదివించాడు. వేదవిహిత జాతకర్మలు చేయించాడు. బ్రాహ్మణులకు అనేక దానాలు చేశాడు. అంతేకాదు కృష్ణుడు పుట్టినప్పుడు వ్రేపల్లె గోపికలంతా అతణ్ణి చూసేందుకు ముచ్చట పడ్డారు. తమ ఇంట్లోనే శుభకార్యం జరిగిందని సంబరపడ్డారు. ఇది ఆనాటి ప్రజల ఆత్మీయతను ఐక్యమత్యాన్ని ఆవిష్కరిస్తుంది.

## నామకరణం :



పుట్టిన బిడ్డలకు గొప్పవారిచేత నామకరణం చేయించడం కూడా ఆనాటి పరిపాటి. కశ్యపుడు. దితికీ, తనకు జన్మించిన బిడ్డలకు హిరణ్యాక్షుడు హిరణ్యకశిపుడని నామకరణం చేశాడు. నందుడు గర్గ మహర్షిచేత తన ఇంట్లో పెరుగుతున్న పిల్లలకు బలరామకృష్ణులని నామకరణం చేయించాడు.

## బాల్యక్రీడలు :



శైశవం తరువాత బాల్యం వస్తుంది. పిల్లలంతా కలసి ఆడుకుంటారు. ఈ విషయాన్ని భాగవతం కూడా స్పృశించింది.

వ్రేపల్లె బాలకులు కృష్ణుణ్ణి తమకు నాయకుడుగా చేసుకొని ఆటలాడుకునేవారు. బాలకృష్ణుడు తన చుట్టూవున్న గోపబాలకులతో ఆటలాడుతున్నప్పుడు వారితో నేనాబోతును. మీరు ఆవులు. అంటూ పెద్దగా రంకెవేస్తూ ఆబోతులా వంగి ఆడేవాడు. నేను రాజును మీరు సేవకులు అందరూ ఇలారండి. అని వారికి పనులు పురమాయించేవాడు. మీరు ఇంటివాళ్ళు, నేను దొంగను అని వాళ్ళందరినీ నిద్రపోయేటట్లుగా చేసి వాళ్ళ నగలు దొంగిలించి దాక్కునేవాడు. దాగుడుమూత లాడేవాడు. బంతాటాడేవాడు.

## జ్ఞానార్జన :

వివేకం, విజ్ఞానం, పెంపొందాలంటే ప్రతీవారు చదువుకోవాలనీ

భాగవతకాలంలోనూ భావించేవారు. గురు శుశ్రూష చేసి విద్య గడించాలన్నదే ఆనాటివారి అభిలాష. అందువల్ల రాజులు సైతం తమ పిల్లలని గురుకులాలకు పంపేవారు. అక్కడ రాజ, ప్రజా తేడావుండదు. అందరూ సమానమే. అందరూ గురుదంపతులు చెప్పిన పనిచేసి వారు పెట్టే భోజనాన్ని స్వీకరించాలి. గురువు చెప్పినట్లల్లా విద్య నేర్చుకోవాలి.

హిరణ్యకశిపుడు గురుపుత్రులైన చండామార్కులను రప్పించాడు. కుమారుణ్ణి వారికి అప్పజెప్పాడు. వారు ప్రహ్లాదున్ని తమతో తీసుకవెళ్ళారు. వేదశాస్త్రపురాణాలు మొదలైన లౌకిక విద్యలు బోధించారు. వారు చెప్పిన దానికి అడ్డుచెప్పకుండా ప్రహ్లాదుడు విద్యనభ్యసించాడు. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి రప్పించి విద్యావిషయకంగా ప్రశ్నించాడు. ఇలాంటివి ఆకాలంలో సర్వసాధారణంగా జరిగేవని తెలుస్తుంది.



బృహస్పతి కొడుకు కచుడు "మృతసంజీవని" విద్యనభ్యసించడంకోసం శుక్రాచార్య దగ్గరికి వచ్చాడు. వారి ఇంట్లో పనులుచేయడం, వారి పశువులను మేపుకురావడం, వంటివెన్నో చేశాడు. ఆయన చేత "మృతసంజీవని" విద్య గడించి వెళ్ళాడు.

పెద్దలను సందర్శించి వారిద్వారా జ్ఞానాన్ని పొందడం కూడా భాగవతకాలంలో పరిపాటి. శౌనకాదుల సూతిని ద్వారా,పరీక్షిత్తు శుకమహర్షి ద్వారా, విదురుడు మైత్రేయ మహర్షి ద్వారా, నారదుడు బ్రహ్మ ద్వారా, జ్ఞానాన్ని పొందిన విషయం ఇక్కడ గుర్తుచేసుకోదగివుంది.

**వివాహం :**

వధూవరులు మొదట ఒకరినొకరు చూచుకొనేటప్పుడు బిడియపడతారు. నేరుచూపులకు బదులు ఓరచూపులే అక్కడ పనిచేస్తాయి.

భాగవతకాలంలో అనేక రకాల వివాహాలు జరిగేవి. స్వయంవరంలో పాల్గొని తమ వీరత్వాన్ని ప్రదర్శించి వధువుచేత వరమాల వేయించుకొనేవారు. శ్రీకృష్ణుడు లక్షణను ఈ విధంగానే వివాహం చేసుకున్నట్లు తెలుస్తుంది.



గాంధర్వ వివాహాలుకూడా ఆరోజుల్లో సాధారణంగా జరిగేవి. వధువరులు ఇష్టపడి అప్పటికప్పుడు చేసుకొనే వివాహమే గాంధర్వ వివాహము. శకుంతల దుష్యంతులు గాంధర్వ వివాహం చేసుకున్నట్టు భాగవత నవమ స్కంధం తెలియజేస్తుంది.

రాక్షస వివాహాలుకూడా ఆరోజుల్లో జరిగేవి. వరుడు వధువుకు సంబంధించినవారినందరిని ఓడించి వధువును బలవంతంగా తెచ్చి వివాహము చేసుకోవడమే ఈ పద్ధతిలోని ముఖ్య అంశం.

శ్రీకృష్ణుడు శిశుపాల, జరాసంధ, రుక్మి మొదలైన రాజులను ఓడించి రుక్మిణి దేవిని తీసుకవెళ్ళి రాక్షస వివాహంచేసుకున్నాడు.

వివాహం అయ్యాక వధూవరులను అత్తవారింటికి పంపిస్తారు. వారితో బాటు వారికి బంగారు, వెండి, గుర్రాలు, ఏనుగులు, దాసదాసీలను వెంటపంపేవారు. వసుదేవుడు, దేవకీ తమ స్వగృహానికి వెళ్ళేటప్పుడు దేవకీ తండ్రి దేవకుడు ఏనుగులు, గుర్రాలు, దాసదాసీజనం, వెండి, బంగారు, మొదలైనవి ఎన్నో సారెగ పంపాడు.



## కుటుంబ జీవితం :

భార్య, భర్తలిద్దరూ అన్యోన్యంగా జీవించాలి. అవసరమైతే ప్రేమతో పరస్పరం తినిపించుకోవాలి.

గజేంద్రమోక్షంలో ఆడ ఏనుగుకు, మగ ఏనుగు ఆహారాన్ని అందించడం ఇక్కడ గమనార్హం. భార్య, భర్తలు ఎవ్వరికి ఆపద వచ్చినా మరోకరు వారిని విడిపోరు. చేతనైతే సహాయంచేస్తారు. లేకపోతే నిస్సహాయంగా చూస్తూ ఉంటారు.

గజేంద్రుడు మొసలిచేత పట్టుపడ్డాడు. ఎంత గింజుకున్నా లాభం లేకపోయింది. బయటకు రాలేకపోయాడు. మొసలి బలం పెరుగుతూ ఉంది. ఏనుగు బలం తరుగుతూవుంది. ఆ స్థితిలో ఆడ ఏనుగులు గజరాజును విడిచి వెళ్ళలేకపోయాయి. చూస్తూ బాధపడుతూ అలాగే ఉండి పోయాయి.

# మార్గపురాణాలు - సామాజిక స్పందనలు

ఆచార్య కె. సర్వోత్తమరావు
✆ 97041 04000

వైదికవాఙ్మయానికి కావ్య వాఙ్మయానికి మధ్య సేతువులాంటిది పురాణ వాఙ్మయం. ఈ వాఙ్మయాన్ని విదేశీయులు, భారతదేశం లోని ఉద్దండపండితులు క్షుణ్ణంగా పరిశీలించి ఎన్నో అమూల్యాంశాలను లోకానికి అందించారు. కొందరు ధార్మిక దృష్టితో శైవపురాణాలు, వైష్ణవపురాణాలు, శాక్తేయపురాణాలని వర్గీకరించారు. కొందరు విద్యలదృష్టితో సాంప్రదాయ విద్యలు, ఇతర విద్యలని విభాగం చేసి సాంప్రదాయ విద్యలయిన పదునాలుగింటిలో పురాణాలు ఒకటని చెప్పారు. మరికొందరు సత్వ రజ స్తమో గుణాలను భూమికగా గ్రహించి విశ్లేషించారు. ఆధునికులు సామాజిక కోణంలో విస్తృతపరిశోధనలు చేశారు.

సంస్కృతాంధ్ర సాహిత్య చరిత్రలు విశదంగా వ్రాసిన వారిలో కొందరు పురాణాలను మార్గపురాణాలని, దేశీయపురాణాలని విభజించారు. మత్స్యాది పురాణాలు మార్గపురాణాలని, కులపురాణాలు లాంటివి దేశిపురాణాలని నడిమి గీత గీశారు. మార్గపురాణాలనడానికి వాటి ప్రాచీనత, పురాణాల అంతర్గతవిభాగం, అనుస్యూతంగా వస్తున్న పురాణసంప్రదాయం ప్రధాన కారణాలు. కర్తవ్య నిర్వహణలో మానవుల్ని ప్రభువులలాగే శాసించేవి వేదాలయితే కాంతాసమ్మితాలు కావ్యాలయితే, ధర్మమార్గంలోగల లాభాలను అధర్మమార్గంలోగల నష్టాల్ని



విడమరచి మిత్రునిలాగ ఉపదేశిస్తూ ధార్మిక కార్యాలపట్ల ఆసక్తిని, అధార్మిక కార్యాలపట్ల ఉదాసీన భావాన్ని కలుగజేసేవి మిత్రసమ్మితాలయిన పురాణాలు. అంతేకాదు పురాణాలు ఐతిహ్య సందేశాన్ని,

ధార్మికసందేశాన్ని, నైతికసందేశాన్ని క్షేత్ర తీర్థాదివర్ణనల ద్వారా ఐక్యతా సందేశాన్ని అన్నిటికి మించి ఆధ్యాత్మిక సందేశాన్ని మానవాళికి ప్రసాదిస్తున్నాయి.

'పురావృత్తం పురాణమ్' అని ఒక వ్యుత్పత్తి. ఒకప్పుడు జరిగిన వృత్తాంతాన్ని తెలియజేస్తూ తద్వారా మంచిని చెప్పేవి పురాణాలు. 'పురా అపి నవం భవతి' అనే వ్యుత్పత్తి బట్టి పాతవే అయినా కొత్తగా ఉంటుందనడం. ఒక ప్రత్యేకత. పురాణాలను పరిశీలిస్తే వాటిలో చెప్పబడినవి అంటూ ఏవీ లేవు. ఇటీవలి కాలంలో విజ్ఞానశాస్త్రంలో సామాజిక సంబంధాలలో, విలువల నిర్ధారణల్లో, వస్తున్న నేపథ్యం నుంచి పురాణ గాథలను పునరాలోచించడం మొదలై వినూతన సిద్ధాంతాలు వెలువడుతున్నాయి. ఈ మార్గంలోనిదే పురాణాలలో 'సామాజిక చిత్రణ' అనే ఆలోచన.

> వేదాలు నాలుగయితే, వేదాంగాలు ఆరయితే, మీమాంస రెండు అయితే, పురాణాలు 18.

వేదాలు నాలుగయితే, వేదాంగాలు ఆరయితే, మీమాంస రెండు అయితే, పురాణాలు 18. ఈ పురాణాలను మహావిష్ణువు యొక్క శరీరంలోని 18 అవయవాలుగా పెద్దలు భావించారు. అవే 'మ' తో మొదలయ్యే మత్స్య పురాణం, మార్కండేయ పురాణం. 'భ' తో మొదలయ్యే భాగవతపురాణం, భవిష్యపురాణం. 'బ్ర' తో మొదలయ్యే బ్రహ్మపురాణం, బ్రహ్మవైవర్తపురాణం, బ్రహ్మాండపురాణం. 'వ' తో మొదలయ్యే వాయుపురాణం, విష్ణుపురాణం, వరాహపురాణం, వామన పురాణం. 'అ' తో మొదలయ్యే అగ్నిపురాణం.

'నా' తో మొదలయ్యే నారదపురాణం. 'ప' తో మొదలయ్యే పద్మపురాణం. 'లిం'తో మొదలయ్యే లింగ పురాణం. 'గ' తో మొదలయ్యే గరుడపురాణం. 'కూ'తో మొదలయ్యే కూర్మపురాణం. 'స్క' తో మొదలయ్యే స్కాందపురాణం. ఈ పురాణాల రచయిత విష్ణ్వంశసంభూతడయిన వ్యాసుడని, వేదవిభాగం చేసిన వ్యాసుడే పురాణాలరచయిత అని సంప్రదాయం విశ్వసిస్తున్నది.

పురాణరచనకు ఆధారాలు నాలుగు. మొదటిది ఆఖ్యానం. స్వయంగా తాను చూచిన వృత్తాంతాన్ని కథారూపంగా చెప్పడం. రెండవది ఉపాఖ్యానం - ఇతరుల ద్వారా వినిన వృత్తాంతాలను కథారూపంలో పేర్కొనడం. మూడవది గాథ. కర్త పేరు తెలియని, మహాపురుషులకు సంబంధించిన శ్లోకాల ఆధారంగా వర్ణితాంశాలు.

నాల్గవది కల్ప శుద్ధి - శ్రాద్ధకల్పం. ఈ నాలుగు ఆధారాలతో వ్యాసుడు పురాణాలను రచించాడు. 18 పురాణాలలోని అంశాల ఆధారంగా 'సామాజిక చిత్రణ' పాఠకులకు విహంగావలోకన దృష్టితో పరిచయం చేయడం ఈ వ్యాసోద్దేశం.

## సామాజిక చిత్రణ

పంటపొలానికి పెట్టిన నీరు కాలువల ద్వారా ప్రవహించేవేళ, గట్టు బలహీనం కావడంవల్లనో లేదా ప్రవాహానికి నిరోధకమయిన బండ లేదా పెద్దగడ్డ తగలడంతోనో చెత్త చెదారం ఎక్కువ కావడంతో ప్రవాహం మరో దిక్కుకు పయనిస్తుంది. కాని రైతు వాటిని గుర్తించి అడ్డుకట్ట వేస్తాడు. అడ్డును తొలగిస్తాడు. అలాగే పురాణాలు సామాజిక అవసరాలను గుర్తించి విధి రూపంగా కొన్ని నిషేధరూపంగా కొన్ని కథల కనుగుణంగా పొందుపరచారు. ఇవన్నీ సందేశాత్మకాలే. వాటిలో కొన్ని అగ్రవర్ణాలకు చెందినవారిలో కొందరు, తక్కువ కులంలోని వారిని నీ చదృష్టితో చూస్తుంటారు. ఇది తగదని గరుడపురాణం తక్కువ కులంలో పుట్టడం నేరం కాదని, వ్యాధులు ఎవరికయినా రావచ్చుని, కష్టాలెందరికయినా రావచ్చుని, సంపదలు శాశ్వతం కావని చెప్పింది.

పురాణకాలంలో ఆధునిక జీవితకాలంలో ఉన్నట్లుగా కులతత్వజాడ్యం లేదనడానికి గరుడాది పురాణలలోని కథలే సాక్ష్యం. బోయవాడయిన వాల్మీకిని ఆదికవిగా, మహర్షిగా ఆనాడే గుర్తించారు. శుకముని జనకమహారాజు వలన తత్త్వోపదేశం ఆలకించాడు. బ్రాహ్మణుడయినా ధర్మవ్యాధుని వలన అసలయిన ధర్మమేదో తెలుసుకో గలిగాడు కౌశికుడు. తులాధరుడనే వైశ్యుని వలన జాబాలి మునికి జ్ఞానోదయం కలిగింది. శబరి అర్పించిన పండ్లను శ్రీరాముడు సంతోషంగా స్వీకరించాడు. ఇవన్నీ వితండవాదులు గుర్తించవలసిన అంశాలు.

> పురాణకాలంలో ఆధునిక జీవితకాలంలో ఉన్నట్లుగా కులతత్వ జాడ్యం లేదనడానికి గరుడాది పురాణలలోని కథలే సాక్ష్యం.

కొందరు యజమానులు నిష్కారణంగా తమ సేవకులపై కేకలు వేస్తుంటారు. అలాంటివారు నల్లత్రాచుతో పోల్చదగినవారని గరుడపురాణం. మానవతా దృష్టితో సేవకుల పక్షాన గరుడపురాణం సుస్పష్టంగా నిలవడం గుర్తించుకోవలసిన అంశం.

ఈ రోజుల్లో పట్టణాల్లో 'ట్రాఫిక్ జామ్' గురించి మాట్లాడుకోవటం, వాటివల్ల

ప్రయాణికులు, రోగులు, వృద్ధులు, విద్యార్థులు, స్త్రీలు, వ్యాపారులు పడే అవస్థలు దైవానికెరుక. ఇలాంటివాటిని కూడా విష్ణుపురాణం వర్ణించింది. ఋభుడు సర్వజ్ఞుడు. నిదాఘుడనే శిష్యునికి సర్వమూ బోధించాడు. కాని అతనికి అద్వైతవాసన అబ్బలేదు. సంవత్సరాలు గడిచిపోయాయి. ఋభుడే ఎలాగయినా నిదాఘునికి జ్ఞానోపదేశం చేయాలని తానే నగరం దాటి వెళ్లాడు. నగరం పొలిమేరల్లో నిదాఘుని చూచి ఎందుకు ఇక్కడున్నావంటే "నేనేం చేయను. అరణ్యానికి వెళ్ళాను దర్భలు, సమిధల కోసం. ఆకలి అవుతుంటే ఆశ్రమం కేసి బయలు దేరాను. కాని ఇక్కడ ఆగిపోయాను. కారణం ఒక రాజపరివారం అట్టహాసంగా కదలిపోతూ వుంది. అందుకే ఇక్కడున్నానన్నాడు".

ఇలాంటిదే మరొకటి. ఈ రోజుల్లో రహదారుల స్థితిగతులు. అలాగే రహదారులపై నడిచేవారలకున్న ఇబ్బందులు తెలుసు. రహదారుల్లో వెళ్ళే స్కూటర్లు, లారీలు, కార్లు, భారీ వాహనాల గురించి తెలుసు. అంతకంటే మించి తాగి వాహనాలను నడిపేవారి వీరంగమూ తెలుసు. రహదారి ఇబ్బందుల్ని తమ కాలంలోని చూచిన పౌరాణికులు సామాజికుల కర్తవ్యాలను కూర్మపురాణంలో పొందుపరచారు.

మనం దారిలో నడుస్తుంటాం. అప్పుడు బ్రహ్మజ్ఞాన సంపన్నులు, స్త్రీలు, రాజులు, అంధులు, ముసలివారు, బరువులు మోసేవారు, రోగులు, బలహీనులు ఎదురయితే వారికి దారి ఇవ్వాలి" అని సూచించింది.

> పురాణ లక్షణాలలో 'సర్గ' మొదటిది. ప్రపంచం యొక్క సృష్టిని తెలిపేది సర్గ. ఇదెందుకు అని కొందరు సందేహం ప్రకటిస్తారు.

పురాణలక్షణాలలో 'సర్గ' మొదటిది. ప్రపంచం యొక్క సృష్టిని తెలిపేది సర్గ. ఇదెందుకు అని కొందరు సందేహం ప్రకటిస్తారు. కాని ప్రశ్నించడమెంత అవసరమో జవాబు చెప్పడమూ అంతే అవసరం. ఇదొక ఆరోగ్య లక్షణం కూడా "కొండలు, నదులు, సారవంతమయిన ప్రదేశాల అవగాహన కోసం". ఈ రోజుల్లో చదువులకోసమో, వ్యాపారం కోసమో లేదా విహారయాత్రల కోసమో బయలుదేరేవారు ఆయా ప్రదేశాల అవగాహనతో బయలుదేరడం మన ఎరుకలోనిదే. ఇలాంటి భౌగోళిక పరిజ్ఞాన ఆవశ్యకతను పురాణాలు ఆనాడే గుర్తించి వాటిని 'సర్గ' లక్షణాలుగా

చెప్పాయి. అలాగే అన్ని రంగాలలో అభివృద్ధికి చారిత్రక పరిజ్ఞానం అవసరం. గతం గురించిన అవగాహనను వర్తమానంతో జతకడితే భవిష్యదాలోచనకు పునాది గట్టిపడుతుంది. ఇందుకే వంశచరిత్రల ప్రసక్తి. భౌతికవిద్యలెన్ని వున్నా ఆధ్యాత్మిక విద్యయే సర్వశ్రేష్ఠం. అందుకే వంశానుచరిత సంబంధ అంశాలు.

## వయసులో వైవాహికాంశలచిత్రణ

పురాణాలలో వివాహ వ్యవస్థకు సంబంధించిన నియమాలు చాలా చెప్పబడ్డాయి. బ్రాహ్మం, దైవం, ఆర్షం, ప్రాజాపత్యం, ఆసురం, గాంధర్వం, రాక్షసం, పైశాచమని 8 విధాలు. వీటిలో బ్రాహ్మం, దైవం, ఆర్షం, ప్రాజాపత్యం లాంటివి అందరూ అంగీకరించినవే. ఇతరములు అంగీకరించదగ్గవికావు. ఏ యుగంలోగాని మంచివారు చెడ్డవారుండడం సహజం. ఆ రోజుల్లోను బలవంతపు వివాహాలు కూడా జరిగేవి. అలాంటి వాటికి ఆమోదం తెలపలేదు. చివరకు శాస్త్రాలు ఏమి చేయలేక మౌనం వహించాయి. అలాగే, వైవాహిక సంబంధాలను అధ్యయనం చేసి, తక్కువ వారితో వియ్యం శాశ్వత అవమానాలకు దారితీస్తుందని, అవమానాలు భరించవలసి వస్తుందని, సమానస్థాయిలో అయితే మంచిదని హితవు చెప్పింది భవిష్యపురాణం. ఈ అసమానతలు తొందరపడి చేసుకొన్న వివాహాలలో నేటికీ కనిపిస్తున్నవే.



పురాణాలలో కొందరు ప్రేమ వివాహానికి తహతహపడినవారు లేకపోలేదు. వారిలో దేవయాని ఒకతె. తన తండ్రి శుక్రాచార్యుల దగ్గరికి విద్యార్థిగా వచ్చిన సుందరాకారుడయిన కచుణ్ణి ప్రేమించింది. రాక్షసులు రెండు సార్లు అతణ్ణి శాశ్వతంగా వదిలించుకోవడానికి వివిధోపాయాలు పన్నారు. కాని దేవయాని కచుని ప్రేమించింది కనుక తన వలపును దాచి తండ్రి శుక్రాచార్యునితో చెప్పి కచుని బ్రతికించింది. చివరకు విద్యాభ్యాసం పూర్తి అయిందని కచుడు గురువు దగ్గర సెలవు పుచ్చుకుని అమరావతికి మరలి వెళ్ళే సందర్భంలో దేవయాని తన తలపును బహిర్గతం చేసి తన్ను పెళ్ళాడమంది. కాని కచుడు నీవు గురుపుత్రివని తిరస్కరించాడు.

దేవయాని భగ్నప్రేమికురాలయింది. అతిగారాబంగా పెరిగిన అమ్మాయిలు వివాహితులైనా మంకు పట్టుదలతో జీవితం దుర్భరం చేసుకొంటారనడానికి దేవయాని సాక్ష్యం.

ప్రేమ పిచ్చిది. ఈ భగ్నప్రేమ పురుషులలో పగకు దారి తీస్తుంది. ఇందుకు ఉదాహరణ వామన పురాణంలోని 'అరజ' కథ. అరజ శుక్రాచార్యుని కూతురు. శుక్రాచార్యులు లేని వేళ 'దండు' వచ్చాడు. అరజను చూచాడు. మోహించి తన్ను పెళ్ళాడమన్నాడు. కాని 'అరజ' నీవు నాతండ్రి శిష్యుడివి. సోదరతుల్యుడవు అన్నది. అయినా దండుడు ఎన్నో కథలు చెప్పి ఆమెను లొంగదీసుకోవడానికి ప్రయత్నించాడు. ఆమె వినక పోతే చివరకు తన కామాగ్నికి బలి చేశాడు. ఇలాంటివి నేడూ లేకపోలేదు. తనకు దక్కని అమ్మాయి ఇతరులకు దక్కకూడదని ఒక పేరాశతో కసితో అమ్మాయిపై ఆసిడ్ పోయడం, దారుణంగా హత్య చేయడం లాంటివి మీడియాలో నేడూ చూస్తున్నాం.

> స్వచ్ఛమయిన ప్రేమకు బలముంటుంది అనడానికి భవిష్య పురాణంలోని వామనమధుమతుల వృత్తాంతం ఒక సాక్ష్యం.

స్వచ్ఛమయిన ప్రేమకు దైవబలముంటుందనడానికి భవిష్యపురాణంలోనివామనమధుమతుల వృత్తాంతం ఒక సాక్ష్యం. ధర్మస్థలిపురంలో సుశీల హరిశర్మల కూతురు మధుమతి. ఈ తరుణి 'వామనుని' ప్రేమించింది. కాని తండ్రి 'త్రివిక్రమునికి' తన అమ్మాయినిచ్చి పెళ్ళి చేయాలనుకొన్నాడు. అన్న తన గురుపుత్రుడయిన 'కేశవునికిచ్చి పెళ్ళి చేయాలనుకొన్నాడు. కాని దురదృష్టవశాన మధుమతి పెళ్లికి ముందే పాము కాటుకు మరణించింది. ముగ్గురు హతాశులయ్యారు. ఒకడు విచారంతో దేశద్రిమ్మరి అయ్యాడు. రెండవవాడు అస్థికల్ని తీసుకుని తీర్థయాత్రలకు వెళ్లాడు. వామనుడు మాత్రం 'మధుమతి' చితి దగ్గర ఉండిపోయాడు. దేశద్రిమ్మరి ఒకసారి సరయూ నదీతీరంలోని రామశర్మ ఇంటికి భిక్షకు వెళ్ళాడు. ఆ రోజే రామశర్మ ఇంటి దాసి కొడుకు చనిపోయాడు. దాసి గగ్గోలు పెడుతుంటే రామశర్మ దాసికుమారుని తన మంత్రశక్తితో బ్రతికించాడు. ఈ దృశ్యం చూచిన త్రివిక్రముడు ' రామశర్మ వల్ల ఆ విద్య నేర్చుకున్నాడు. సరాసరి సరయూతీరానికి వచ్చాడు. అస్థికల్ని పట్టుకొనిపోయిన 'కేశవుణ్ణి' పిలిపించమన్నాడు. 'కేశవుడు అస్థికలతో రానే వచ్చాడు. అస్థికల్ని తనచేత బట్టుకొని త్రివిక్రముడు రామశర్మ దత్తమయిన మంత్రం పఠించాడు. మధుమతి బ్రతికింది. ఎవరిని పెళ్లాడలో నిర్ణయించు కోలేకపోయింది. బేతాళుడు ఈ కథను విక్రమార్కునికి చెప్పి మధుమతి ఎవరిని పెళ్ళడాలని అడిగితే మంత్రం పఠించి బతికించినవాడు 'తండ్రితో సమానుడు.

అస్థికలు తెచ్చి ఇచ్చినవాడు 'సోదరతుల్యుడు' చితి దగ్గర కాలక్షేపం చేసినవాడు 'వామనుడు'. అతడే వరుడని విక్రమార్కుని సందేహం తీర్చాడు.

## వివాహానంతరసంబంధాలు సమస్యల సామాజిక చిత్రణ

భారతదేశంలో సగటు సామాన్య స్త్రీలు కూడ తన మగనిని ఎవరయినా చులకనగా చూచినా, మాటలాడినా ఆ అవమానం తనకు జరిగినట్లుగానే భావిస్తారు. తపిస్తారు. పుట్టింటి మమకారం సహజంగావున్నా మెట్టిల్లు శాశ్వతమని నిర్ధారించుకొన్నవారి మనస్తత్వం భిన్నంగా వుంటుంది. ఇందుకు ఉదాహరణ - మత్స్య పురాణంలోని సతీదేవి చరిత్ర.

దక్షుడు తాను తల పెట్టిన యాగానికి శివుని దప్ప ఇతర దేవతలను ఆహ్వానించాడు. అంతేకాదు శివుణ్ణి 'చులకన' చేశాడు. పుట్టినింటి మమకారంతో వెళ్ళిన సతీదేవికి కనీస మర్యాదలు కరువయ్యాయి. తన భర్తను తన తండ్రి కూడా అవమానించడం సహించలేకపోయింది. చివరకు సతీదేవి యోగాగ్నిలో దగ్ధమయింది.

భారతదేశంలో ఒక స్త్రీకి సంసారిక జీవితంలో ఎదురయ్యే మరొక సమస్య 'అత్త, ఆడపడుచుల' వర్తనం. తన వ్యథ భర్తతో చెప్పుకొన్నా లాభం లేదని స్త్రీలకు తెలుసు. పుట్టించేవారికి చెప్పినా వారికి తీర్చలేని మరింత వ్యథ. ఇలాంటి సందర్భాలలో స్త్రీలు తనకు దైవమే దిక్కుగా భావించడం సహజం. అదే ఏకైక కర్తవ్యం. ఇందుకు ఉదాహరణ మత్స్య పురాణంలోని 'అనౌపమ్యకథ' ఈమె వింధ్యావళి బలిచక్రవర్తుల కోడలు కుంభీనసి. 'అనౌపమ్య' ఆడపడుచు.

> భారతదేశంలో ఒక స్త్రీకి సంసారిక జీవితంలో ఎదురయ్యే మరొక సమస్య 'అత్త, ఆడపడుచుల' వర్తనం. తన వ్యథ భర్తతో చెప్పుకొన్నా లాభం లేదని స్త్రీలకు తెలుసు.

తన్ను అత్తమామలు ఆదరించడం లేదని, అత్తగారికి సంతోషం లేదని, ఆడబిడ్డ తన్ను చూస్తూనే మెటికలు విరుస్తుందని, వీరందరిని సుముఖులుగా చేసుకోవాలంటే ఏ వ్రతం చేయాలని నారదమహర్షిని అడిగింది. అపుడా దేవర్షి స్త్రీలకు సౌభాగ్యం, సౌందర్యం మరి భర్త సదావశుడుగా ఉండడానికి చేయవలసిన దానాలు, వ్రతవిధానాలు చెప్పాడు. ఈనాటివలె ఆనాడు పంచాయితీలు లేవు. దైవబలమే అన్ని బలాలకన్న మిన్న.

భర్త మరణించినా భార్య విరక్తురాలయినా ఒక స్త్రీ ఆలోచనలోని ప్రత్యేకతను 'లింగపురాణం' చాటింది. 'అదృశ్యంతి' భర్త మరణించినా అత్తామామల కోసం, తనకు పుట్టబోయే కొడుకుకోసం, తాను బతకాలని అనుకొంది. అలాగే బిడ్డను ప్రసవించింది. పెరిగి పెద్దవాడయిన అదృశ్యంతి కుమారుడు తండ్రికోసం తహ తహలాడాడు. చివరకు శివానుగ్రహంతో ఆ కుమారుడు తండ్రిని పినతండ్రిని కూడా చూడగలిగాడు.

> నేటి సమాజంలోని దంపతులను పరిశీలిస్తే వారిలో భర్తల కంటే భార్యలు నిపుణవతులు. ఆటుపోటులకు తట్టుకొని నెగ్గుకు వచ్చే నెలతలుగా కనిపిస్తారు.

నేటి సమాజంలోని దంపతులను పరిశీలిస్తే వారిలో భర్తల కంటే భార్యలు నిపుణవతులు. ఆటుపోటులకు తట్టుకొని నెగ్గుకు వచ్చే నెలతలుగా కనిపిస్తారు. మరి కోరి వివాహం చేసుకొన్నప్పుడు సమస్యలను ఎదుర్కోవలసింది స్త్రీలే. ఇలాంటి నేపథ్యంగల కథ 'సావిత్రి' కథ.

సత్యవంతుడు అల్పాయుష్కుడని తెలిసినా సావిత్రి అతడినే వివాహమాడింది. అతని వెంబడి సదా వుంటూ రక్షగా నిలబడింది. చివరకు అరణ్యంలో భర్త ప్రాణాలు తీసుకుపోయే యమధర్మరాజును దర్శించింది.

అతనిని వెంబడించింది. తనకు తెలిసిన ధర్మాలను విశదం చేసి భర్తను బతికించుకోగలిగింది. అలాగే మామగారి యోగక్షేమాల పట్ల కూడా ఆసక్తిని సావిత్రి ప్రకటించడం కూడా ఊహాతీతం. కోడలికి అత్తమామలపట్ల గల అనురాగ బాధ్యతలు ఈనాడు ఊహాతీతం. ఆర్షసంప్రదాయానికి ఇదొక మణికిరీటం.

భార్యాభర్తలు బండికి రెండు చక్రాలలాంటివారు. ధర్మార్థకామాదుల లక్ష్యంతో ఒకరికి మరొకరు సాయపడుతూ త్రికరణశుద్ధిగా జీవితం గడిపేవారు. సంసారంలో ఎన్నిచిక్కులున్నా, భార్య డీలాపడితే భర్త ఓదార్చడం, భర్త వికలితమనస్కుడయిన వేళ, భార్య తన బాధ్యతను నిర్వహిస్తూ బాసటగా నిలబడడం లేకపోలేదు. ఇలాంటి నేపథ్యం గల కథ పద్మపురాణంలో ఉంది.

వివాహితులయిన దంపతులు సంసారం కొనసాగిస్తూ తమకు సంతానం కలగాలని ఆశించడం సహజం. సంతానకాంక్ష పురుషులలో కంటే స్త్రీలలో ఎక్కువ అనడం నిర్వివాదాంశం. కాని పద్మపురాణంలో సోమశర్మ తనకు సంతానం లేదని

చాల బాధపడతాడు. భర్త దిగులును అర్థం చేసుకొన్న భార్య సుమన భర్తను ఓదారుస్తుంది. ధనపుత్ర కళాత్రాదులే సుఖం కాదని ఎన్నో ఉదాహరణలతో విశదం చేసింది. ఇలాంటివి అరుదు.

ఇలాగే ధర్మనిర్వహణలో భర్త తటపటాయిస్తుంటే భార్య భర్తకు బాసటగా నిలవడం మార్కండేయ పురాణంలో కనిపిస్తుంది. హరిశ్చంద్రుడు భార్యాపిల్లలతో కాశి చేరుకొన్నాడు. మునికిచ్చిన నెల గడువు తీరుతుందనగా హరిశ్చంద్రుని భార్య చంద్రమతి, భర్తతో సత్యం, వాగ్దాన పాలనల గురించి బోధిస్తూ భర్తకు ఏదోరకంగా ఉపయోగ పడడము స్త్రీ ధర్మమంటూ తన్ను అమ్మేయమంటుంది. హరిశ్చంద్రుడు విధి లేక ఒక బ్రాహ్మణునికి భార్యను అమ్మేశాడు.

ఒక పురుషునికి ఒక భార్య మాత్రమే. కాని పౌరాణిక కథలలో ఒక ప్రజాపతికో లేక ఒక రాజుకో ఎందరో భార్యలుండడం గుర్తించవచ్చు. వీటికి చాల కారణాలున్నాయి. ఈ చర్చ ఇక్కడ అనవసరం. ఇద్దరు భార్యలయితే సవతికయ్యం సహజమే. అంతేకాదు వారిని పెళ్ళాడిన భర్త జీవితం 'అడకత్తెరలోని పోక చెక్క ఇలాంటి నేపథ్యంగల కథ 'ఉత్తానపాదుని కథ' శ్రీమద్భాగవతంలో ప్రసిద్ధమే.

ఉత్తానపాదునికి సునీతి, సురుచి భార్యలు. సునీతి కుమారుడు ఉత్తముడు. సురుచి కుమారుడు ధ్రువుడు. రాజుకు సురుచి పట్ల అత్యంతానురాగం. కారణం 'పేరులోనే ఆకర్షకముండడం' ఆకారంలోను సురుచి కావడం అందుకే రాజుకు ప్రియ అయింది. సునీతి పట్ల అంత ప్రియత్వముందో లేదో తెలియదు. మంచి నీతి ఎపుడూ ఎవరికయినా అప్రియమే. ఈ కథలో రాజు సురుచి అంతఃపురంలో ఉన్నప్పుడే ఉత్తానపాదుడు సురుచి కొడుకును లాలించవలసిన పరిస్థితి. అక్కడ ధ్రువుడు వచ్చినా తండ్రి అంకం అధిరోహించాలని అనుకొన్నా భార్య సురుచి సవతి సునీత కుమారుణ్ణి తండ్రి తొడ ఎక్కకుండా లాగిపారేసింది. ఉత్తానపాదుడు ఈ సన్నివేశంలో నిస్సహాయుడు.

ఉత్తానపాదునికి సునీతి, సురుచి భార్యలు. సునీతి కుమారుడు ఉత్తముడు. సురుచి కుమారుడు ధ్రువుడు.

నేటికాలంలో భర్త ఇంటికి ఆలస్యంగా వచ్చినా, తనతో ముభావంగా ఉన్నా ముందులాగ అనునయం, ఆప్యాయతతోడి పలకరింపులు. సంప్రదింపులు లేకపోతే భార్య భర్తను అనుమానిస్తుంది. అతని చేతలను పరిశీలించి నిలదీస్తుంది.

మగడు ఎంత చెప్పినా భార్య మూర్ఖంగా ప్రవర్తిస్తుంది. ఇలాంటి నేపథ్యం గల కథ మత్స్యపురాణంలో చీమల జంట సంభాషణ ద్వారా చెప్పబడింది.

ఆడచీమ అలిగింది. మగచీమ బాధపడింది. కాని ముభావంగానే ఆడచీమ ఉండడంతో మగచీమ ఆమెను పొగిడి నాపై అలుకెందుకని బుజ్జగిస్తూ అడిగింది. అపుడు ఆడచీమ, నాకేమీ తెలియదనుకొన్నావా! కుడుముల పిండి నాకు ఇవ్వక మరో ఆడచీమకు ఇచ్చావు కదా' అంది. అపుడు మగచీమ 'ఓస్! ఇంతేనా! ఆ ఆడచీమ అచ్చం నీలాగే ఉంది. నీవే అనుకొన్నాను. తప్పు తప్పే మన్నించమంది. ఇలాంటి భ్రమలు అపోహలు నేటి నవ నాగరిక లోకంలోనూ కనిపిస్తాయి.

నేటి సమాజంలో కొందరు సుందరాంగులు తమ అందచందాలు శాశ్వతమనే భ్రమలో ఉంటారు. అంతే గాక తమకు సంతానం కలిగితే తన శారీరక సౌందర్యం గగన కుసుమం అవుతుందని అనుకొంటారు. ఇలాంటి భ్రమగల ఒక సుందరాంగి కథ శ్రీమద్ భాగవతంలో ఉంది.

ఆత్మదేవుని భార్య ధుంధులి. ఈ దంపతులకు చాలాకాలం సంతానం లేదు. ఆత్మదేవుడు అడవి దారి పట్టాడు. ఒక సన్యాసి ఆత్మదేవుని వ్యథను విని ఒక పండు ఇచ్చి భార్య చేత ఆరగింపజేయమని ఆదేశించాడు. 'నీకు సంతానం తథ్యమన్నాడు. ఆత్మదేవుడు సంతోషంతో ఇంటికి వచ్చి భార్యకు ఆ ఫలమిచ్చాడు. ఆరగించమని ఆదేశించాడు. ఆపై ఏదో పని మీద బయటికి వెళ్లాడు. దుంధులి ఆలోచించింది. చెలికత్తెను పిలిచి పండు తినడం వల్ల గర్భం, ఆపై అనుకోని ఊహించని శారీరక పరిణామాల వల్ల అందచందాలు తరగడం, ఒక వేళ ఏవయినా అనుకోనివి జరిగితే ఆడపడుచులు తన ఆస్తి కైవశం చేసుకొంటారని. అందుకే ఆడది బ్రతకాలంటే సుఖపడాలంటే గొడ్రాలిగా బతకాలి లేదా విధవకావాలని విచిత్రవాదనలు చేసింది. అపుడా చెలి 'నేను గర్భవతిని. నాకు సంతానం కలిగితే ఆ బిడ్డను నీకిస్తాను. మగడు అడిగితే గర్భస్రావమయిందంటాను. కోరినంత డబ్బు నీవు ఇవ్వాలి' అని నచ్చచెప్పి సన్యాసి ఇచ్చిన పండును ఆవుకు పెట్టించింది. ఇలా కథ అనేక మలుపులు తిరుగుతుంది.

పురాణాలు స్త్రీలను ఎక్కడా కించపరచలేదు. సాధారణంగా వివాహాదులలో ఇరువైపులవారు అమ్మాయికి కానుకలను సంతోషంగా ప్రదానం చేస్తారు. ఆ నగలకు, కానుకలకు వధువే సర్వాధికారిణి. కుమార్తెకు అత్తవారుగాని ఇతర బంధువులు కాని ఇచ్చిన కానుకలను అమ్మకానికి పెడితే, తన వద్ద లేదని నిరాకరించినా ఆయా వస్తువుల వెలకి రెట్టింపు వెలలతో దండించవలసిందే

అనే ధర్మవ్యవస్థను మత్స్యపురాణం విశదం చేస్తుంది. అలాగే పద్మపురాణంలోని 'భూమి ఖండం' యుద్ధాలవల్ల స్త్రీలకు కలిగే దుఃఖతీవ్రతను వివరించింది. స్త్రీలను అవమానించకూడదని విష్ణుపురాణం పన్నెండవ అధ్యాయంలో శాసించింది. అలాగే ఏ పురుషడయినా ధర్మార్థకామాల్ని సాధించాలంటే ఆ వైదిక కార్యక్రమాలలో అర్ధాంగి పాత్ర ఎంతో ఉందని, ఆ యథార్థాన్ని గ్రహించి భార్య ఆశయాలకు అనుగుణంగా నడచుకోవాలని, ఆమెను పీడించరాదని హెచ్చరించింది. పరస్త్రీలను కామించరాదని, అలా చేస్తే ఆ పురుషులు పాపాత్ములై నపుంసకులవుతారని బ్రహ్మపురాణం శాసించింది. ఇలాంటివి ఎన్నో పురాణాలలో కథలరూపేణ కనిపిస్తాయి.

పురాణాల కాలం నాటి సమాజానికి ఆధ్యాత్మిక చింతన ఎక్కువ అనడంలో సందేహం లేదు. ఈ చింతలకు తగినట్లు పురాణాలు యోగ, జ్ఞాన, కర్మమార్గాలను, ఆ మార్గాలను అనుసరించిన వారి గురించి చెప్పినా సామాన్యులకు భక్తి మార్గమే శరణ్యమని సూచించింది. ప్రజలు ఆలయాలకు వెళ్ళడం, నదులలో పుణ్యస్నానం ఆచరించడం, ప్రసిద్ధ క్షేత్రాలను సందర్శించడానికి వీలుగా ఆలయ సంస్కృతిని, క్షేత్ర తీర్థమహాత్మ్యాలను దానధర్మాలను, సదాచారఫలితాలను ఎన్నో కథల ద్వారా విశదం చేసింది. పురాణాలు కేవలం ఆర్యావర్త జీవనాన్ని మాత్రం గాక ప్రాక్ పశ్చిమ, ఉత్తర దక్షిణ ప్రాంతాల ప్రజల జీవితాలను వర్ణించడంలో 'భారతదేశమంతా ఒకటే. సనాతన ధర్మమొకటే' అనే భావన ప్రజలలో ఉందనడాన్ని నిరూపించగలిగింది. ఆరాధనలలోని శైవ, వైష్ణవ, శాక్తేయాదులను వర్ణించినా ప్రజలు తమకు నచ్చిన మతాన్ని స్వీకరించేవారని పురాణాలవల్ల తెలుస్తున్నది. అలాగే కొన్ని కారణాల వలన శైవవైష్ణవాలు వైషమ్యాన్ని పెంచినా హరిహరనాథ సిద్ధాంతం ద్వారా సామరస్యాల్ని స్థాపితం చేయగలిగింది. ఆనాటి ప్రజలు భౌతికజీవనాన్ని గడుపుతున్న వారి తుది లక్ష్యం మాత్రం 'ముక్తి' గానే భావించడం వారి ధార్మికనిష్ఠను సూచిస్తుంది. పద్దెనిమిది పురాణాల కాలంనాటి సంస్కృతి నేటికీ రూపాంతరాలతో కొనసాగుతూ వుందనడం సత్యం. పురాణాలను చదవనివాడు అజ్ఞుడు. సమన్వయించు కోవడం తెలియని వాడు అధమాతి అధముడు.

## ఆధార గ్రంథాలు


1. పురాణపరిచయం - ఆచార్య జానమద్ది రామకృష్ణ

2. పురాణ వాఙ్మయ సమాలోచనం, కాకతీయ విశ్వవిద్యాలయం - సదస్సు సంచాలకులు ఆచార్య అనుమాండ్ల భూమయ్య.

# దేశీయ పురాణాలలో సమాజ దర్శనం

డా. సిహెచ్. బాబావలిరావు
99897 92247

నేటి సాంఘికేతివృత్తం రేపటి చారిత్రకం. ఈ చారిత్రకం మాపటి ఐతిహాసికం. ఈ ఐతిహాసికం ఆవలి పౌరాణికం. కాలంరీత్యా దూరమయ్యే కొద్దీ ఈవిధమైన అంతరాలు తలెత్తుతాయి. సత్యదూరాలుగా, కల్పితాలుగా కన్పిస్తాయి. సునిశిత పరిశీలనలో, పరిశోధనలో సత్యాలుగానే నిలుస్తాయి. రామసేతువువల్ల రామాయణం, ద్వారకవల్ల, కురుక్షేత్రభూగర్భలభ్యాల వల్ల మహాభారతం చరిత్రగ్రంథాలనే విషయం నేడు నిరూపితం అవుతున్నట్లు. నాసావారు చెబితే నమ్మకం కుదిరింది. కలియుగభీముడు కోడిరామమూర్తి నాయుడిని చూస్తే, వింటే మహాభారతంలో భీముడున్నట్లే. మన వస్తుప్రదర్శనశాలల్లోని ఆయుధాల్ని చూస్తే నిన్నమొన్నటి మన చరిత్రపురుషులు ఎంతటి బలాఢ్యులో అర్థమవుతుంది.

మానవుడు సంఘజీవి. కవి అందులో ఒక ముఖ్యభాగస్వామే. అందువల్ల సమాజానికి మిక్కిలి దూరంగా జరిగి ప్రవర్తించలేడు. వ్రాయలేడు. అంబరచుంబి కవిత్వం వ్రాస్తూ గగనగమనం చేస్తున్న కవి కూడా పరోక్షంగానైనా సమాజాన్ని తన కవితాదర్పణంలో ప్రతిబింబించగలడు. అందులో నాటి జనజీవనవిధానం తొంగిచూస్తుంది. వాల్మీకి శ్రీరాముడు సమకాలికులు. కావున రామాయణం ఆనాటి సాంఘికం. మహాభారతం అంతే. వ్యాసుడు తనకాలంలో జరిగిన విషయాలనే పైగా తానూ ముఖ్యపాత్రగా కలిగిన ఇతివృత్తాన్నే అక్షరీకరించాడు. ఇతిహాసమంటే "ఇతి హ"-ఈవిధంగా ఉన్నదనేదే అర్థం కదా!

శ్రీకృష్ణదేవరాయలవారి ఆముక్తమాల్యదనే పరిశీలిద్దాం. కథలు ప్రాతవైనా అందలి విషయనివేదనమంతా ఆనాటిదే. విష్ణుచిత్తుడు వంటి

అతిథిసేవాతత్పరులు ఆకాలంలో ఎందరో ఉండి ఉంటారు. వారందరికి ప్రతినిధి ఆతడు. ఆనాడు ఏయేకాలాలలో, ఋతువులలో ప్రజలు ఏయే పదార్థాలు తింటున్నారో తెలుస్తున్నది. శాకాహారుల, మాంసాహారుల రుచులు సైతం చెప్పబడ్డాయి.

"తెలినులివెచ్చయోగిరముఁదియ్యని చారులుఁదిమ్మనంబులున్
బలుచని యంబళుల్చెఱకుపాలెడనీళ్లు రసావళుల్ఫలం
బులును సుగంధిశీతజలముల్వడపిందెలు నీరుఁజల్లయున్
వెలయఁగఁబెట్టు భోజనము వేసవిఁజందనచర్చమున్నుగన్"

ఆముక్తమాల్యద -ప్ర.ఆ., 81ప.

భంగ్యంతరంగా విజయనగర రాజ్యకాలపరిస్థితుల నిరూపణమే కావ్యమంతా. కాదన వీలులేదు. తానే యామునుడై రాజనీతిని బోధించాడు.

ఆనాడు పంచముల స్థితి మహాఘోరం. వర్ణవ్యవస్థ అంత బలంగా ఉంది. దాని పరిరక్షణే రాజుల కర్తవ్యం. కాదంటే వారి పదవికే ప్రమాదం. అందుకే అసహాయుడై తన ఆవేదనను మాలదాసరి కథ రూపంలో తెలియజేశాడు. దాసరి సామాన్యుడు కాదు. అసామాన్యుడైన విష్ణుభక్తుడు.

"గండాభోగములన్మదశ్రులహరులప్పన్నుతుల్పాడియా
దండంన్రేగులుడించి భక్తిజనితోద్యత్తాండవంబాడు నా
చండాలేతరశీలుఁడుత్పులకియై చాండాలికన్మీటుచున్
గుండుల్నీరుగనెండగాలిపసితాఁకుంజూడకాప్రాహమున్"

ఆముక్తమాల్యద-ష. ఆ., 07ప.

ఆతడు త్రాగే తీర్థమెంతటి అపరిశుభ్రమో!

"అట్లుతడవుగ గొల్చి సాష్టాంగమెఱఁగి
గర్భమంటపిఁగడిగిన కలఁకజలము
లోని జాతొట్టినిండి కాలువగఁ జాఁగి
గుడివెడలి వచ్చునది శూద్రుఁడిడఁగఁగ్రోలి"

ఆముక్తమాల్యద ష. ఆ., 08ప.

'గర్భగుడి' కడిగితేనే జలం కలకబారింది. అది లోపలి రాతి తొట్టిలో పడింది. ఆ తొట్టి నిండితే క్రిందబడి కాలువపై నెమ్మదిగా బహిఃప్రాకారం దాటి బయటికాలువలో కలవడానికి వస్తున్నది. దాన్ని తాను నేరుగా తాకడు. ఏ శూద్రుడో ఏ చిన్నపాత్రతో పట్టి పోస్తేనే త్రాగుతాడు. ఎంతటి మురి కినీరో చెప్పలేం. అందుకే రాయలవారికి కన్నులనుంచి రక్తం కారి ఆ దాసరి చేత ఒక బ్రాహ్మణుడికి ముక్తినిప్పించారు. వరాహపురాణంలోగల కథ అయినా తన ఆవేదనను వెళ్లగక్కడానికి అనువైనది కాబట్టే గ్రహించి గుణభరితంగా నిర్వహించాడు.

సోమశర్మ బాటసారి బృందాన్ని దొంగలు దోచుకున్నారు. రాజెంత సమర్థుడైనా దొంగలపీడ ఉంటూనే ఉన్నదనే సామాజికాంశం తెలుస్తున్నది.

కట్టుబట్టగొని ప్రాంతబట్ట దయను
గోఁచులకు నిచ్చి గనపరాకులు నిగిడ్చి
చెప్పుటట్టలు శోధించి సిగలు విప్పి"

ఆముక్తమాల్యద-ష.ఆ., 78వ.

నేటి కస్టమ్స్ ఆఫీసర్లు చేసే తనిఖీని మించిన తనిఖీ దొంగలు చేశారు. ధనం వెలుపలికి తీయడానికి. మంచి క్రొత్తబట్టలు కూడా లాక్కున్నారు. సిగ్గుచెడకుండా ఉండడానికి గోచిపాతలకు ప్రాతబట్టలిచ్చారట. ఎంతటిదయో! రాయలవారే ఆ దయకు ఆశ్చర్యపోయారు.

గడియారం వేంకట శేషశాస్త్రిగారి శివభారతం పూర్తి చారిత్రక గ్రంథం. అట్లే కొడాలి వారి హంపీక్షేత్రం. అట్లే తుమ్మలవారి గాంధీజీ ఆత్మకథ, సర్వోదయగానం, జాషువాగారి గబ్బిలం సామాజిక స్పృహకు దర్పణాలు.

తుమ్మలవారి ఈ చక్కటి పద్యం చూడండి!

"సోలుచు కూలికి వేగిన
మాలెత పొలమందె గొబ్బిమండలనడుమన్
బాలకునిఁగనియెనతఁడీ
నేలకుఁబిడుగో వచింపు నిక్కపునిసుగో"

సర్వోదయగానామృతం-22పుట

నిజంగా ఆతడు పసికూనకాడు. పిడుగువంటివాడే. బడుగుజీవుల బ్రతుకిది. ఇంకా ఇలా మహాఘోరాన్ని ఎక్కటిగా చెబుతున్నారు.

"కుక్కలనుగదల్చి ప్రుక్కడి పందులు
మందలించి కడుపుమంటలార్ప
ఎంగిలాకునాకునేనాదిమూకలు
లేనిపండువిది ఫలింపవలయు"
సర్వోదయగానామృతం-పుట-23
ఈ నైచ్యం ఇప్పుడంతగా లేదుగాని పూర్వముండేది.
కవిగారి దుఃఖం ఉపశమించింది.

విశ్వనాథసత్యనారాయణగారి వేయిపడగలు సమాజానికి సుందరముకురం, సుబ్బన్నపేట ఊరు, కృష్ణమనాయుడు, ధర్మారావు మున్నగు పేర్లు వారి కల్పనేగాని కథ అంతా సాగుతున్న సంఘానికి ప్రతిబింబమే. సమాజంలో గల గుణాలలోపాల సంమిశ్రమం వేయిపడగలు.

ఇక మాలపల్లి వంటి నవలలు, పాలేరు, పల్లెపడుచు వంటి నాటకాలు సామాజిక స్పృహ స్ఫూర్తిమంతాలు. బోయి భీమన్నగారి పాలేరు నాటకం దళితుల, బడుగు బలహీనుల జీవనాలకు అద్దం. భూస్వాములెంత కఠినంగా వీరి శ్రమను దోచుకుని బ్రతుకుతున్నారో కన్నులకు కట్టింది. అయితే వారిలోనే కొందరు ఈ బడుగుల ఉన్నతికోసం ఎలా పాటుపడి విజయులయ్యారో కూడా చెప్పారు కవి. ప్రకృతే గుణదోషభరితం. ఇక అందులో భాగమైన సంఘం మాత్రం అందుకు భిన్నంగా ఉంటుందా? పాలేరు వృత్తి మాని ఎందరో దళితయువకులు ఉన్నతవర్గాల ఆదరణ పొంది చదువుకుని పెద్దపెద్ద ఉద్యోగులై వారితో వియ్యమంది కులరహిత సమాజానికి బాటలు వేయడం పాలేరు నాటక ప్రబోధం వల్ల జరిగింది.

పాలేరు నాటక నాయకుడు వెంకుడు, వేంకటేశ్వరుడై తనను ప్రేమించిన, తాను ప్రేమించిన కామందు కుమార్తె బాలను వివాహమాడాడు.

"బాలసూర్యుడో వేంకటేశ్వరకుమారు
డనగ వెలసె వివాహమండపమునందు
నూతనోత్ఫుల్లపద్మమురీతి బాల
భారతీదేవికిది నిండుపర్వదినము"

పాలేరు-23వ రంగం 100పుట.

కుటిలకులభేదకుడ్యాలు కూలద్రోసి
పూర్వవైభవశిఖరాలబూజుదులిపి
తెలిసి జాతి నిద్దురలేచి నిలిచి నడువ
బాలఁబెండ్లాడె వేంకటేశ్వరుడు నేడు”

పాలేరు–23వరంగం 101.పుట

పల్నాటివీరచరిత్ర ముమ్మూర్తులా దేశీయపురాణమే. అందు ఆనాటి ప్రజల జీవనగమనం ఎంతో ప్రస్ఫుటం. ఆనాటి కోడిపుంజుల పందేలు నేటికి ఆంధ్రదేశంలో కొనసాగుతున్నాయి. ఏడేండ్ల అరణ్యవాసం లాంటి పందేలు కాకున్నా కోటానుకోట్లు చేతులు మారుతున్నాయి. ఎందరో ఓడి బాధపడుతున్నారు. రాజులు పిన్నలై, సచివాయత్తులైతే ఆ దేశాలు, రాజ్యాలు ఎలా పాడవుతాయో ఈ పురాణం నిరూపిస్తుంది. నలగాముడు పందెం కాయలేదు. మంత్రి నాగమ్మ కాసింది. మలిదేవుడు పందేనికి ఒప్పుకోలేదు. మంత్రి బ్రహ్మనాయుడే ఒప్పుకున్నాడు. ఈ రచయిత ‘వీరపలనాడ’ని పూర్వమెప్పుడో ఒక గేయం వ్రాశాడు మా ఊరు గేయసంపుటిలో,

“ఇది వీరులు పుట్టిన పలనాడు
ఇది ధీరులు తిరిగిన పలనాడు
అనుగురాజుకు ధనదుపురపుతెలుగురాజులు
మైలమదేవితొ అరణమిచ్చిన రాజ్యమిది

చంద్రవంకయు నాగులేరును కృష్ణవేణియు
గలగలపారుచు బిరబిరసాగుచు
ప్రజలదప్పిక నిత్యము తీర్చిన ధరణియిది
శీలము బ్రహ్మన మంత్రిగనిలచి
అంటునుగింటును ప్రక్కకునెట్టి
చాపకూటికి నాంది పలికిన భూమి యిది

మాలమాదిగలగుళ్లకు చేర్చి దేవుని
చూపిన బ్రహ్మనాయుని గడ్డయిది
మాలకన్నమ సైన్యము నడిపి
కత్తి త్రిప్పిన రక్తము కక్కిన సీమయిది

గ్రుడ్డులొ పిండమె పుంజో పెట్టో

తెలియకముందె కూతలు కూసిన దేశమిది
కోడిపందెమె ప్రీతిపాత్రమై
రాజ్యము చెరిచిన గడ్డయిది
పడతి నాగమ పన్నిన ఎత్తులు
కలిగిన నష్టము తిరముగ నిలిచిన ప్రాంతమిది
రాజులు వెనుక మంత్రులు ముందు
తెచ్చిన తంటా చాటి చెప్పెడి దేశమిది
మంత్రులిద్దరి ఎక్కువ తక్కువె
దురభిమానమె మొండిపంతమె
ముప్పును తెచ్చిన భూమియిది

అలమందలు ధనధాన్యాలు వెండిబంగరుల్
మేడలు మిద్దెలు రాచనగరులు దేవమాతృకల
సస్యశ్యామల కన్నులపండువు పుడమి యిది
యుద్ధరాక్షసి పదఘట్టనచే తునాతునకలై
చెల్లాచెదరై బీడుగమారిన భూమి యిది
బాలచంద్రుని బంగరు శౌర్యము
మగువమాంచాలి శీలము త్యాగము వీరము
చిరముగ నిలచిన సీమయిది

గోగుకూరయు కొరవికారము
జొన్నసంకటి అమృతసమమై
చవులు గ్రక్కిన దేశమిది
తిట్టిన తిట్టూ తిట్టక తిరిగిన
శ్రీనాథకవిశ్రేష్ఠు కష్టపెట్టిన భూమియిది
పుల్లరికొరకై ఎదురు తిరిగిన
అంజనితనయుడు కనెగంటికులతిలకు
హనుమంతు పుట్టిన గడ్డయిది
ఇది వీరులు పుట్టిన పలనాడు
ఇది ధీరులు తిరిగిన పలనాడు”

మా ఊరు-పుటలు-52-55

ఇంతకన్నా సమాజం ఎందు కన్నులకు కట్టుతుంది. అసలు పురాణం పేరుతో గల బసవపురాణాదర్శంలో సంఘం ఎలా దర్శనమిస్తుందో పరికిద్దాం. పాలకురికి సోమనాథ కవి బసవపురాణాన్ని వ్యాసభగవానుడు పురాణాల్ని వ్రాసినట్టే వ్రాశాడు. దేవాధిదేవుడు శివభగవానుడి లీలావిశేషాలు, నందీశ్వరావతారమైన బసవదండనాయకుడి శివభక్తి, జంగమారాధన, పలువురి శివభక్తుల నైనారుల కథలు, కర్మరతులైన అద్వైతవిశిష్టాద్వైత ద్వైత బ్రాహ్మణవ్యతిరేకత ఇందు వర్ణితం.

"వేదజ్ఞులగుకోటివిప్రులకన్న/మాదటఁబెట్టినయట్టిఫలంబు
త్ర్యక్షభక్తునకొక్కభిక్షంబువెట్టు/నక్షయఫలమునకసమానమనుట"
బసవపురాణం-స.ఆ.,1763-1766 ద్విపదపాదాలు

పలుమార్లు ద్విజుల్ని కక్కులతో పోల్చాడు. బసవడు వారిని అర్చించినవారిని శిక్షించాడు. తుదకు తన రాజు బిజ్జలుడినే వధించాడు. మహిమలెన్నో ప్రదర్శించాడు. శివారాధన ప్రబలడానికి విశేషంగా కృషిచేశాడు. అందుకే జన్మించాడు కదా! దాంతో వీరశైవ వీరవైష్ణవద్వేషాలు మిన్నంటాయి. అందుకే తిక్కనామాత్యుడు హరిహరాద్వైత ప్రచారం ప్రబలం చేశాడు.

"సద్భక్తి విస్ఫురణఁ/బ్రస్తుతికెక్కిన బసవనిచరితఁ
జెప్పితి భక్తులచే విన్నమాడ్కిఁ/దప్పకుండఁగను యథాశక్తిఁజేసి"
బసవపురాణం-స.ఆ.,2033-2036ద్విపదపాదాలు

అని సోమనాథకవి చెప్పుకొన్నారు. మహామంత్రి బసవచరిత్ర దారంగా భక్తుల చరితలు మాల గ్రుచ్చానన్నాడు. కావున ఆ కథల్లో నాటి సమాజం కన్పిస్తుంది. తరచి చూడడమే మన పని. జంగమ, మిండజంగమారాధన విశేషంగా ఉంది. వారు ఏది అడిగితే అది శివభక్తులు సమర్పించేవారు. సిరియాళుడు తన కుమారుడు సీరాలుడినే వండి వడ్డించాడు. నిమ్మవ్వ శివుడికి నివేదింపనుంచిన పదార్థాల్లో ఇంచుక ఆకలితోనున్న తన కొడుకు తిన్నాడని అతడిని చంపింది. ఒక మిండజంగానికి బసవేశ్వరుడు తన భార్య చీరను పదిమందిలో ఒలిచి ఇచ్చాడు. శివుడామె మానాన్ని రక్షించాడు.

బెజ్జమహాదేవి కథలో తల్లిపెంపకం ఆనాటి బిడ్డల సంరక్షణను పట్టి

చూపుతున్నది. తల్లిలేకుండడం వల్లే శివుడు అనాథగా ఉన్నాడని పలువిధాలుగా భావించి తానే తల్లి అయి ఎలా సాకిందో ఏకాలపు తల్లులకైనా ఆదర్శం. పసిపాపకు నీళ్లు ఎలా పోయాలో ఆ కాలం మనకు చెబుతున్నది.

"తొంగిళ్లపై నిడి లింగమూర్తికిని/సంగనగావించునభ్యంజనంబు
ముక్కొత్తుఁజెక్కొత్తు ముక్కన్నుఁబులుము/నక్కొత్తుఁగడుపొత్తునట వీఁపునివురుఁ
పెరుగంగవలెనని తరుణి వీఁడ్వఁడఁగ/జరణముల్కరములుఁజాఁగంగఁదిగుచుఁ
నలుఁగులు నలుచు నర్మిలి గట్టిపెట్టి/జలములు వీఁపున జఱచునంతంత
వెగచి బెగడకుండ వెన్నుప్రేయుచును/నొగిమస్తకమున నీరొత్తు దోయిటను
వదనంబు సొచ్చునోయుదకంబులనుచు/నదుముఁబొట్టను నోరికడ్డంబు పట్టుఁ
జెన్నుగాఁబసుపార్చి చేయు మజ్జనము/కన్నులు చెవులును గాఁడంగనూదు
నంగిటిములొత్తు నందందవ్రేల/దొంగిళ్లఁగార్నీరు దోనెత్తి మిడుచుఁ
బడతిచే నీరఁదూపొడిచి బొట్టిడును/మడఁది యంగుష్ఠంబుమన్నింత మెదిచి
కడవనంటినయట్టిపిడుకవిభూతి/యదరఁబుత్రునినొసలారంగఁ బూయు
యెత్తంగవెఱచి/యత్నవ్తొమ్మున నక్కుననదుము
కాటుకయిడనింతగన్నగుననుచు/గాటుకయిడు మూఁడుగన్నులఁగలయ"

బసవపురాణం – తృ.ఆ.,661-684 ద్విపదపాదాలు

ఇది పసికూనలకు నీరుపోసి తీర్చడం. ఎంత సూక్ష్మంగా రమ్యంగా చెప్పారో సోమనాథుల వారు. ఎంతటి ముగ్ధభక్తో!

బిడ్డల్ని వదలి తల్లిదండ్రులు పొరుగూరికి పోయేటప్పుడు వాళ్లు వెంటబడకుండా, రాకుండా అవి తెస్తాం ఇవి తెస్తాం అని చెబుతారు. ఇక్కడ గొడగూచికి మరోపని కూడా అప్పగించారు.

అందుకే

.....యట ఇట కదలకు మమ్మ!/పడుచులతో నాడఁబఱవకుమమ్మ!
నొడివిన మావ్రతంబెడవకు మమ్మఁ/గుడికేగి నిత్యంబుఁగుంచెడుపాలు
బడరున కారగింపఁగఁబెట్టు మమ్మఁ/నమ్మిపోయెదము సుమ్మమ్మ మాతాకు
మమ్మ! మాయమ్మ! మాయక్క! మాతల్లి!/కొమ్మ! నీకొకమంచిబొమ్మయు నిన్ని
బొమ్మపొత్తికలను బోయి తెచ్చెదము"

బసవపురాణం-తృ.ఆ.,808-816ద్విపదపాదాలు

అని కడగొట్టు కుమార్తెను బ్రతిమలాడారు.

ఆమె తండ్రి చెప్పినట్లే శివయ్యకు కుంచెడు పాలు ఆరగింపపెట్టింది. ఆయన త్రాగలేదు. రోజూ త్రాగుతున్నాడని ఆ పాప నమ్మకం. భయపడింది. మంచిగోవులపాలట. ఆరగాచినవట. కుంచెడు కొలిచింది. కోరలో పోసి కొంగుతో కప్పి తీసుకువెళ్లింది. ఎవ్వరూ చూడరాదు. చూస్తే దిష్టి తగులుతుంది. స్వాములకు ఆహారపదార్థాలు నివేదించి ఎదురుగా నిలబడి చూడరాదు. ప్రక్కకు తప్పుకోవాలి. తలుపు ఓరగా వెయ్యాలి. ఇంత చేసినా శివుడు గుక్కెడు కూడా త్రాగలేదు. ఇక ఆమె ప్రశ్నలు రమ్యాతిరమ్యాలు.

"కాచుట సాలదో కమ్మ వల్వమినొ/ప్రాఁచియో విఱిగెనో పడుచనేననియొ
ప్రొద్దెక్కెనో యొండెఁబొగయు వల్చెడినొ?/బుద్ధిపుట్టదొ నెయ్యివోయకుండితినొ
కడువేడియో నీరుగలిసినవనియొ/యెడవాద్యములు లేక యేనె తెచ్చితినొ?
చాలవో యివి యాలపాలు గావనియొ/పాలపైఁజిత్తమేఁబఱపితిననియొ!
కోరబెడంగెనోకుంచెడు లేవొ?/యారగింపఁగఁబెట్టనేరకుండితినొ?
మీఁదువోయినవనో మీఁగడ లేదొ?/యేఁదెచ్చునెడనెవ్వరేఁజూచిరనియొ?"

బసవపురాణం-తృ.ఆ.,829-840 ద్విపదపాదాలు

ఎన్నెన్ని కారణాలు ఊహించిందో ఆ చిన్నది. ఇవన్నీ పాలు త్రాగకుండడానికి గట్టి కారణాలే. ఇట్లే ప్రతికథలో నాటి సామాజికాంశాలు చోటుచేసుకుని ఉన్నాయి.

ఇట్లే వీరగాథలన్నీ, తాతాచారి కథలన్నీ, స్త్రీలపాటలన్నీ, స్థానిక చరిత్రలన్నీ దేశీయపురాణాలే. వాటిలో ఎంతో సామాజిక స్పృహ మిన్నంటి ఉంటుంది. అదో పెద్దవ్యాసంగా వ్రాయాలి తప్ప ఇందులో కుదరని పని. వ్యాసుడు వ్రాసిన పురాణాలు తప్ప మిగిలిన గ్రంథాలన్నీ, కావ్యాలన్నీ ఒకవిధంగా దేశీయ పురాణాలనే చెప్పవచ్చు.



*"May the sun in his course visit no land more free, more happy, more lovely, than this, our own country!"*

- డానియెల్ వెబ్‌స్టర్

# శివకవుల సామాజిక దృక్పథం

డా. నాదెండ్ల శ్రీమన్నారాయణ
94407 94903

ప్రాచీన తెలుగు సాహిత్యంలో భాషలో, భావంలో, వస్తువులో, కవితారీతుల్లో, ఛందస్సులో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చిన కవీశ్వరులు శైవ కవులు. వీరు 12వ శతాబ్దంలో శైవభక్తి తత్వ రచనలు వినూత్నంగా చేసి సంచలనం సృష్టించారు. అంతకు ముందు నన్నయ 11వ శతాబ్దంలో ఆంధ్ర మహాభారతాన్ని సంస్కృత పద భూయిష్ఠంగా విష్ణుభక్తి తత్పరతను చాటుకోగా, ఆ వెనువెంటనే మరు శతాబ్దంలో శైవ కవులు శివభక్తి తత్వ కవిత్వాన్ని రాశారు. సహజంగా ఒకరు వేసిన దారిలోనే వెళ్ళడం మానవనైజం. కొత్తకోసం, తమ ముద్రకోసం ఎక్కువగా ప్రాకులాడరు. అయితే శైవ కవులు దీనికి మినహాయింపుగా ప్రకటించుకొని తమకెంతో సామాజిక స్పృహ ఉందని నిరూపించారు. తమ కవిత్వాన్ని సమకాలీనాంశాలకు ముడిపెట్టి శైవభక్తి తత్వాన్ని ప్రజల్లోకి పంపారు. అలా పంపిన మహా కవుల్లో అగ్రగణ్యులు పాల్కురికి సోమనాథుడు. ఆ తరువాత చెప్పదగినవారు నన్నెచోడుడు, శ్రీపతి పండితుడు, శివలెంక మంచన పండితుడు, మల్లికార్జున పండితుడు.

నన్నయ కవిత్వము మార్గ కవిత్వ రూపంలో కొనసాగింది. మార్గకవిత్వమంటే సంస్కృత పదాడంబరముతో ఛందోరీతులు పాటిస్తూ రాయడము. ఈ కవిత్వం పండితులకు మాత్రమే అర్థమవుతుంది. ఈ వాస్తవాన్ని గుర్తించిన శైవ కవులు తమ రచనలను దేశీ మార్గంలో నడిపించారు. దేశీ అంటే స్థానిక భాష, సామాన్య ప్రజల భాష అని పరిశోధకులు పేర్కొన్నారు. కుమార సంభవము పీఠికలో నన్నెచోడుడు ఇలా అంటాడు.

క. మార్గకు మార్గము దేశియ
మార్గము వగవంగదమకు మడి వదలక దు
ర్మార్గ పదవర్తులనదగు
మార్గవులందలప నలతి మహి సుకవులకున్

- అని తనకు దేశికత్వం మీద ఉన్న మక్కువను ప్రకటించాడు. తన అభిప్రాయాన్ని నిర్భయంగా చెప్పిన ఏకైక ప్రాచీన కవిత్వ మహాకవి నన్నెచోడుడు.

కుమార సంభవములో నన్నెచోడుడు రచనలో అభ్యుదయ దృక్పథాన్ని ప్రకటించాడు. తన కావ్య రీతిని ఇలా తెలిపాడు.

సీ. మృదురీతి సూక్తులిం పొదలింప మేలిల్లు
భావమ్ము నెలమి క్రీడావహముగ
మెఱుగుల గన్నులు మిఱుమిట్లు వోవంగ
ఎగాంతి సుధా సూతి కాంతి జెనయ
వర్ణనలెల్లచో వర్ణన కెక్కంగ
రసములు దళుకొత్తి రాలు మటి
దేశిమార్గంబుల దేశీయములు గాన
లంకారముల దానలంకరింప

తే. నాదరించి విని సదరాతి శయమున
బుధులు నెమ్మనమున నిధులు నిలుప
వలవదే సమస్త వస్తుకవీశ్వర
నూత్నరుచిర కావ్య రత్నవీధి - అంటాడు.

భావంలో, వర్ణనల్లో, మధురమైన సూక్తులు ప్రకటించడంలో కొత్తదనాన్ని చూపుతానన్నాడు. అన్నట్లుగానే కుమార సంభవాన్ని తీర్చిదిద్దాడు. అదే విధంగా శైవ భక్తి తత్త్వ రచనలకు కూడా నన్నెచోడుడే ఆద్యుడు.

దక్షుడు తన కుమార్తెల కాపురములను చూచి వచ్చుటకు బయలుదేరుతాడు. ఆ క్రమంలో తనను సత్కరించని శివున్ని అవమానించుటకు దక్షుడు యజ్ఞాన్ని ప్రారంభిస్తాడు. అపుడు దక్షపత్ని అతనితో ఇలా అంటుంది.

తల్లిదండ్రులఁ బూజించి తగ వెఱంగిమన్న పొడవైనవేయత్త యామలనియె
ప్రియ మెఱుండ నంబిచ్చిన బిడ్డ మననకుఁ బాసెనని యుండు, డింక నీ పలుకు లేక

- అని భర్తకు హితవు పలుకుతుంది. అయితే ఈ మాటలు మూలములో లేవు. నన్నెచోడుడే కల్పించాడు. సమస్యను పరిష్కరించుటకు, మానవ సంబంధాలను నెలకొల్పుటకు దక్షపత్ని ఆనాడే ప్రయత్నించినట్లు తెలిపినాడు. భర్త కోపాన్ని శాంతింప జేయుటకు అల్లుని విధానాన్ని సమర్థించుటకు చక్కగా స్పందించింది. తన భర్తను గౌరవించలేదని ఒక వైపు ఉన్నా ఘర్షణ తొలగించుటకు అలా వ్యవహరించి తన పెద్దరికాన్ని, నిలుపుకొన్నది. నన్నెచోడుడు వస్తు మార్పిడిని ఆనాడే గుర్తించాడు. సేవకులకు కూలికి మారుగా జొన్నలు కొలుచుట, పార్వతికి ఓం నమశ్శివాయ అని పంచాక్షరీ మంత్రముతో అక్షరాభ్యాసము చేయుట మొదలగు ఆచారాలను పేర్కొని వినూత్నతకు మార్గం వేశాడు. ఆనాడు ప్రజలు ఆచరిస్తున్న అంశాలను శివభక్తి చేష్టలకు అన్వయించి అద్భుతంగా చెప్పాడు.

నన్నెచోడుని తర్వాత శివతత్వ రచనలతో స్వైర విహారం చేసిన కవి పాల్కురికి సోమనాథుడు. ఈ మహాకవికి సంస్కృతాంధ్ర కన్నడ భాషా సాహిత్యాలపై విశేషమైన పట్టుంది. ఈ మూడు భాషల్లో సుమారు 30కి పైగా గ్రంథాలు రాశాడు. బసవేశ్వరుని పాల్కురికి సోమన సాక్షాత్తు శివునిగా భావించాడు. ఒక వ్యక్తిని దైవంతో సమానంగా భావించి భావ విప్లవం సృష్టించిన మహాకవి ఈయన. ఈ బసవుడు వృషాధిపుడు.

వృషభమంటే ఎద్దు. ఎద్దుకు మనిషికి ఎంత అవినాభావ సంబంధం ఉందో పాల్కురికి సోమన ఆనాడే పేర్కొన్నాడు. బసవని ఇలా శ్లాఘించాడు.

సురవరపూజ్య, పూజ్యగుణ శోభిత, శోభిత రూప, రూపవి
స్ఫురతరశీల, శీలగుణ పుంగవసత్వ, సత్వ సం
వర, వరవాద, వాద భయ వర్జిత, పాప విచార చారయీ
శ్వరసమ, నీవె దిక్కు బసవా బసవా బసవా వృషాధిపా

బసవేశ్వరుని దేవతలు పూజిస్తారని, ఈశ్వరునితో సమానుడని నిర్భయంగా పేర్కొన్నాడు. సహజంగా దేవున్ని ఇతరులతో పోల్చితే భక్తులు సహించలేరు. అయినా వాటన్నిటినీ లెక్క చేయకుండా ధైర్యసాహసాలు ప్రదర్శించినాడు.

పాల్కురికి సోమనాథుడు విశ్వరూపం మనం బసవపురాణంలో చూడవచ్చు. అనేక జానపద కథలకు సాహితీ రూపాన్ని, భక్తి తత్వాన్ని రంగరించాడు. వాటిలో కొన్నిటిని ఇలా పేర్కొనవచ్చు. నక్కలు గుర్రములైన కథ, ముగ్ధ సంగయ్య కథ, రుద్రపశుపతి కథ, సక్కనైనారు కథ, బెజ్జమహాదేవి కథ, గొడచూచి కథ, దీపద కళియారు కథ, నాట్యనమిత్తండి కథ, ఉడుమూరి కన్నప్ప కథ, కళియంబ నయనారు కథ, సకలేశ్వర మాదిరాజయ్య కథ, మడివాలు మాచయ్య కథ, బాపూరి బ్రహ్మయ్య కథ, బాపూరి బ్రహ్మకథ, నాయునికథ, పిట్టవ్వ కథ, చేది వల్లభుని కథ, గణపాలునికథ, కుమ్మర గుండయ్య కథ, పూసల నయనారుకథ, శివనాడమయ్యకథ, కల్లిదేవయ్య కథ, బిబ్బ బాచయ్య కథ, ఉద్భటుని కథ, కక్కయ్య కథ, భోగయ్య కథ, గుడ్డవ్వ కథ, జగదేవ దండనాయకుని కథ, వీరశంకరుని కథ, శివ లెంక మంచయ్య కథ, యుసిడి చేడయ్య కథ, తెలుగు జొమ్మయ్య కథ, పిళ్ళనైనారు కథ, సాంఖ్య తొండని కథ, గోవూరి బ్రహ్మయ్య కథ, సోమన్న కథ, వైజకవ్వ కథ, నిమ్మవ్వ కథ వంటివి ఉన్నాయి.

ఒక సామాన్య భక్తురాలు లయకారుడైన శివునికి (శిశువు) స్నానాదులు చేయించినట్లు చెప్పి భావ విప్లవాన్ని తెచ్చాడు పాల్కురికి సోమనాథుడు. బెజ్జమహాదేవి శివునికి సేవలు చేస్తూ ఇలా అంటుంది.

తల్లి గల్గిననేల తపసిగానిచ్చు?
తల్లి గల్గిననేల తలజడల్గట్టు?
తల్లి యున్న విషంబు ద్రావనేలిచ్చు?
తల్లి పాములనేల ధరియింప నిచ్చు?
తల్లి బూడిద యేల తాబూయనిచ్చు?
తల్లి పుచ్చునె భువి తనయుని దీరియ?
తల్లి పుచ్చునె సవతువల్ల కాటికిని
తల్లి లేకుండిన తనయుడు గాన
ప్రల్లదుడై ఇన్ని వాట్లకు వచ్చె
చినిచ్చి పలుమాఱు వెన్నయు బెట్టి
పన్నుగా నిన్నియు బాలును బోసి
యా కొనగాఁ గడు పరసి పాలిచ్చి

సాకించి పెను పదే జనని గల్గినను
దానింత వాడయ్యె తల్లిలేకయును
దానెంత వెరుగునో తల్లి గల్గినను?
బెండ్లిండ్ల నోముల బేరంటములను
పండువు దినముల పాటి జాతరల
దగిన పోడిమి సేయు తల్లి లేకున్న
వగవరేమటి యెట్టి మగ బిడ్డలైన
సూరకు పేక్షించి యుండంగ దగునె?
యారంగ దల్లినై హరుని నేనైన
సరిసెదగాన”

అంటూ తన మనోభిప్రాయాన్ని చక్కగా తెలిపింది. తల్లి ఉంటే బిడ్డలకు ఎలాంటి సమస్యలు రావో, బిడ్డలను ఎంత పద్ధతిగా పెంచుతుందో స్పష్టంగా తెలిపింది. నేడు ఎందరో తల్లులు ఎంత క్రూరంగా వ్యవహరిస్తున్నారు. తమ అక్రమ సంబంధాలకు అడ్డుగా ఉన్నారని కన్న బిడ్డలను వదిలించు కుంటున్నట్లు తరచుగా ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియా ద్వారా తెలుసుకుంటున్నాము.

ఏ దేశమందైనను, మానవునికి దృగ్గోచరమగు సకలచరాచర ప్రపంచమునకు గర్తయైన పరమేశ్వరుని శక్తి తత్త్వముల గూర్చిన జిజ్ఞాసయే మతమను పేరుతో వ్యవహరింపబడుచున్నది. భారతీయ వాఙ్మయములో మిక్కిలి ప్రాచీనములని చెప్పబడు వేదములలో రుద్ర, అగ్ని, భర్గ, శివ ఇత్యాది పదములు పరమేశ్వర పరముగ నుపయుక్తమయినను రానురాను సులభోచ్చారణ యుతమును మంగళ వాచకమనదగు ‘శివ’ యను శబ్దమునందు పరమేశ్వర తత్వము నిష్ఠితమయినట్లు కనిపించును. ఐతిహాసిక దృష్టితో చూచిన భరత ఖండమునందు వెలసిన మతములలో శైవమే ప్రాచీన తమముగా కాన్పించును. ఈ మతమునందు శివాగమములు కొన్నింటిలో స్థూల దృష్టితో సామాన్య శైవము, మిశ్ర శైవము, శుద్ధ శైవము, వీర శైవము అను చతుర్విభాములును, వచ్చి కొన్నిటిలో ఇంతకన్న వివరంగా సామాన్య శైవము, పూర్వ శైవము, మిశ్ర శైవము, శుద్ధ శైవము, శ్రౌత శైవము, మార్గశైవము, మిశ్ర శైవము, శుద్ధ శైవము, శ్రౌత శైవము, మార్గశైవము, వీరశైవము, సామాన్య వీర శైవము, విశేష వీర శైవము, నిరాభాహ వీర శైవము అనెడి దశవిధ విభాగాలున్నాయి. ఇందులో ఉన్న అంశాలన్నిటిని శైవ

కవులు సామాన్య ప్రజలను దృష్టిలో పెట్టుకొని రాశారు. వీరి రచనలు పండితుల మెప్పుకు కాక, పామరులను శైవం వైపు ఆకర్షించుటకు ఉద్దేశించి రాయబడ్డాయి. అందులోనూ పామరులను చైతన్యవంతులను చేయడమే లక్ష్యంగా రాశారు.

దీనికి నిదర్శనంగా వీరు ఎన్నుకొన్న వస్తువు, కథలు, దేశికవిత్వం పేర్కొనవచ్చు. ఈ వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో ఇంత విప్లవాత్మక రీతిలో సాహిత్యాన్ని సృజించిన కవులు లేరంటే అతిశయోక్తి లేదనవచ్చు. ఇదే దారిలో శైవ కవి పండిత త్రయము శ్రీపతి పండితుడు, శివలెంక మంచన పండితుడు, మల్లికార్జున పండితుడు నడచుకొన్నారని పేర్కొనవచ్చు. ఈ నేపథ్యంలో చూసినపుడు శైవతత్వ కవిత్వాన్ని రాసి ఒక శతాబ్దం పాటు ప్రజలను తమ వైపుకు తిప్పుకున్నారని చెప్పక తప్పదు. వారి కవిత్వ వినూత్న రీతులు నేటికీ తెలుగు సాహిత్యంపై, తెలుగు ప్రజలపై ప్రభావం చూపుతూనే ఉన్నాయి. నేటికీ శివరాత్రినాడు శైవ క్షేత్రాల్లో హరిదాసులు, వివిధ కళాకారులు శివభక్తుల కథలను చెబుతున్నారు. ఈ కథలను భక్తులు విశేషంగా ఆదరిస్తున్నారు.

## ఉపయుక్త గ్రంథాలు


1. ఆంధ్ర కవుల చరిత్రము - కందుకూరి వీరేశలింగం పంతులు
2. తెలుగు సాహిత్య సమీక్ష - ఆచార్య జి.నాగయ్య
3. సాహిత్య వ్యాస తారావళి - ఆచార్య గార్లపాటి దామోదర నాయుడు
4. కుమారసంభవము - నన్నెచోడుడు
5. బసవపురాణము - పాల్కురికి సోమనాథుడు
6. బసవేశ్వరుడు – ఎస్.ఎస్. మేల్కొటే




*"The whole world yearns after freedom, yet each creature is in love with his chains; this is the first paradox and inextricable knot of our nature"*

- శ్రీ అరబిందో

# మహాకావ్యం-సామాజిక, తాత్వికాధ్యయనం

డా. తుమ్మపూడి కోటేశ్వరరావు

నగరార్ణవ శైలార్క చంద్రారోదయ వర్ణనైః
ఉద్యాన సలిల క్రీడా మధుపానర తోత్సవైః
విప్రలంభై ర్వివా హైశ్చ కుమారోదయ వర్ణనైః
మంత్రదూత ప్రయాణాజినాయ కాభ్యుదయైరపి"

"మొదటిసారిగా దండి చెప్పిన 18 వర్ణనలు ఇవి. ఇందులో చివరి వాక్యం భామహుని మాట. అది అతని కావ్యలక్షణం. ఆ 5 వర్ణనలకు మిగిలిన 13 కలిపి దండి పై లక్షణ పరిష్కారం చేశాడు.

భామహుని లక్షణాలు 5, వీర రస విభావ వర్ణనలు. నాటి నేత రాజు కనుక, మంత్రాంగం దౌత్యం-ప్రయాణం (జైత్రయాత్ర) యుద్ధం, నాయక విజయం ఈ వర్ణనలు వీర రసాలంబనాలు, దండి వీటికి శృంగారరస విభావానుభావాలు కలిపి ప్రథమంగా అష్టాదశ వర్ణనలు చెప్పాడు. కనుక వాటిని రసానుగుణంగా విచారించి విశ్లేషించుకోవాలి.

ముందుగా 18 సంఖ్యార్థమేమిటో చూడాలి. సంఖ్యా వాచకాలు - సంజ్ఞలు, ప్రతీకలు తప్ప, లోకంలోభాషాశాస్త్రాల్లోని వాచ్యార్థకాలు కావు. కావ్యం లోక స్వరూపమైన వాచ్యార్థాన్ని, లోకసత్తాస్వభావమైన ప్రతీకారాన్ని గ్రహిస్తుంది. ఇదే కావ్యంలోని శబ్ద స్వరూపం.

వైదిక క్రతువులో నిర్వాహకులైన పురోహితులు 18 మంది. వారు దేనికి ప్రతీకలో ప్రస్తుతం అనవసరం. క్రతువు ప్రాచీన జనజీవన స్వభావం. వారికి లోకం ప్రతీక, యాంత్రిక నాగరకతలో వాస్తవం (రియలిస్టిక్). అది ritualistic ఇదే పురాణ-జానపద సాహిత్య జన్మకు హేతువు. కావ్యం వ్యంజకం - అంటే

ఈస్థటిక్. కనుక శబ్దం మూడు రకాలు- వాచక, ప్రతీక, వ్యంజకాలని. వీటికి సమన్వయం ఈస్థటిక్వ్యంజకం. దీనికి మూలం (2) ప్రతీక-క్రతువు. కనుక ప్రాచీన నాగరకతా సాంస్కృతీ రూపమైన క్రతు ప్రతీక తర్వాత వచ్చిన కావ్య వ్యంజక శబ్దానికి మూలం. అంటే తల్లివేరు. అంటే భూమిలోపల ఉంటుంది తప్ప, పైకి కన్పించదు. అందుకని 18 సంఖ్య భారతంలో పర్వాలు-గీతలో అధ్యాయాలు, పర్వమంటే హేతువాదులు చెరకు కణపు అని అర్థం చెప్పుకొని, అది ఉప్పుగా ఉంటుంది. కనుక భారతమంతా ఉప్పుసముద్రమని, పుక్కిలించకుండానే ఉమ్మేస్తారు. ఇదే దృష్టితో పురాణ కథలన్నీ కల్పనలుగా కొట్టివేసి సంతోషించారు. కాని ఆధునిక మనస్తత్వ-శాస్త్రజ్ఞులు ప్రాచీన ఆటవిక సమాజ పరిశోధనసారంగా, ప్రాచీన పురాణగాథలన్నీ స్వప్నమన్నారు. స్వాప్నిక చైతన్యం నుండి పుట్టిన గాథలు తప్ప, జాగృత చైతన్యంనుండి పుట్టిన వాస్తవికార్థ ప్రతిరూపాలు కావు. (చూ. 'ది హీరో విత్ థౌజండ్ ఫేసెస్) కనుక పర్వమంటే అర్థం అది కాదు. అదేమిటో 'ఇతిహాస లక్షణ'మన్న ఈ రచయిత వ్యాసం చూడాలి. లేదా 'The golden germ' అన్న మహాగ్రంథాన్ని చూచుకోవాలి. అదొక వాస్తు-శిల్ప ఆచార్య రచన. శ్రీ ఆనందకుమారస్వామిగారి కంకితం.

ఈ 18 వేదకాలంనాటి పురోహితులు యజమానుడు,యజమానురాలు వీరిసంఖ్య. యాజకుల సంఖ్య 16. (పురోహిత విషయానికి ఆటవిక జనజీవన విషయంగా మనస్తత్వ శాస్త్రవేత్తలు చెప్పిన 'మెడిసిన్ మెన్' విషయం చూచుకోవాలి) యజ్ఞం చేయించే దంపతుల సంఖ్య 2. కాబట్టి యజ్ఞతత్త్వం - సూత్రం అష్టాదశ వర్ణనల్లో ఇమిడి ఉంది. సర్వసృష్టీ యజ్ఞమే. కావ్యంలో కూడా 18 వర్ణనల వస్తువు సృష్టి విషయమే. దంపతులు-కావ్య నాయికా నాయకులు. యజ్ఞంలోని యజమానుడు-యజమానురాలు.

ఈ దృష్టితో కావ్య వర్ణనలను అధ్యయనం చేయటానికి వీలుంది.

బ్రహ్మచర్య – వానప్రస్థ – సన్న్యాస – గృహస్థ ధర్మాలనేకమున్నా, వాటి పరమార్థం ఏకమైన అద్వంద్వతాస్థితి దాంపత్యం. స్త్రీ పురుషులిరువురూ కలిసి, రెండు వ్యాపారాలు నిర్వహిస్తున్నారు. ఒకటి: బాహ్య సామాజిక దశ. ఇక్కడ చుట్టాలు-పక్కాలు-ప్రకృతి పరిసరాలు-జంతువులు అన్నిటినీ ప్రేమతో సమాదరించే మనస్తత్వం బాహ్యం. ఇక్కడనే, ధర్మ శాస్త్రాలు చెప్పిన పంచయజ్ఞ విధానం చూచుకొని సమన్వయించుకోదగ్గ అంశం.

బ్రహ్మ, పితృ, దైవ, నర, భూత యజ్ఞాలు.

నరయజ్ఞమంతా వ్యక్తి సమాజంతో కలిసి సహజీవనం చేసే విధానం.

భూత యజమంతా ప్రకృతి-పరిసరాలతో- సకల జంతు పశుపక్ష్యాదులతో సహజీవనం చేయటం (ఎకాలజీ) - ఈ భూత యజ్ఞమన్న ఆర్ష సామాజిక స్థితికి కళా రూపమే పైన పేర్కొన్న ప్రకృతి వర్ణనలు తటస్థ ఉద్దీపన విభావాలు-నరయజ్ఞ విషయమే- మానవ సత్సంబంధ వర్ణనలు.

"కీలారములనుండి పా లింటి కేతేర -
బహుధాన్యములు చేలఁబండి యొరుగ
ఎడనెడ బెండ్లిండ్ల వడుగులు పొడమ, కృ
తార్థులై యర్థించు నర్థులలర
పరిచారికాకోటి పనిపాటు పాటింప -
చుట్టంపు సందడి నెట్టుకొనగ
గ్రామ మెంతయు నిజప్రాభవంబున మన
సత్యనిష్ఠకు తన్ను సాక్షిగోర

నిత్యనైమిత్తికములు నిరిద్రబుద్ధి
నాచరించుచు హరిభుక్తమాత్మభార్య
భక్తినిడభుక్తి గొనుచున్కి ముక్తిగాని -
నిదురవంటిది అతి వంటిదియుగాదు" (పాండు మా : 5-216)

ఈ పద్యంలో గృహస్థునిలోని సామాజిక వ్యక్తినీ, ఆధ్యాత్మిక వ్యక్తినీ కలిపి ఏక వ్యక్తిగా దర్శించిన మహాలక్షణం ఆశ్చర్యకరంగా వర్ణితమైనది.

ఈ సామాజిక బాహ్య కర్మజాలాన్ని ప్రాచీనుడు వీరరసంగా, గార్హస్త్య వైవాహిక జీవన సౌందర్యాన్ని శృంగార రసంగా-దర్శించాడు. దానికిది ఆలంకారిక రూపం (ఈస్థటిక్ ఫామ్). సామాజిక వ్యవస్థకు కవి కల్పించిన కావ్యరూపం. ఇక్కడ 'ఫారం-ఫూపం' అన్న మాటలు విచారించదగినవి.

మార్పు సిద్ధాంతాన్ని (సామాజికార్థికం కనుక) కళాశాస్త్రంగా పరిణమింప చేసుకోవటానికి వారికొక అరిస్టాటిల్ పుట్టాలని ఒక విమర్శకుడన్నమాట సత్యమే నంటూ, "The English critic Kenneth Tynan, in his highly favourable riview of Fischer's 'The necessity of Art' pointed out. For Marxism had long been in need of its own Aristotle' and none other than Fischer might fulfil that mission of reforming Marxist theory"

భాహ్య జీవితాన్ని కవితామయం చేసే సూత్రం. నిర్మించుకోవటానికిది. ఉదాహరణ. బాహ్య కర్మజాలమంతా సంఘర్షణాత్మకం యుద్ధం. దానిలో నేర్పు మంత్రం, దౌత్యం మొదలైనవి. ఈ గృహస్థుని బాహ్యకర్మనే రాష్ట్రపరంగా చేసి వీర రసమన్నారు. మనస్తత్వ దృష్ట్యా సామాజిక గృహస్థ కర్మజాలమే వీరరససృష్టి కాధారం. గృహవిస్తృత రూపమే రాష్ట్రం. కనుకనే ప్రజలు సంతానం రాజుకు. అతడు తండ్రి.

'రాజుకు ప్రజ శరీరము - ప్రజకు రాజాత్మ' అన్నారు రాయలవారు. ఇక్కడ మనస్తత్త్వ శాస్త్రవేత్తలు. -

ఫాదర్-కింగ్ సింబల్'ని గురించి చాలా విస్తారంగా చర్చించారు!

యుద్ధరూప బాహ్య జీవితఫలం-నాయకాభ్యుదయం-శత్రుజయం. శృంగార ఆంతర జీవనఫలం-కుమారోదయం.

ఏ శృంగారం సంతానోన్ముఖం కాదో, అది రొమాంటిక్ తప్ప, క్లాసికల్ కాదు. ప్రణయం వేరు దాంపత్యం వేరు, ప్రణయంలో సమాజంలేదు. దాంపత్యంలో సమాజం, ప్రణయం-రెండూ ఉన్నాయి. కాలవస్తు దృష్ట్యా, సమాజం పగలు, ప్రణయం రాత్రి. ఈ కాల విభజనను నిరసించటం కుదరని విషయం. 18 వర్ణన చంద్ర-సూర్య ఉదయ వర్ణనలు-కాల సంబంధం (Time principle) దేశ (Space) సంబంధం - రాష్ట్రం - నగరవర్ణనం (ఆదర్శరాజ్య ప్రతీక).

నాయకుడు వ్యక్తి, వ్యక్తి దేశకాల ప్రవాహంలో ఈదులాడుతున్నాడు. వాడిచుట్టూ ఆవరించిన మహాబలవత్తరమైన సత్యాలు దేశకాలాలు కనుక, ఆ వర్ణనలు ఆవశ్యకములే.

ప్రాచీన మానవుడు సమిష్టి వ్యక్తి.
నేటి మానవుడు వ్యష్టి రూపుడు (Ego-centric)

సమిష్టి =దేశకాల-సమాజ సమన్వయం. ఇందుకే కావ్యంలో ఈ వర్ణనలన్నీ కలిసి మానవ జీవితంలోని ఒక సమన్వయ సంగీతాన్ని (డివైన్ హార్మనీ- ఆర్కెస్ట్రాని) సాయంకాలం నానాపక్షుల కంఠ స్వరాలు ఏకనాదాన్ని

సృజించినట్టు-ఆలాపించే సాలంకార వాక్యాలే. నీ చుట్టూ ఉన్న ప్రతివస్తువూ దివ్యమధుర సంగీతాన్ని ఆలాపిస్తున్నదే. ప్రతిశిలా-శిల్పమే. చెట్టు-పుట్టా-జంతువూ-రాయీ-రప్పా-సర్వమూ ఒకానొక మాధుర్య సంకేతమే. ఈ మహాదర్శనాన్ని ప్రతిపాదిస్తుంది కావ్యంలో 'ప్రతివర్ణనా. ఇందుకే ప్రతిదీ

కావ్యవస్తువే-రమ్య, జుగుప్స, ఉచ్ఛ, నీచాది భేదాలులేవు. కేవలం దార్శనిక తత్త్వమే. వస్త్వంతర్గత తత్త్వమే దర్శనీయం తప్ప, వస్తువుకాదు. వస్తు దర్శన వర్ణన కవిత్వం తప్ప, వస్తువర్ణన కాదు. ఈ వస్తుత్వ దర్శనమే కావ్య శబ్దాకృతి ధరిస్తున్నది. ఇదే నేటి విమర్శలో ఇమేజ్ (ప్రతిమ)

## కుమారోదయం:

ఆశ్రమ విభాగమంతా మనువు ప్రకారం-ఆత్మ-వ్యక్తి-పరిణతిలోని 4 అంచెలు (4 పరిణామాత్మక సంకేత సంఖ్య). వానప్రస్థ-సన్న్యాసాలు చరమార్ధం కాగా, ప్రథమార్ధం బ్రహ్మచర్య - గార్హస్త్యాలు, గృహస్తు అంటే భార్య, భర్త, సంతానం ఈ త్రిబిందురూప త్రికోణం. ఆ బిందుత్రయం చుట్టూ వృత్తాకార భ్రమణం చేసేది పరిసర ప్రకృతి-జీవులు - (సమాజం) జీవరాసులూ. వానప్రస్థం సాంఘిక జీవిత విశ్రాంతిరూపం. కనుక భార్యతో కలిసి వానప్రస్థం చేస్తున్నాడు. అడవికే పోనక్కర్లేదు. (అడవి-గుహసముద్రం ఇవి అనంతత్వ (ప్రిన్సిపుల్ ఆఫ్ ఎటర్నెటి) సంకేతాలు. ఇందుకే 'కేన'లో పరబ్రహ్మం 'తత్ వనం నామ'అని వ్యాఖ్యాతమైనది. వనం (నీరు, అడవి) ఆనందార్థకమని వ్యాఖ్యాతలు.) ఇంటిలో ఉండి సంతానానికి జీవనమార్గ నిర్దేశం చేయవచ్చునంటాడు మనువు. వానప్రస్థం నేటి ఉద్యోగ విరమణ వయస్సే. ప్రథమార్ధమంతా బాహ్యలోక ప్రవృత్తితో, చరమార్థాన్ని అంతర్లోక ప్రవృత్తితో జీవించాలన్నది మనుసంఘ ధర్మం. మానవ ధర్మం. అప్పుడే బాహ్యాభ్యంతర సమిష్టి జీవన లబ్ధి కలిగి, సంపూర్ణ మానవోదయం కలుగుతుంది. ఈ పూర్ణ (కంప్లీట్, టోటల్) మానవోదయావిర్భావ కారకం -కళ. సాహిత్యమంటేఇతిహాసమంటే ఇదే.

వానప్రస్థ స్వీకరణ సమయం, మనమడు పుట్టాక అని మనువు నిష్కర్ష. అంటే గృహ (సామాజికవైయక్తిక) బాధ్యతలను మోయగలిగే వయస్సు కుమారునకు సంక్రమించడానికి సంకేతం-మనుమడు. కావ్యం ఈ బిందువుతో ముగించటం సామాజిక, ఆధ్యాత్మిక బోధారూపుడైన కవి బాధ్యత. ప్రవృత్తి-నివృత్తి రూప సమస్త మానవ జీవితాన్ని ఇతిహాసం గ్రహిస్తుంది. కావ్య-నాటకాలు శృంగారమయ గార్హస్త్య దాంపత్య శ్లోకాలైనా, ముగింపు అంతే. ఇందుకే విక్రమోర్వశీయం లాంటి కేవల మధుర ప్రణయ సంగీత నృత్యరూప నాటకం కూడా మృచ్ఛకటికంలాంటి రొమాంటిక్ డ్రామాకూడా-సంతానోదయంతో వేశ్య భార్యగా పరిణమించటంతో ముగించటంలో, కవి సామాజిక బాధ్యత కన్పిస్తుంది. నాటి మానవుడు సామాజికార్థిక మానవుడే కాదుబీ భౌతికాభౌతిక సమష్టిమూర్తి.

వీడే కావ్యనాయకుడు. శ్రోతకు ఆ పరిణతి రావాలని ఉద్దేశించిందే కళ. ఇందుకే ఆలంకారికులు పురుషార్థబోధనే ప్రయోజనంగా చెప్పారు. (రసంతోపాటు) అసలు బోధ, అనుభూతి వేరుకావు. రసం-పురుషార్థమని అభినవ భారతి రసవిచారణదగ్గర స్పష్టం చేస్తున్నది. ఆధునిక మహాకవి ఇలియట్ కూడా 'అండర్ స్టాండింగ్', 'ఎక్స్ పీరియన్స్' - ఒకటేనన్నాడు.

కనుక ఈ అష్టాదశ వర్ణనలు యాదృచ్ఛికంగా ఏదో చెప్పటం కాక, ఒక జీవన పరమార్థాన్ని సంగ్రహించి రసోన్ముఖంగా కథను మలచుకునే సాధన సామగ్రిగా చెప్పబడింది. అంటే పూర్ణ మానవ జీవితానికది సంకేతం.

మనిషి = ప్రకృతి + ఇతర జీవులు ( స్త్రీ / పురుష.) ఈ సూత్రం ఆ వర్ణనల్లోని తత్త్వం. మానవ సమష్టి జీవితానికీ వర్ణనలు సాలంకారరూపాలు.

దేవాలయంలో నాట్యాదులు చేసి భగవంతునకు కానీ, వేశ్య అంటే భోగవనిత - అని అర్థం. భోగమర్పించేవారు. వేయిపడగల్లో హారిక లాగా అనవచ్చు.

### పాదసూచికలు -

1. 'కావ్యం విభావానుభావ రూపం సంధులు-సంధ్యంగాలు రసాభివ్యక్తికి ఆధారాలని శ్రీమదభినవులు అభినవభారతిలోను, 'రసాభివ్యక్తి ఆపేక్షయా- నతు కేవలయా శాస్త్ర సంపాదనేచ్ఛయా' అని ధ్వన్యాలోకంలో సహృదయ చక్రవర్తి కూడా అన్నమాట.

2. అతి ప్రాచీన నాగరకత క్రతురూపం. జగత్తులోని ఒక 'మాజికల్ ఎలిమెంట్ ని దృష్టిలో పెట్టుకొని జీవితాన్ని చక్కదిద్దుకొనే ప్రయత్నం నుండి పుటి ఉంది క్రతువు. దీని వివరాలు - తత్త్వ స్వరూప మనస్తత్వాది శాస్త్రాల వంటి గ్రంథాల్లో చూచుకోవాలి. చూ, ది హీరో విత్ థౌజెండ్ ఫేసెస్' (The Hero with thousand faces).

3. మాళవికాగ్ని మిత్రంలో మహాకవి, నాట్యవిద్యను చాక్షుష క్రతువనటంలోని రహస్యం, నాట్య విద్యకు మూలం క్రతునృత్యమేనని చెప్పటమే. ప్రాచీన సమాజంలో నాట్యం, నృత్యం-క్రతువు ఆత్మ తాదాత్మ్య సాధనంగా చెప్పారు.

4. Marxist & Leninist Aesthetics: P.-56

5. రాయి భూగర్భశాస్త్రవేత్తకు సృష్టిపరిణామ సూచకం. ఒకశిల్పికి ఆరాధ్య దేవతబీ ఒక ఆటవికునకు జగజ్జనని - ఇదే ప్రతీక అంటే.

# మనుచరిత్ర కిరణదర్పణం

**డా. డి. నల్లన్న**
✆ 94942 48348

మన చరిత్రను తెలిపే ఇతిహాసం మనుచరిత్ర. తెలుగు సాహిత్య చరిత్రలో చరిత్రతో అంతమయ్యే అనేక కావ్యప్రబంధాల్లో మనుచరిత్రది ప్రత్యేక స్థానం. మానవ చరిత్రతో ముడిపడి ఉండడమే దీనికి కారణం కావచ్చు. దీనికి స్వారోచిషమనుసంభవమనే పేరు పెట్టినప్పటికీ ఇది ‘మనుచరిత్ర’గానే ప్రసిద్ధి వహించింది. మారన రాసిన మార్కండేయ పురాణంలో స్వల్పంగా చోటుచేసుకున్న అంశాన్ని తీసుకొని స్వకపోల కల్పనతో చక్కగా చిక్కగా చెక్కి ముక్కుమీద వేలేసుకునేటట్టు అల్లసాని పెద్దనగారు ఈ ప్రబంధాన్ని అల్లారు.

ప్రబంధ కవులలో పెద్దనగారిది విశిష్టస్థానం. వీరు సంస్కృతాంధ్ర భాషలలో అలవోకగా కవిత్వం చెప్పి శ్రీకృష్ణదేవరాయలు మెప్పు పొందిన కవి. జిగిబిగి ఈయన కవిత్వ ప్రత్యేకత. అందుకే కాబోలు అల్లసాని వారి ‘అల్లిక జిగిబిగి’ అని ప్రశస్తి కలిగింది. కవి చౌడప్ప కూడా పెద్దన కవిత్వాన్ని ప్రశంసించడం గమనార్హం.

పెద్దన వలె కృతి చెప్పిన
పెద్దన వలె అల్ప కవిని పెద్దనవలెనా?
ఎద్దనవలె, మొద్దనవలె
గ్రద్దనవలె కుందవరపు కవి చౌడప్పా”

పెద్దనగారి ప్రాంతం గురించి సాహితీ జగత్తులో భిన్న అభిప్రాయాలున్నప్పటికీ రాయలసీమ కవి అని విమర్శకుల అభిమతం. మనుచరిత్రకారుడి గురించి తెలుసుకోవడానికి అన్నూరు, కోకట శాసనాలు ఉపకరిస్తాయి. అలాగే మనుచరిత్రలోని ఆశ్వాసాంత గద్యలోని “శ్రీమదాంధ్ర కవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష పాదాంబుజాదీన మానసేందిందర నందవరపుర వంశోత్తంస శరకోప తాపస ప్రసాద సమాసాదిత చతుర్విధ కవితామతల్లి కాల్లసాని

చొక్కయామాత్య పుత్ర పెద్దనార్య ప్రణీతంబయిన స్వారోచిషమను సంభవంబను మహాప్రబంధంబునందు” అన్న ప్రస్తావన కారణంగా పెద్దనగారి వ్యక్తిగత విషయాలు వెల్లడవుతున్నాయి.

పెద్దనగారు పసివయసులోనే అహోబిలం వెళ్ళి శఠకోపయతి దగ్గర శిష్యరికం చేశారు. పురాణాలు, ఆగమాలు, ఇతిహాసాలు అభ్యసించారు. శఠకోపయతి బోధనల వల్ల పెద్దనగారు భాషలో ‘అపరశేషభోగి’గా అందరి మన్ననలను పొందారు. హరికథాసారము, స్వారోచిషమను సంభవము, రామస్తవరాజము, అద్వైత సిద్ధాంతము, చాటు పద్యాలు వీరి రచనలు. అయితే ‘స్వారోచిషమనుసంభవము’ తప్ప తక్కినవి అలభ్యాలు.

కొలుతున్ మద్గురు విద్యా
నిలయున్ గరుణా కటాక్ష నిబిడ జ్యోత్స్నా
దళితాశ్రిత జనదురిత
చ్ఛల గాఢ ధ్వాంత సమితి శఠకోపయతిన్’

అని స్వారోచిషమనుసంభవములో జ్ఞానదానం చేసిన గురువును కొనియాడారు.

మనుచరిత్ర మీద విస్తృతంగా వ్యాఖ్యానాలు, విమర్శలు వెలువడ్డాయి. ఇవన్నీ కూడా మనుచరిత్ర గొప్పతనాన్ని ద్విగుణీకృతం చేశాయనడం అతిశయోక్తి కాదు. ఈ ప్రబంధానికి కీ.శే. వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు, కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, బాలాంత్రపు వేంకట రమణగారు, చెఱుకుపల్లి జమదగ్ని శర్మగారు, కీ.శే. ఆచార్య జి. నాగయ్యగారు, మల్లాది హనుమంతరావుగారు, పురాణపండ సూర్యప్రకాశదీక్షితులుగారు, ఆచార్య జి. దామోదర నాయుడు గారు వ్యాఖ్యానాలు, విమర్శలు రాశారు.

ఆచార్య గార్లపాటి దామోదరనాయుడుగారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. పూర్తిచేశారు. బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో పిహెచ్.డి. పట్టా పొందారు. వీరికి సంప్రదాయ సాహిత్యం మీద మంచి పట్టుంది. నాటకాలు రాశారు. విమర్శ పట్ల ఎక్కువ మొగ్గు చూపారు. తాళ్ళపాక చిన తిరుమలాచార్యుని అధ్యాత్మ సంకీర్తనలకు వ్యాఖ్యానం రాసి ప్రచురించారు. పర్యవసానంగా తిరుపతి తిరుమల దేవస్థానం వారు వీరికి పెద తిరుమలయ్య అధ్యాత్మ సంకీర్తనల మీద వ్యాఖ్యానం రాసే పవిత్ర కార్యం అప్పజెప్పారు. వీరి విమర్శనాత్మక రచనల్లో సంప్రదాయ సాహిత్య

ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. వీరి సంప్రదాయ సాహిత్యాభిమానం గుర్తించి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, తెలుగు అకాడెమీ వారు 'మనుచరిత్ర' మీద ఒక మోనోగ్రాఫ్ రాయమని కోరారు. వారి సూచన మేరకు 'మనుచరిత్ర-మనచరిత్ర'ను రచించారు. ఈ గ్రంథాన్ని తిరుపతిలో జరిగిన నాల్గవ ప్రపంచ మహాసభల సందర్భంగా వెలువరించారు.

సప్త సంతానాలలో కావ్యం ఒకటి. ఈ అంశాన్నే గువ్వల చెన్నశతకం కూడా బలపరుస్తుంది.

"గుడి కూలును నుయి పూడును
వడి నీళ్ళన్ చెరువు తెగును, వనమును ఖిలమౌన్
చెడనిది పద్యంబొకటియె
కుడి యెడమల కీర్తిగన్న గువ్వల చెన్నా"

శ్రీకృష్ణదేవరాయలు తన ఆస్థానంలో పెద్దనకు అత్యంత ప్రాధాన్యమిచ్చారు. పెద్దనను పెద్ద చేసి కావ్య రచన అనే పవిత్రకార్యాన్ని అప్పగించారు. వారే కావ్యంలోని ఇతివృత్తానికి సంబంధించిన విషయం కూడా సూచించినట్లు క్రింది పద్యం వల్ల తెలుస్తుంది.

"మనవులలో స్వారోచిష
మనుసంభవ మరయ రససమంచిత కథలన్
విన నింపు కలిధ్వంసక
మనఘు, భవచ్చతుర రచన కనుకూలంబున్"

రాయల వారి కోరిక మేరకు అల్లసాని వారీ రచనకు ఉపక్రమించి కృతకృత్యులయ్యారు. రాయలవారికే దీన్ని అంకితమిచ్చి ఆంధ్ర కవితాపితామహు లయ్యారు.

ఆచార్య గార్లపాటి దామోదర నాయుడు గారు మనుచరిత్ర కర్తకు సంబంధించిన అనేక చాటువులను తమ కృత్తిలో పొందుపరచారు. ఈ చాటువుల్లో పెద్దనకు పూర్వం సాహితీలోకంలో ప్రసిద్ధులయిన కవులు, శతకకర్తలు, శ్రీకృష్ణదేవరాయలను ప్రస్తుతించిన తీరును తెలియజేశారు. కావ్యరచనకు సంబంధించిన ఒక చాటువును ఏ కవి రాశారో తెలియదు కానీ సాహితీలోకంలో మాత్రం ఈ చాటు పద్యాన్ని పెద్దనగారు రాసినట్టు పండితలోకం అభిప్రాయం. ఆ పద్యమిది.

నిరుపహతి స్థలంబు రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పు రవిడె మాత్మ కింపయిన భోజనముయ్యెల మంచమొప్పు త
ప్పరయు రసజ్ఞులూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరికినగాక యూరక కృతుల్ రచియింపుమనంగ శక్యమే.

ఈ చాటువుతో బాటు రాయలు మరణాన్ని జీర్ణించుకోలేని పెద్దన తన ప్రభువును స్మరిస్తూ

సీ. ఎదరైనచోఁ దనమదకరీంద్రము నిల్చి
కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె
కోకటగ్రామాద్యనేకాగ్రహారంబు
లడిగినసీమల యందు నిచ్చె
మనుచరిత్రం బందుకొనువేళఁ బుర మేఁగఁ
బల్లకి తనకేలఁ బట్టి యెత్తె
బిరుదైన కవిగండపెండేరమున కీవె
తగు దని తానె పాదమునఁ దొడిగె
ఆంధ్రకవితా పితామహ! అల్లసాని
పెద్దన కవీంద్ర! యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగ లేక
బ్రతికి యున్నాఁడ జీవచ్ఛవంబు నగుచు.

ఇది చక్కని స్మృతి కవిత్వంగా విలసిల్లింది.

ఆచార్య గార్లపాటి దామోదరనాయుడు గారు 'ప్రబంధం' శీర్షికలో సంస్కృత లాక్షణికులు, తెలుగు కవులు తమ కావ్యాలను ప్రబంధాలుగా చెప్పుకున్న తీరును తెలిపారు. తిక్కన తను రాసిన శ్రీ మదాంధ్ర మహాభారతాన్ని ప్రస్తావిస్తూ.

అని రచనా కౌతుకమున
మనమలరగ నీ ప్రబంధమండలి కథా నా
థుని గానే పురుషుని బే
ర్కొను వాడనోయను తలంపు గూడిన మదితోన్" అని

ప్రబంధమండలిగా అభివర్ణించారు. ఆచార్య కాకర్ల వేంకట రామనరసింహం గారు కవితా శిల్పంనందు దృష్టి నిలిపి వ్రాసిన వ్రాతను ప్రబంధ దోరణిగా నిర్ధారించారు. స్వారోచిషమనుసంభవము కాకర్లవారు అభివ్యక్తం చేసిన రీతిలోనే సాగింది. అందువల్ల మనుచరిత్ర సంపూర్ణ ప్రబంధ లక్షణాలు పుణికి పుచ్చుకున్న

రసవత్తరమైన ప్రబంధమని ఆచార్య గార్లపాటి వారు ప్రతిపాదించారు.

పూర్వకవులు లాగా పెద్దనగారు ప్రబంధాన్ని ప్రార్థనతో ప్రారంభించారు. మొదట మూడు పద్యాలలో త్రిమూర్తులను ఆ తరువాత బాలగణపతిని, చదువుల తల్లిని స్తుతించారు. అలాగే ముందుతరం కవులను, తనను ఆదరించిన శ్రీకృష్ణదేవరాయలను ప్రస్తుతించారు. ఈ విషయాన్నే గార్లపాటి వారు పెద్దన క్రమంలోనే పాఠకుల ముందుంచారు.

మారన మార్కండేయ పురాణం కథను రేఖామాత్రంగా స్వీకరించి పెద్దనగారు ప్రబంధీకరించారు. గార్లపాటి వారు ఆ ఇతివృత్తానే చక్కని చిక్కని వచనంలో పాఠకుల మనసు పరవసించేలా రూపొందించారు.

ప్రబంధంలో ఇతివృత్త గమనానికి కారణమైన ప్రవరుడు, సోమిదమ్మ, సిద్ధుడు, వరూధిని, మాయాప్రవరుడు, స్వరోచి, ఇందీవరాక్షుడు, మనోరమ, కళావతి, విభావసి, హంసి-చక్రవాకి, హరిణం, వనదేవత, స్వారోచిషుడు మొదలైన పాత్రల స్వరూప స్వభావాలను గార్లపాటి వారు సోదాహరణంగా తెలిపిన తీరు కడురమ్యంగా మనసును ఆకట్టుకుంటుంది. ఇంతకుముందు ప్రస్తావించిన పాత్రలలో మాయాప్రవరుడు అప్రధాన పాత్రగా కనిపిస్తుంది. కానీ ఈ పాత్ర కారణంగానే కథాగమనం కొనసాగుతుంది. అందువల్ల ప్రధానపాత్ర స్థానాన్ని పొందడానికి అవసరమైన రీతిలో పెద్దన దీన్ని చక్కగా తీర్చిదిద్దారు. గార్లపాటి వారు కూడా దీన్ని లెస్సగా ఎత్తిచూపారు. ఇందీవరాక్షుని పూర్వపరాలు మార్కండేయ పురాణం స్పష్టంగా గోచరించవు. ఈ పాత్ర కేవలం గంధర్వరాజుగా మాత్రమే చిత్రించబడడం గమనార్హం. స్వరోచికి ఇందీవరాక్షునికి మూలంలో లేని సంబంధాన్ని పెద్దనగారు కల్పించారు. ఇందీవరాక్షుడు తను స్వరోచి తల్లికి సోదరుడని చెప్పుకోవడం కారణంగా స్వరోచి, ఇందీవరాక్షునిల మధ్య బంధుత్వం కలిపినట్లయింది.

ప్రబంధ నిర్మాణంలో వర్ణనలది ప్రథమస్థానమే. మనుచరిత్ర-మనచరిత్ర గ్రంథంలో వర్ణనల విషయం ప్రస్తావిస్తూ మనుచరిత్రలో ముప్పై ఎనిమిది వర్ణనలు చోటుచేసుకొన్నట్లు ఈ గ్రంథానికి పీఠిక రాసిన వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారి అభిమతాన్ని ఆచార్య గార్లపాటి వారు బలపరచారు. వర్ణనలలో వేలు, హిమాలయ వర్ణనలకు ప్రాధాన్యమిచ్చినట్లు తెలిపారు. వేట వర్ణనకు ప్రాధాన్యత నివ్వడం వల్ల నాటి సామాజిక వ్యవస్థలో వేటకున్న స్థితిని వ్యక్తము చేసినట్లవుతుందని గార్లపాటి వారు గుర్తించారు. వర్ణనలకు సంబంధించి సంఖ్యాపరంగా సంస్కృత లాక్షణికుల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి.

నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః
ఉద్యాన సలిల క్రీడా మధుపానరతోత్సవైః
విప్రలమ్భైర్వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః
మన్త్ర ద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి
ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహా కావ్యముచ్చేతే

ఏషా మష్టదశానా....... అని కవులు సాధారణంగా పాటించే వర్ణనలు ప్రస్తావించారు. అయితే వర్ణనల విషయంలో కవి అష్టాదశ వర్ణనలతో పాటు మరికొన్ని పొందుపరచడంలో కవుల అభిమతానికే వదలివేసినట్టు సూచితమవుతుంది.

పెద్దనగారు మనుచరిత్రలో రెండు ఆశ్వాసాలు హిమాలయ వర్ణనకు కేటాయించారు. ఆరు ఆశ్వాసాల ప్రబంధంలో రెండు ఆశ్వాసాలు హిమాలయ వర్ణనకు కేటాయించడం కారణంగా పండితుల మధ్య భిన్నమైన అభిప్రాయాలు వెలువడడానికి ఆస్కారమేర్పడింది. అయితే గార్లపాటివారు పెద్దనగారి వర్ణనలను సమర్థించారు. ఈ ప్రబంధంలో చోటుచేసుకున్న వర్ణనలు పాఠకులలో మానసోల్లాసాన్ని కలిగిస్తుందన్నారు. తద్వారా కావ్యరసానుభూతి పొందడానికి ప్రేరకమవుతుందన్నారు.

> మనుచరిత్ర ధర్మవీరంతో ప్రారంభమయింది. కథాగమనంలో వివిధ పాత్రలకు ఏ ఏ రసాలు ఆలంబనమయ్యాయో గార్లపాటి వారు వివరించారు.

మనుచరిత్ర ధర్మవీరంతో ప్రారంభమయింది. కథాగమనంలో వివిధ పాత్రలకు ఏ ఏ రసాలు ఆలంబనమయ్యాయో గార్లపాటి వారు వివరించారు. ప్రబంధం ధర్మవీరంతో ఆరంభమైన శాంత రసాశ్రయమైన స్వారోచిషుని వృత్తాంతంతో సమాప్తం కావడం సముచితమైనదిగా భావించారు. మనుచరిత్రలో భిన్నరసాలు సందర్భోచితంగా పోషింప బడినప్పటికి స్వారోచిషమనుసంభవము శాంతరస ప్రధానమైనదనడంలో పండితుల మధ్య భిన్నాభిప్రాయాలు లేవు. ఈ విషయాన్నే గార్లపాటి వారు పేర్కొనడం గమనార్హం.

సాహితీ సృష్టిలో కవుల శైలి భిన్నంగా ఉండడం సహజమే. ఒకరిది కథాకథనశైలి అయితే మరొకరిది నాటకీయ పద్ధతి, కానీ ప్రబంధ కవులలో పేరెన్నికగన్న అల్లసాని పెద్దనగారి కవితాశైలి 'అల్లిక జిగిబిగి'. ఈ అల్లిక జిగిబిగి అనే పదాలను కాకమాని మూర్తికవి తను రాసిన 'పాంచాలి పరిణయము' అనే ప్రబంధంలో ప్రస్తావించినట్లు తెలుస్తుంది. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలోని అష్టదిగ్గజ కవులలో కొందరి కవుల శైలిని ముచ్చటించే ప్రయత్నంలో

అల్లసానివాని యల్లిక జిగిబిగి
ముక్కు తిమ్మనార్య ముద్దుపలుకు
పాండురంగ విభుని పదగుంఫనంబును

కాకమాని రాయనీక తగుర అని అల్లసాని పెద్దనగారి కవితాశైలిని కాకమాని మూర్తి కవి ప్రస్తావించారు. ఇది ఆ తరువాతి కాలంలో అల్లసాని వారి కవితాశైలిగా వాసికెక్కింది.

మనుచరిత్రలో సిద్ధుని వృత్తాంతం, మనోరమ, ఇందీవరాక్షుడు, విభావసీ, కళావతీ వృత్తాంతాలు భిన్న ఉపాఖ్యానాలుగా పైకి ఈ కథలు విడివిడిగా కనిపించినా వాటి అంతస్సూత్రం మాత్రం కథానుసంధానమే. ఈ ఉపాఖ్యానాల అనుసంధానం కారణంగానే స్వారోచిషమనువు ఆవిర్భవించాడు. ఇలా భిన్నమైన కథల మధ్య సమన్వయాన్ని చేకూర్చి కథల మధ్య చక్కని బిగిని కలిగించాడు ఆంధ్ర కవితా పితామహుడు. ఇది గమనించిన కాకమానికవి అల్లసానివారి అల్లిక 'జిగిబిగి' అన్నారని గార్లపాటి వారు విశ్లేషించడం విశేషంగా ఉంది.

'మనుచరిత్ర'మన భారతీయ సంస్కృతికి, జీవన విధానానికి ప్రతిబింబం. అందువల్లే ఈ గ్రంథానికి ఆచార్య గార్లపాటి దామోదరనాయుడుగారు 'మనుచరిత్ర-మనచరిత్ర' అనే శీర్షికను నిర్ణయించారు. ఇటువంటి గ్రంథాలను అధ్యయనం చేయడం వల్ల మన పూర్వీకుల జీవనశైలిని మనం మరొకసారి మననం చేసుకొన్న వాళ్ళమవుతాం. ఇటువంటి గ్రంథాలు ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని, మానవతా విలువలను పెంపొందిస్తాయి. మనుచరిత్రను సమగ్రంగా చదువలేనివారికి ఆచార్య గార్లపాటి వారి 'మనుచరిత్ర-మనచరిత్ర' కరదీపిక కాగలదు. కొండను చూపించే అద్దంగా కూడా అలరారగలదు. మనుచరిత్రను లోతుగా అధ్యయనం చేసి 'మనుచరిత్ర-మనచరిత్ర' రచించిన ఆచార్య గార్లపాటి దామోదరనాయుడు గారు అభినందనీయులు.

# ఆముక్తమాల్యదలో సమాజ జీవనం



డా. గంగిశెట్టి లక్ష్మీనారాయణ
✆ 94942 48348

మనిషిని మనీషిగా తీర్చిదిద్దగల మహోన్నతమైన సాధనం సాహిత్యం. వ్యక్తిని శక్తిగా మార్చి, ఉన్నస్థాయినుండి ఉన్నతస్థాయికి తీసుకువెళ్ళగల సామర్థ్యం సాహిత్యం యొక్క నిసర్గ లక్షణం. సమాజంలో సామరస్యతను పెంపొందించేందుకు సాహిత్యాన్ని మించిన సాత్విక సాధనం మరొకటి లేదన్న మాట ప్రత్యక్ష సత్యం.

పంచమహాకావ్య సంప్రదాయం సంస్కృత సాహిత్యం నుంచి తెలుగులోకి వచ్చింది. సంస్కృతంలో రఘువంశం, కుమార సంభవం, కిరాతార్జునీయం, శిశుపాల వధ, నైషధం అనే ఐదు మహాకావ్యాలకు పంచమహాకావ్యాలు అని పేరు. తెలుగు సాహిత్యంలో పంచమహాకావ్యాల సరసన చేరే కావ్యాల విషయంలో భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. ఈ భిన్నాభిప్రాయాలను ప్రధానంగా మూడు రకాలుగా వర్గీకరించవచ్చు. 1. వస్తు ప్రాధాన్యం 2. పాండిత్య ప్రకర్ష 3. రాయలకు సామీప్యం

వస్తు ప్రాధాన్యాన్ని ఆధారంగా చేసుకొని అనగా ప్రబంధ లక్షణాలను కలిగి ఉన్నవి పంచమహాకావ్యాలు అని సమ్మతిస్తే మనుచరిత్ర, ఆముక్తమాల్యద, పారి జాతాపహరణం, వసుచరిత్ర, ప్రభావతీ ప్రద్యుమ్నం అనే కావ్యాలు పంచమహాకావ్యాల కోవకి చేరతాయి. వైదుష్యాన్ని ఆధారంగా చేసుకుంటే ఆముక్తమాల్యద, మనుచరిత్ర, వసుచరిత్ర, రాఘవపాండవీయం, శృంగారనైషధం కావ్యాలని పంచమహాకావ్యాలుగా చెప్పవచ్చు. రాయల సామీప్యాన్ని పరిగణనలోకి తీసుకుంటే ఆముక్తమాల్యద, మనుచరిత్ర, పారిజాతాపహరణం, వసుచరిత్ర, పాండురంగమాహాత్మ్యం కావ్యాలు పంచమహాకావ్యాల వరసలో చేరతాయి. ఈ మూడు సంప్రదాయాలలో ఉన్న మూడు కావ్యాలలో అగ్రస్థానంలో

నిలిచే ప్రౌఢకావ్యం ఆముక్తమాల్యద. సాహితీసమరాంగణ సార్వభౌమునిగా, అభినవభోజునిగా, మూరురాయర గండడి గా, దుర్గా నటీశుడిగా, యవన రాజ్య సంస్థాపనాచార్యుని గా, విజయనగర సామ్రాజ్యాధీశునిగా వాసి కెక్కిన రాజకవి శ్రీకృష్ణదేవరాయలు. మదాలస చరిత్ర, సత్యావధూవీణనం, సకల కథాసార సంగ్రహం, రసమంజరి, జ్ఞానచింతామణి, ఉషాపరిణయం, జాంబవతీ కళ్యాణం, ఆముక్తమాల్యదలు రాయల రచనలు. ప్రస్తుతం జాంబవతీ కళ్యాణం, ఆముక్తమాల్యదలు మాత్రమే లభ్యమవుతున్నాయి.

శ్రీకృష్ణదేవరాయలు రచించిన నారికేళ పరిపాక ప్రబంధం ఆముక్తమాల్యద. తాను ధరించిన పుష్పమాలికని ఇచ్చునది (గోదాదేవి) అని ఆముక్తమాల్యద పదానికి అర్థం. ఏడు ఆశ్వాసాలతో ఏడేడు లోకాల రేడు, సప్తగిరిధాముడు మరియు కలియుగ సార్వభౌముడు అయిన శ్రీవేంకటేశ్వరునికి అంకితం చేయబడ్డ అనర్ఘప్రబంధరత్నం ఆముక్తమాల్యద. ఆంధ్రప్రబంధ సాహిత్యంలో ఆముక్తమాల్యద అశేష విశేష శేముషీ విభవ సంపదతో మూర్ధన్యప్రాయమైన కావ్యంగా, శ్రీకృష్ణదేవరాయల బహుముఖప్రజ్ఞకి లక్ష్యప్రాయంగా నిలిచిన కావ్యంగా సంఖ్యావంతులచేత సంభావింపబడుతున్న ప్రబంధం. శ్రీవిలుబుత్తూరు వర్ణన, మత్స్యధ్వజుని కథ, విష్ణుచిత్తుని కథ, ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానం, యామునాచార్యవృత్తాంతం, గోదారంగనాథుల వివాహం, మాలదాసరి కథ ఆముక్తమాల్యద కావ్యంలోని ప్రధానమైన విషయాలు.

ఆముక్తమాల్యద పదహారవ శతాబ్దానికి చెందిన రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాహిత్య, సాంస్కృతిక విషయాలకు సారస్వత సమాహారరూపం. ఆముక్తమాల్యదలోని సామాజికతని పరిశీలించటం ఈ వ్యాసప్రధానోద్దేశ్యం. ఆముక్తమాల్యద కావ్యంలోని అలనాటి సమాజానికి సంబంధించిన అంశాలను పరిశీలించడం ఒక పార్శ్వమైతే, ఈనాటి సమాజానికి అలనాటి ప్రబంధం ఏవిధంగా ఉపకరిస్తుందో విశ్లేషించడం మరొక పార్శ్వం. దేహళీ దత్త దీప న్యాయం లాగా ఈ రెండు విషయాలు ప్రస్తుత వ్యాసంలో పొందుపరచబడ్డాయి.

కవనీయ అంశాన్ని కమనీయంగా తీర్చిదిద్దగల నైపుణ్యం శ్రీకృష్ణదేవరాయలకి వెన్నతో పెట్టిన విద్య. ఆముక్తమాల్యద కావ్యంలో మొట్టమొదటి పద్యంలో రాయలు కలియుగ ప్రత్యక్షమైన శ్రీవేంకటేశ్వరుణ్ణి స్తుతించాడు.

"శ్రీకమనీయహారమణిఁ జెన్నుగఁ దానును, గౌస్తుభంబునం
దాకమలా వధూటియు నుదారతఁ దోఁపఁ, బరస్పరాత్మలం

దాకలితంబులైన తమ యాకృతు లచ్చతఁ బైకిఁ దోచి, య
స్తోకత నందుడు దోఁచె నన, శోభిలు వేంకట భర్తఁ గొల్చెదన్"

(ఆముక్తమాల్యద 1-1)

లక్ష్మీదేవి ధరించిన కమనీయహారంలో శ్రీవేంకటేశ్వరుడు, అలాగే శ్రీవేంకటేశ్వరుడు ధరించిన కౌస్తుభమణిలో లక్ష్మీదేవి కనిపిస్తున్నారు. అమ్మవారి హృదయం స్వచ్ఛమైంది కాబట్టి ఆమె హృదయంలో స్వామివారు కొలువుదీరారు. విశ్వపతి అయిన వేంకటపతి హృదయం స్వచ్ఛమైంది కాబట్టి అక్కడ లక్ష్మీదేవి కొలువుదీరినట్లు తెలుస్తోంది. భార్యాభర్తలైన పద్మావతీ శ్రీనివాసులు తమ హృదయ సింహాసనాల్లో ఒకరినొకరు ప్రతిష్ఠించుకున్నారు అని ఈ పద్యం ద్వారా తెలుస్తోంది. ఆదర్శదాంపత్యానికి ప్రతీక ఈ పద్యం. కోట్లు సంపాదించి పెట్టడం కన్నా గుండె కోటలో గుడి కట్టడమే జీవిత భాగస్వామికి అమితానందం కలిగించే విషయం అని ఈ పద్యం ద్వారా గ్రహించాలి.

శ్రీకృష్ణదేవరాయలు లోకపరిశీలన చేసిన వాడు. మారు వేషంలో రాజ్యంలోని స్థితిగతుల్ని స్వయంగా సమీక్షించిన ఉత్తమ ప్రభువు. కావ్యరచనకు హేతువు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసాల సమాహారత్వం అని మమ్మటుడి అభిప్రాయం. వ్యుత్పతి లోక, శాస్త్ర, కావ్యాల పరిశీలనవల్ల సిద్ధిస్తుందని భావించాడు. శ్రీకృష్ణదేవరాయలు శాస్త్రకావ్యలోక పరిశీలన చేసిన ధురంధరుడు.

శ్రీకృష్ణదేవరాయలు ఓ రోజు వరిమళ్ళ వద్ద తను చూసిన దృశ్యాన్ని పద్యంలో అక్షరీకరించాడు. శ్రీవిలుబుత్తూరు సమీపంలోని వరిమళ్ళకు తీసిన కాలువల దగ్గర బాతులు తమ తలల్ని రెక్కల్లో పెట్టుకొని నిద్రిస్తున్నాయి. తెల్లవారుజామున బ్రాహ్మణులు స్నానసమయంలో తమ వస్త్రాలను నీటిన పిండి పిడచలుగా పెడుతుంటారు.

నిద్రిస్తున్న బాతుల్ని చూసిన ఆరెకులు (తలారులు) అవి బ్రాహ్మణుల వస్త్రాలుగా భావించి వారి వద్దకి చేరుద్దామని వాటిని తీసుకోవడానికి ప్రయత్నించి ముందుకు వెళ్ళగానే అక్కడున్న బాతులు లేచి గబగబా పరిగెత్తాయి. అక్కడే వరిమళ్ళకి కాపలా కాస్తున్న స్త్రీలు ఈ దృశ్యాన్ని చూసి పకపకా నవ్వారు. కదలాడే భావచిత్రాన్ని ఈ పద్యంలో రాయలు నిబంధించారు.

తలఁబక్షచ్ఛటఁ గ్రుచ్చి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుషస్స్నాత ప్రయాత ద్విజ

వలి పిండీకృత శాటికల్పవిఁడు దదావాసంబుఁ జేర్పంగరే
వుల డిగ్గన్వేసఁడుబాలువానిఁడు గని నవ్వున్ శాలి గోప్యోఘముల్"
(ఆముక్తమాల్యద 1-65)

ఆనాటి కాలంలో ఎవరైనా వస్తువుల్ని మర్చిపోతే, తలారులు వాటిని వారి ఇళ్ళకు చేర్చే వారు. తమవి కాని వస్తువుల్ని ప్రజలు తీసుకునేందుకు ముందుకు వచ్చేవారు కాదు. దొరికిన వస్తువులని వాటి యజమానులకు అప్పగించాలనే భావన నేటి సమాజానికి అనుసరణీయమే కదా. రాజులు తమ రాజ్యాన్ని రహస్యంగా సందర్శించటం వల్ల వాస్తవాలు తెలుస్తాయి. పాలకులు, అధికారులు ఎప్పటికప్పుడు తమ దేశాన్ని సమీక్షిస్తుంటే ప్రజలు సుఖసంతోషాలతో ఉంటారు. ఈనాటి పాలక వర్గానికి, అధికారవర్గానికి ఉపకరించే పద్యరత్నమిది.

మానవ జీవితంలో దాంపత్యధర్మాన్ని పెద్దలు విశేషంగా చెప్పారు. చతుర్విధ ఆశ్రమాలలో గృహస్థధర్మం పేరెన్నికగన్నది. అన్ని ఆశ్రమాలు గృహస్థధర్మాన్ని ఆశ్రయించే ఉంటాయి. ఆలుమగలు ఒకరినొకరు అర్థం చేసుకొని జీవిస్తే ఆ జీవితం మధురానుభూతుల వాటికగా అనుబంధాల పేటికగా విలసిల్లుతుంది.

"మన కనురక్తి హెచ్చనిదెమందని కంఠముఁ గౌఁగిలించి ని
క్కిన ఫణిరాజవల్లి యెఱిఁ గింపఁగ నో యనఁ బూగముల్పరం
బునఁ బడు మట్టచేఁ జెఱకు ముత్తియము ల్చిటిలించి, తద్రసం
బనిశము వండునంతిక తలాంతికఁ జూర్ణముఁ జేయు నప్పురిన్"
(ఆముక్తమాల్యద 1-70)

శ్రీవిలుబుత్తూరులో చక్కని చెరకు తోటలు, పోకతోటలు, తమలపాకుల తోట లున్నాయి. పోకచెట్లకి తమలపాకుల తీగలు ప్రాకటం స్త్రీ పురుషుని కౌగిలించు కున్నట్లుగా ఉంది. తీగలు పోకచెట్ల కంఠాలను గట్టిగా కౌగిలించుకొని వాటికి ఇలా చెబుతున్నాయి. మనమధ్య చక్కని అనురాగం పెరగడానికి ఇదిగో ఒక మందు చూపిస్తానని చెప్పినట్లుగా పోకచెట్ల నుండి రాలుతున్న మట్టకు, చెరకుగడలు విరిగి పోతూ అందులోనుండి ముత్యాలు బయట పడి ప్రక్కనే బెల్లం వండే పొయ్యిలో పడి సున్నం అవుతుంది.

ఆ తమలపాకు తీగలు, పోకచెట్లు, ప్రక్కనే చెరకు తోటలు, ఆ ప్రక్కనే బెల్లం వండుతున్న పొయ్యిలు. ఇది బాహీరమైన దృశ్యం. ఈ దృశ్యానికి అక్షరీకరణే పై పద్యం. ముత్యాల చూర్ణమే గుల్ల సున్నం. తమల పాకులు, పోకలు, సున్నం ఉన్నాయి కనుక తాంబూలం తయారైంది. ఇది కలిగించేదే అనురాగం అంటే

ఎరుపు. స్త్రీ పురుషులు తాంబూల సేవనం చేసి పరస్పర బాహు బంధనాలలో ఉండే దృశ్యం తోటమీద ఆరోపించబడింది. ఈ భావనలో పురుషుడు పోక చెట్టు, స్త్రీ నాగవల్లీ (తమలపాకు). సంస్కృతంలో వృక్ష శబ్దం పుంలింగం, లతా శబ్దం స్త్రీలింగం. సంస్కృతంలో లింగం తెలుగులో లాగా సామాజికలింగం కాదు భాషాలింగం. ఇక్కడ శ్రీకృష్ణదేవరాయలు పోకచెట్టుకి తమలపాకు తీగకి దాంపత్య జీవనం కల్పించాడు. తమలపాకులు, సున్నం, పోక కలిస్తే ఏర్పడే ఎర్రదనం భార్యభర్తల మధ్య ఉండే అనురాగానికి ప్రతీక. నేటి సమాజంలో సైతం ఈ అనురాగాన్ని పండించుకుంటే జీవితం స్వర్గమయం అవుతుంది. ఉరుకుల పరుగుల హడావుడి యాంత్రిక జీవితంలో భార్యాభర్తలు పరస్పరం అర్థం చేసుకోకపోవడం వలన నేడు ఎన్నో సమస్యలు ఎదుర్కొంటున్నారు. ఆ సమస్యలకు ఆముక్తమాల్యద కావ్య ఇస్తున్న అనురాగ పరిష్కారమే ఈ పద్యం.

శ్రీ విలుబుత్తూరు నగర వర్ణనలో గాడ్పుబిడ్డ చేసిన గమ్మత్తుని శ్రీకృష్ణ దేవరాయలు మనోహరంగా వర్ణించారు.

“మలయపు గాలి రేలు వనమాలి విమాన పతాక ఘల్లు మం
చులియఁ బసిండి మువ్వగమి నొక్కొకమాటు గదల్ప, నుల్కిమి
న్నలము తదీయ హేమ వరణాంచల చంపక శాఖలందుఁబ
క్షులు రొదసేయ, వేగెనని కూడుదురల్కలు దీటి దంపతుల్”

(ఆముక్తమాల్యద - 1-74)

శ్రీ విలుబుత్తూరు నగరంలో అర్ధరాత్రి అందరూ ఆదమరచి నిద్రిస్తున్న వేళలో మలయపర్వతంపైపు నుండి ఒక పిల్లగాలి వీచింది. ఆ గాలి వనమాలి అయిన శ్రీమహావిష్ణువు యొక్క ఆలయం పైనుండే విమాన పతాకని తాకింది. ఆ బాలానిల స్పర్శకి పతాకానికి ఉండే బంగారు మువ్వలు ఘల్లు ఘల్లుమని సవ్వడి చేశాయి. ఆ అపరంజి మువ్వల సవ్వడికి గుడిగోడకి ప్రక్కనే ఉన్న సంపెంగ చెట్టుమీద నిద్రపోతున్న పక్షులు లేచాయి. ఆ పక్షుల రెక్కల చప్పుళ్ళు విని, గొడవపడి పెడముఖంగా నిద్రిస్తున్న దంపతులకు మెలకువ వచ్చింది. అప్పుడే తెల్లారిందని భావించిన ఇరువురూ ఒకరికొకరు దగ్గరయ్యారు.

గాలి వీయడం, ఆ గాలి తాకిడికి ఆలయం నున్న మువ్వలు మ్రోగడం, ఆ మువ్వల సవ్వడికి పక్షులు నిద్రలేచి తెల్లవారిందనుకొని శబ్దాలు చేయడం, ఆ పక్షుల శబ్దానికి తెల్లావారిపోయిందని భ్రమపడి దంపతులు కలవడం. ఈ నాలుగు విషయాలని నాలుగు పాదాల పద్యంలో శ్రీకృష్ణదేవరాయల చక్కగా కూర్చారు.

గాలివీయడం అనే పని గాలి యొక్క ధర్మం. వాతీతి వాయుః - వీయునది గాలి అని వాయుపదం యొక్క వ్యుత్పత్త్యర్థం. గాలి తన ధర్మాన్ని తను చేసింది. నిద్ర లేచిన పక్షులు ఆ రోజుకి కావాల్సిన ఆహారాన్ని సంపాదించటానికి శబ్దం చేస్తూ బయలు దేరడం అర్థపురుషార్థం. కలహించిన దంపతులు లేచి కలవడం కామ పురుషార్థం. ధర్మార్థపురుషార్థాలు సాధించబడే పద్ధతిని శ్రీకృష్ణదేవరాయలు రసరాజమైన శృంగార రసాన్ని జోడించి అపూర్వంగా ఈ పద్యంలో ఆవిష్కరించాడు.

గాలి సహజంగానే వీచింది. ఏ మాత్రం అందులో భ్రమ లేదు. ధర్మం ఎప్పుడూ భ్రమరహితంగానే ఉంటుంది. గుడిగంటలు భ్రమపడి మ్రోగలేదు. గాలి తాకిడివల్ల సహజంగానే మ్రోగాయి. కాని పక్షులు మాత్రం తెల్లవారిందని భ్రమతో ఆహారసంపాదనకై బయలుదేరాయి. అలాగే దంపతులు తెల్లవారిందని భ్రమపడి కలిశారు. ఈ సందర్భాన్ని వివేచిస్తే చక్కటి విషయం మనకు బోధపడుతుంది. ధర్మమోక్షాలు రెండూ భ్రమరహితాలు. అర్థకామాలు భ్రమసహితాలు. మన ధర్మాన్ని మనం గాలి వీచినట్లు సహజంగా నిర్వర్తిస్తే తరువాత జరుగవలసిన పనులు సహజంగా జరుగుతాయి. మనం మన ధర్మాన్ని సరిగ్గా నిర్వహించనప్పుడు అంతా అస్తవ్యస్తంగా ఉంటుంది. భారతీయ సనాతన సంస్కృతి "ధర్మో రక్షతి రక్షితః" ధర్మాన్ని రక్షిస్తే అది మనల్ని రక్షిస్తుందని తెలియజేస్తోంది. భారతీయ జీవన విధానంలో జీవితపరమార్థం చతుర్విధ పురుషార్థాల సాధన. కాబట్టి ధర్మం అంతస్సూత్రంగా జీవనం ఉండాలి. ఈ ధార్మిక జీవనం నేటి సమాజానికి ఎంతో అవసరం.

శ్రీవిలుబుత్తూరు వర్ణనలో పేర్కొన్న ఆయా కాలాలకు సంబంధించిన వంటలు నాటి సామాజిక జీవితాన్ని చక్కగా చిత్రిస్తున్నాయి.

గగనము నీరుబుగ్గ కెనగా జడి వట్టిన నాళ్లు భార్యక
న్నెగ సొరకుండ నారి కెడపుం బొరియల్దగిలించి వండన
య్యగపల ముంచి పెట్టుఉ గలమాన్నము నొల్చిన పప్పు నాలుగే
న్పొగపిన కూరలు స్వడియముల్వరుగు ల్పేరుగునత ప్లుతిన్"

(ఆముక్తమాల్యద-1-80)

ఆకాశం నీటి బుగ్గకు సమానంగా ముసురు పట్టిన వానా కాలపు రోజుల్లో కంటికి పొగ సోకకుండా కొబ్బరి బుట్టలు పెట్టి భార్య వంట చేస్తే, భర్త కొబ్బరి చిప్పల గరిటెలతో ముంచి అప్పం, పప్పు, నాలుగైదు కూరలు, వడియాలు, వరుగులు, పెరుగు, నేతితో వడ్డిస్తున్నాడు.

తెలినులి వెచ్చయోగిరముయు దియ్యని చారులు దిమ్మనంబులున్
బలుచని యంబళుల్చెరకు పాలెడనీళ్లు రసావళుల్ఫలం
బులును సుగంధి శీతజలముల్వడ పిందెలు నీరయుజల్లయున్
వెలయయుగ బెట్టు భోజనము వేసవియు జందన చర్చ మున్నుగన్"

(ఆముక్తమాల్యద 1-81)

వేసవి కాల భోజనం కాబట్టి అతిథులకు ముందుగా తాపం చల్లార్చే గంధపుపూత పెట్టి ఆ యా పదార్థాలు వడ్డిస్తున్నారు. చెప్పిన పదార్థాలన్నీ కూడా వేడిని పోగొట్టే పదార్థాలు . సుగంధి శత జలాలు అంటే కర్పూరమో, వట్టి వేళ్లో చక్కగా వేసిన చల్లని నీరు అని భావించవచ్చు.

"పునుగుందావి నవోదనంబు మిరియంపుం బిళ్లతోఁ జట్టిచు
య్యను నాదాఱని కూరగుంపుబీ ముకు మంధైయేర్చు నావం జిగు
ర్కొను పచ్చళ్లును, బాయసాన్నములు నూరుంగాయలున్, జేసులు
క్కను నేయుం, జిఱుపాలు వెల్లువగ నాహారంబిడు న్నీతునన్ "

(ఆముక్తమాల్యద 1-82)

చలికాలంలో పునుగు వాసనలు ఉండే వేడి అన్నం, కారపు పొళ్లతో చట్టి చుయ్యిమనే కూరలు, జలుబు వదిలించగలిగే ఆవపొడితో పచ్చళ్లు, పాయసాన్నం, ఊరగాయలు, చేయి చురుక్కుమనిపించే నెయ్యి, మరగగాచిన పాలు వీటన్నింటితో భోజనం వడ్డిస్తున్నారు.

పూర్వపు రోజుల్లో ఆయా కాలమాన పరిస్థితులకు అనుగుణంగా ఎటువంటి రోగాలు రాకుండా ఆహారపదార్థాలని తయారుచేసుకునే చక్కని నాగరికత పల్లెటూళ్లలో ఉండేది. ఆనాటి సమాజంలో ఉన్న ఆహారసంస్కృతిని శ్రీకృష్ణదేవరాయలు ఈ మూడు పద్యాలలో వర్ణించారు. నేటి సమాజంలో ఆహార విషయంలో జాగ్రత్తలు లేకపోవడం వలన అనేక రోగాల బారిన పడుతున్నారు. ఆయా కాలాలకు అనుగుణంగా భోజనం ఉండటం వల్లన చక్కని ఆరోగ్యాన్ని మనం సంపాదించుకో గలుగుతాము. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్" అని కదా కాళిదాసోక్తి.

నిషానిధి గేహ సీమనడుగేయాలించినన్ బ్రాయు నెం
తే నాగేంద్ర శయానుపుణ్య కథలుం దివ్య ప్రబంధాను సం
ధాన ధ్యానము 'నాస్తి శాక బహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠవం చకృపయా భోక్తవ్య' మన్మాటలున్"

(ఆముక్తమాల్యద 1-84)

ఆ శ్రీవైష్ణవ నియమ నిష్ఠాగరిష్ఠుడైన విష్ణుచిత్తుని ఇంటో అర్ధరాత్రి అయినప్పటికీ శ్రీమన్నారాయణుడికి సంబంధించిన పవిత్రమైన కథలు, వైష్ణవాళ్వారులు చేసిన ఆ యా క్షేత్ర దైవత స్తుతులైన పాశురాలపఠనం, అర్ధరాత్రి వచ్చిన అతిథులతో విష్ణుచిత్తుడు అయ్యా! కూరలు ఎక్కువగా లేవు. భోజన పదార్థాలు చల్లారి పోయాయి. పిండి వంటకాలు కూడా లేవు. కనుక సౌష్ఠవమైన భోజనం పెట్టలేను. నన్ను మన్నించి ఉన్నది తినండనే మాటలు, ఈ మూడు రకాలైన ధ్వనులతో అతని ఇంటి పరిసరాలు మారుమ్రోగుతున్నాయి.

ఈ పద్యంలోని విష్ణుచిత్తడు తనకు ఉన్నంతలో భాగవతోత్తములకు అతిథిమర్యాదలు చక్కగా చేయడం చూడవచ్చు. ఈనాటి సమాజంలోనూ మనం ఆచరించదగ్గ అంశం అతిథ్యం. ఈ పద్యంలో నాస్తి శాక బహుతా నాస్త్యుష్ణతా అనే మాటలు పూర్తిగా సంస్కృతంలో ఉన్నాయి. ఆనాటి సమాజంలో దేశం నలుమూలలనుండి వచ్చిన వారికి సంస్కృత భాష అనుసంధాన భాష అనే విషయం తెలిస్తోంది.

మత్స్యధ్వజుడు ఓ రోజు వారకాంతతో సంగమానికై పోతున్నవేళ వృషగిరి తిరునాళ్ళకై వెళ్ళి వస్తున్న పరదేశి బ్రాహ్మణుడొకడు తాంబూలాన్ని నములుతూ

వర్షార్థమష్టౌ ప్రయతేత మాసాన్
నిశార్థ మర్థం దివసం యతేత,
వార్ధక్య హేతో ర్వయసా నవేన
పరత్ర హేతో రిహజన్మనా చ. అనే శ్లోకాన్ని చెప్పగా విన్నాడు.
వినియె నెలల్చతుర్ద్వయిని వృష్టిదినాళికి, రాత్రికై దివం
బున, జరకై వయస్సు నను, బూని, పరంబునకిప్పుడుద్యమం
బనువుగఁ జేయఁగా వలయు నంచుఁ బురోహిత ధర్మమాత్మగీ
ల్కొన నలవిప్రుఁడా ద్విజుల లోన సుభాషితమున్ బఠింపఁగన్
(ఆముక్తమాల్యద-2.76)

వానాకాలంలో సుఖపడాలంటే మిగిలిన ఎనిమిది నెలలు కష్టపడి కావాల్సిన వస్తువుల్ని సమకూర్చుకోవాలి. వానాకాలంలో బయటకి పోవటం కుదరదు కాబట్టి ఈ పనిచేయడం వల్ల సమస్య రాదు. అలాగే రాత్రిపూట సుఖంగా ఉండటానికి పగలు కష్టపడాలి. ముసలితనంలో సుఖంగా ఉండటానికి యౌవనంలో కష్టపడాలి. అలాగే పరలోక సుఖం కోసం ఈ లోకంలో కష్టపడాలి. ఈ విషయం పారమాత్మిక సత్యాన్ని రాజులో ఆవిష్కరింపచేసింది. జీవితసత్యాన్ని తెలుసుకున్న రాజు భోగిని నివాసానికి వెళ్ళకుండా నిశ్చేష్టుడై తన్మయత్వంతో అలౌకిక వివేచన చేశాడు.

ఎక్కడి రాజ్యవైభవము? లెక్కడి భోగము? లేటి సంభ్రమం?
బక్కట! బుద్బుద ప్రతిమమైన శరీరము నమ్మి మోక్షపుం
జక్కి గణింపకుంటి యుగ సంధులు నిల్చియుఉ గాలు చేతి
బల్ తొక్కుల నమ్మను ప్రభృతులున్ దుద రూపఱకుండ నేర్చిరే"
(ఆముక్తమాల్యద 2-78)

అయ్యో! ఈ రాజ్యవైభవాలేంటి? ఈ భోగాలేంటి? వీటికోసం ఇంత ఆరాటం ఎందుకు? ఇదంతా నీటి బుడగవంటి శరీరం కోసమే కదా! యుగాల మధ్య సుదీర్ఘకాలం బ్రతికిన మనువు లాంటి వారే యముని ధాటికి రూపురేఖలు లేకుండా పోయారే నేను ఇప్పటి వరకు మోక్షమనే ఊహ కొద్దిమాత్రమైనా లేకుండా బ్రతికాను కదా అని రాజు పశ్చాత్తాపాన్ని పొందాడు.

ఈ పద్యం లౌకిక జీవనంలో మనం సుఖసంతోషాలతో ఉండటానికి పూర్వార్ధంలో పరిశ్రమించాలని ఆ పరిశ్రమే ఉత్తరార్ధంలోనూ ఉపకరిస్తుందని తెలియజేస్తోంది. నేటి సమాజానికి ఈ పద్యం ఇహపరాల రెండింటి విషయంలో మార్గదర్శకమే.

"ఇందుకులావతంసమతఁడే తటి నేతరిగాఁ; డరిం జ
ల్కందఁగొనండొరుం దొరుతల న్వినిపించిన మాట డెందముం
జెంద ముదంబు దక్కి చెడఁ జేయఁ డొరు, న్వినతాస్యుఁ డౌనుతిం
పం దనుఁ; బంద నుం గొఱత వల్కఁడు శూరతఁ దాను మించియున్"
(ఆముక్తమాల్యద 2-40)

ఆ చంద్రవంశలో శ్రేష్ఠుడైన ఆ మత్స్యధ్వజుడు ఎప్పుడూ రాజనీతిని తప్పి పరిపాలించడు. ప్రజలు బాధపడేటట్లు పన్నులు వేయడు. ఇతరులు చెప్పే చాడీలని విని శిక్షించడు. తనను ఎవరైనా పొగిడినప్పుడు తలవంచుకొంటాడు. అనుపమ ప్రతాపం కలిగి కూడా పిరికి వానిని సైతం తక్కువచేసి మాట్లాడడు. ఇటువంటి ధర్మపరిపాలకుడైన చక్రవర్తినే ప్రాచీనకవులు కావ్య నాయకునిగా చేసుకున్నారు. ఆలంకారికుల పరిభాషలో ధీరోదాత్త నాయక లక్షణాలివి.

శ్రీకృష్ణదేవరాయలు ఆనాటి చక్రవర్తి లక్షణాలని ఈ పద్యంలో చెప్పాడు. నేటి సమాజంలోనూ అలవర్చుకోదగ్గ ఉత్తమమైన గుణాలివి.

ఆముక్తమాల్యద కావ్యంలో తృతీయాశ్వాసంలో ఉన్న "ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానం" మన భారతీయ రాజనీతిని చక్కగా విశ్లేషించే కథ. ఖాండిక్య

కేశిధ్వజులకి మధ్య జరిగిన యుద్ధంలో ఖాండిక్యుడు ఓడిపోయి అడవులకి వెళ్ళిపోయాడు. మంచి రోజుల కోసం ఎదురుచూస్తూ పారమార్థికసంబంధమైన తాత్విక చింతనతో తన జీవితాన్ని గడుపుతున్నాడు. విజయాన్ని పొందిన కేశిధ్వజుడు ఈలోపు ఒక యజ్ఞాన్ని నిర్వహించడానికి పూనుకున్నాడు. దురదృష్టవశాత్తు ఆ ఆ యజ్ఞధేనువుని పులి చంపింది. మధ్యలో ఆగిపోయిన యజ్ఞాన్ని ఎలా పూర్తి చెయ్యాలో తెలియక కేశిధ్వజుడు పురోహితులని, పండితులని ఆయా శాస్త్రాలలో విశేషపాండిత్యం గలవారిని అడిగాడు. కానీ ఎవ్వరూ ఏమీ సమాధానం ఇవ్వలేదు. ఈ సమస్యకి పరిష్కారం చూపగలిగిన ఏకైక వ్యక్తి ఖాండిక్యుడొక్కడే అని కేశిధ్వజుడు తెలుసున్నాడు. తన చేతిలో ఓడిపోయిన ఖాండిక్యుడిని పరిష్కారం అడగటం ఏంటని కేశిధ్వజుడు ఏ మాత్రం నమూషీ పడకుండా యజ్ఞ పరిసమాప్తి కోసం అతడిని ఆశ్రయించాడు. కేశిధ్వజుడు తనని ఓడించాడనే బాధ, ప్రతీకార వాంఛ, కసి ఏ మాత్రం లేని ఖాండిక్యుడు కేశిధ్వజుణ్ణి శిష్యునిగా స్వీకరించి యాగపరిసమాప్తికి కావాలసిన మార్గాన్ని ఉపదేశించాడు. యుద్ధంలో విజయలక్ష్మిని కైవసం చేసుకున్న రాజుకి గర్వం లేకపోవడం, ఓడిపోయిన రాజుకి బాధలేకపోవడం ఇద్దరూ పుణ్యప్రదాయకమైన యజ్ఞం కోసం తమ బాధ్యతల్ని తాము నిర్వర్తించడంలోని ఆంతర్యం కర్మాచరణలో ధర్మాచరణ అంతర్లీనమైనదని ఉపదేశించడమే.

ఈ ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానం యొక్క ముగింపు తాత్త్వికతని బోధిస్తోంది. యాగానికి సంబంధించిన రహస్యాలని బోధించిన ఖాండిక్యుడికి గురుదక్షిణ ఇవ్వడానికై కేశిధ్వజుడు ప్రార్థించాడు. కోల్పోయిన రాజ్యాన్ని కోరుకున్నా ఇవ్వడానికి కేశిధ్వజుడు సంసిద్ధంగా ఉన్నాడు. అయినప్పటికీ ఖాండిక్యుడు రాజ్యాన్ని గాని, సంపదలని కాని అడగలేదు. కేశిధ్వజునికి తెలివిడిలో ఉన్న బ్రహ్మజ్ఞానాన్ని తనకు బోధించమని ప్రార్థించాడు. అప్పుడు కేశిధ్వజుడు ఆశ్చర్యంతో రాజ్యం ఎందుకు కోరుకోవడం లేదని

> ఈ ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానం యొక్క ముగింపు తాత్త్వికతని బోధిస్తోంది. యాగానికి సంబంధించిన రహస్యాలని బోధించిన ఖాండిక్యుడికి గురుదక్షిణ ఇవ్వడానికై కేశిధ్వజుడు ప్రార్థించాడు.

ఖాండిక్యుడిని అడగ్గా అతను చెప్పిన సమాధానం మహోన్నతం.

"విను కేశిధ్వజ! ధాత్రివేడిమికి నావేదించెదన్ హేతువ
జ్ఞానకుం గాక వివేకికేల జనియించున్ లౌల్యమెందున్? రణం
బునఁ బాడిన్ రిపు గూల్చు వాఁడియుఁ జాపోషంబు ధర్మంబు రా
జునకౌ; నైన నశక్తుఁద్వద్విజితరాజ్యున్నన్నఘం బంటునే?"
(ఆముక్తమాల్యద -3-61)

లౌకకమైన సంపదలు కోరుకునే వారు శ్రమపడకుండా దానధర్మాల ద్వారా వాటిని పొందాలనుకోవడం అజ్ఞానుల లక్షణం. వివేకవంతుడు అలా ఆలోచించడు. యుద్ధరంగంలో వీరోచితంగా పోరాడి సాహస పరాక్రమాలతో రాజ్యాన్ని పొందడం క్షత్రియధర్మం. అంతే కాని ఇలా యాచన ద్వారా కాదు. నేను నీకంటె బలహీనుణ్ణి కాబట్టి నీ చేతిలో ఓడిపోయాను. ఇందులో నేను బాధపడి క్రుంగిపోవలసింది ఏ మాత్రం లేదు. నన్ను అంటుకొనే పాపమూ లేదు అని ఖాండిక్యుడు తన సమాధానాన్ని ఇచ్చాడు.

ఖాండిక్య కేశిధ్వజులు యుద్ధం చేసినప్పటికీ ధర్మ మార్గాన్ని ఆశ్రయించారు. అలాగే బ్రహ్మతత్వాన్ని ఆరాధించారు. ఇటువంటి గుణాలు సనాతన భారతీయ వైదిక ధర్మ సంస్కారం వల్లనే సిద్ధిస్తాయి. మనం కూడా ధర్మపరిరక్షణలో కంకణబద్ధులం కావాలి.

ఆముక్తమాల్యద నాటి సమాజాన్ని చిత్రిస్తూ నేటి సమాజానికి కావల్సిన మానవ బౌద్ధిక వనరుల్ని పుష్కలంగా అందిస్తోంది. నాటి ప్రబంధాలను నేటి జీవితానికి సమన్వ యించుకొని ఆచరిస్తే జీవితం శోభాయమానం అవుతుంది. ఆముక్తమాల్యద ప్రబంధసింధువునుండి ఒక్క బిందువుని మాత్రమే ఈ వ్యాసంలో ప్రస్తావించడం జరిగింది. సహృదయ పిపఠిషువులు తమ స్వానుభవంతో మరెన్నో విషయాలను స్వాయత్తం చేసుకోగలరని విశ్వసిస్తున్నాను.

## ఉపజీవ్య గ్రంథాలు


1. ఆముక్తమాల్యద ( సంజీవనీ వ్యాఖ్య) - వేదం వేంకటరాయశాస్త్రి
2. ఆముక్తమాల్యద (సౌందర్యలహరి వ్యాఖ్య) - తుమ్మపూడి కోటీశ్వరరావు
3. ఆముక్త మాల్యదా సౌందర్యం - తుమ్మపూడి కోటీశ్వరరావు
4. ఆముక్తమాల్యద పర్యాలోకనం - వెల్దండ ప్రభాకరామాత్యుడు
5. కావ్యలహరి - దివాకర్ల వేంకటావధాని
6. తెలుగు ప్రబంధాలు - ఎం.కె. రాము (సం)

# పరిణయ ప్రబంధాలు- వైవాహిక జీవన విశేషాలు



డా. నాగభైరవ ఆదినారాయణ

పెళ్ళి అంటే రెండక్షణాలమాటే కాదు, స్త్రీ పురుషుల మధ్య ఏర్పడే ఒక విడదీయరాని అనుబంధం. రెండు ఆత్మలకు సదా కలిపి ఉంటే సంబంధం. రెండు కుటుంబాలను ఒకటిగా మార్చే బంధం. ఈ పెళ్లి రెండు తనువుల సయ్యాట. రెండు మనసుల ప్రేమ బాట. పురుషార్థానికి సమాజం అక్షతలద్వారా ఆమోదం తెలిపే తావు. ధర్మబద్ధమైన కామం ద్వారా మోక్షానికి దారిచూపే తొలిమెట్టు. అగ్నిసాక్షిగా ఏడడుగులు మూడు ముళ్ళతో నూరేండ్ల సహజీవనానికి వేసే తొలి అడుగు. అందుకే ప్రాచీనులు పెళ్ళిని షోడశకర్మలలో ఒకటిగా చేర్చారు.

పదిమంది పెద్దల ఆశీస్సులతో వధూవరులు ఒకటవుతారు. అందుకే పెళ్ళికి పది పర్యాయ పదాలున్నాయి. అవి పెళ్ళి, వివాహం, పరిణయం, పాణిగ్రహణం, ఉపయమం, ఉద్వాహం, ఉపయాపం, పాణిపీడనం, పరిగ్రహం, నిర్వేశం. జరిగే విధానాన్ని బట్టి పెళ్లి ఎనిమిది రకాలని పెద్దలు విభజించారు. పదహారవ శతాబ్దికి చెందిన శ్రీకృష్ణదేవరాయల కాలంలో ప్రత్యేకమైన కవితాప్రక్రియగా ప్రబంధం ఆవిర్భవించింది. నారాయణరెడ్డిగారు చెప్పినట్లు “రచనా విధానంలో, కథావస్తువులో, పాత్రచిత్రణలో, రసపోషణలో, అలంకార వర్ణనాదుల్లో కొత్తరీతులను సంతరించుకొన్న కావ్యప్రక్రియ” ను ప్రబంధం అనవచ్చు. తెలుగు సాహిత్యంలో ప్రబంధాలకు పూర్వం వీరశాంతరస ప్రాధాన్యం కలిగిన కవిత్వం అధికంగా ఉండేది. అలాకాకుండా ప్రబంధకవులు శృంగారానికి పెద్ద



పీట వేశారు. శృంగారం సంభోగం, వియోగం అని రెండు రకాలు. ప్రబంధకవులు ఈ రెండింటికీ ప్రాధాన్యం ఇచ్చారు. ప్రబంధాల్లో అంగరకాలుగా ఏరసమున్నా, అంగీరసంగా శృంగారమే పోషింపబడింది. చివరకు భక్తి ప్రాధాన్యం ఉన్న కథలలో కూడా శృంగారానిదే ఆధిపత్యం శృంగారానికి ఇంత ప్రాధాన్యం ఉన్న రచనల్లో ఆ శృంగారానికి మూలకందమైన పెళ్ళి గురించి వర్ణించకుండా ఉంటారా? అందుకే ప్రబంధకవులు పెళ్ళిని అంగరంగ వైభవంగా, అందంగా వర్ణించారు.

ఒక వ్యక్తికి పెళ్ళయిందా, లేదా అని ఎలా తెలుస్తుంది. పెళ్ళి అయినట్లు గుర్తు ఏమిటి? అని ప్రశ్నిస్తే అందుకు జవాబు 'తాళి' అనవచ్చు. 'తాళి' అనేది పెళ్ళికి చిహ్నం అయినంతమాత్రం చేత తాళి కట్టడమో, తాళి కట్టించు కోవడమో మాత్రమే పెళ్లి కాదు. తాళి కట్టడానికి, కట్టించుకోడానికి ముందు, తరువాత కొన్ని సంబరాలు ఉంటాయి. ఆ సంబరాలను, మాంగళ్యధారణను కలిపి " పెళ్ళి" అనాలి.

పెళ్లి పనులు ముహూర్తం పెట్టించడంతో ప్రారంభమవుతాయి. ఈ ముహూర్తాన్నే లగ్నం అని కూడా అంటారు. ఒక జంట ఏ శుభసమయంలో వివాహమాడితే సుఖసంతోషాలతో, పిల్లపాపలతో, భాగ్యాలతో ఆనందంగా జీవిస్తారని శాస్త్రాలు ఘోషిస్తాయో, ఆ సమయాన్నే ముహూర్తం అంటారు. మనుషులయితే పురోహితుని చేతో ఉత్తముడైన బ్రాహ్మణునిచేతో లగ్నం పెట్టిస్తారు. అదే ఇంద్రుడయితే తమ గురువయిన బృహస్పతిచేత పెట్టిస్తాడు కదా! వసుచరిత్రలో ఇంద్రుడు అదే చేశాడు.

అళిఘట మీనకేసరి శరసాసన గోమ కరంబులం గచం
బుల గుచనేత్రమధ్యముల భ్రుకటి జంఘికలన్ జయించి ని
స్తులత నజాంగనాధిక యశోనిధి యైన యవక్రవృత్తికిం
గలికికి నియ్యెడ న్మిథున కల్పన యోగ్యమటంచు బల్కినన్.

ముహూర్తం పెట్టిందే తడవు శుభలేఖలు వ్రాయించి బంధుమిత్రులను ఆహ్వానిస్తారు. అంతలో పెళ్లి రోజురానే వస్తుంది. హడావుడి ప్రారంభమవుతుంది. పెళ్ళికొడుకునకు, విడిది ఇంటిలో శపతి చూపిస్తారు. పన్నీటితో మంగళస్నానాలు చేయిస్తారు. పెద్దన మనుచరిత్రలో ముత్తయిదువులచేత వధూవరులకు మంగళ స్నానాలు చేయించాడు.

పసువుల నలుగిడి రైదువ
బిసరుహలోచనలు పెండ్లి పెద్దల యాజ్ఞన్

వసుధ్యాధ్యక్ష బుబుక్షన
కసి తాలక భరకు చేరటాండ్రొగి పాడన్

వివాహవేళ వధువులు అందంగా కనిపించడానికి పట్టువస్త్రాలచేత, విలువైన రత్నాభరణాలచేత అలంకరించుకుంటారు. ఇతరమైన వేడుకలకు ఎలా ఉన్నా వివాహమనేసరికి వరుడు కూడా చక్కగా అలంకరించుకోకుండా ఉండలేడు. మనుచరిత్రలో స్వరోచి ఇలా అలంకరించుకున్నాడు.

గురువున కొత్త జెంగలువ కచ్చు ఘటించిన మౌళి జుట్టె జెం
దిరిక చెఱంగునన్ బసిగి తీగెలు నించిన జిల్కుపాగ బం
భారసభవాసనాపవన పారణదేల నలందె గస్తురిన్
మరకత మౌక్తికాది మణిమండన మండితుడయ్యె నయ్యెడన్.

వధువు తండ్రి తన ఇంటిలో వివాహ వేదికను తయారు చేయించాడు. వివాహ సన్నాహాలను చెలికత్తెలు ఆనందంగా చేయసాగారు. ఆపనులతో ఆ అంతపురమంతా కళకళలాడుతూ ఉంది.

కులదేవతను తెచ్చి నిలిపిరి మాణిక్య
చకచకల్ గల పెండ్లి చవికెదండ;
నైరేని గొనివచ్చి రైదువల్ పాటలు
పాడుచు శుభవేళ వేడుకలర
పులు కడిగిన ముత్తెముల బాసికంబులు
సరవిగట్టిరి నేర్పు సంఘటిల్ల
తల బ్రాల కేర్చి ముక్తామణుల్ నించిరి
వసిడి పళ్లెముల సంభ్రమము మీఱ
పణవశంఖ ఢమామికా పటహ కాహ
ళారవంబులు నెఱపిరి బోరు కలుగ
సకల వినియోగముల జనుల్ సకులె గాగ
నంతిపురమున మత్సవంబయ్యె నపుడు.

అక్కడ ఏర్పాట్లు జరుగుతూ ఉంటే ఇక్కడ వరుడు విడిది ఇంటికి బయలుదేరాడు. అతనిని అనుసరించి బంధుమిత్రులు కదిలారు. ఊరేగింపుగా వస్తున్న వరుని చూడడానికి నగరంలోని స్త్రీజనం చేస్తూ ఉన్న పనులన్నీ మానేసి రాచవీధికి పరుగులు తీశారు.

అత్తటి బట్టణంబు వికచాంబురుహాక్షలు కౌతుకంబునన్ జిత్తము లుల్లసిల్ల

గయిసేసి గృహాంగణ సౌధమాలికల్ హత్తి నరేంద్రవీధి జతురంగ జలంబులు గొల్వగా మరు న్మత్త గజంబుపై జను కుమార శిరోమణి జూచి రుబ్బునన్

ఊరేగింపుగా తన ఇంటికి వచ్చిన అల్లునికిమామ స్వాగతం చెప్పాడు. కళ్యాణవేదిక వద్దకు తీసుకొని వెళ్ళాడు. ఒక సముచిత ఆసనం కూర్చోబెట్టి తేనె, పాలు, పెరుగు, పంచదార, నేయి కలిపి చేసిన మధుపర్కాన్ని ఇచ్చాడు.

విధివిహితంబుగా బుధగవీ దధి మిశ్ర సురద్రు మంజరీ
మధు మధుపర్కము న్విమల మౌక్తిక పాత్రిక దెచ్చి యా గుణో
దధి'కి నొసంగె మామ మధుదానవవైరికి లచ్చి నిచ్చు నం
బుధి యమృతాంశుతో నమృత పురము మున్నె యొసంగు కైవడిన్

వేదిక మీద వధూవరులను కూర్చోబెట్టారు. ఇద్దరి మధ్య ఒక తెరను అమర్చారు. మామ తన కూతురును శాస్త్రోక్తంగా అల్లునికి దానం చేశాడు.

దేవకి యొసంగ నావసుదేవు డపుడు
చంద్రకాంతపు గిడ్డి గొజ్జంగి నీట
ఐసిడి పళ్ళెములో బదాబ్జములు గడిగి
తనదు మేనల్లునకు గన్య ధారవోసె

ఆ తరువాత మెల్లగా వధూవరుల మధ్యగల తెరను తొలగించారు. పురోహితుడు వేదమంత్రాలను పఠింపసాగాడు.

క్రమమొప్పారగ బెండ్లి పెద్ద లిరువంకన్ వర్తిలంగా బ్రగ
ల్భమనీషం భ్రథమాగ ముండు తమితో లగ్నాష్టకంబుల్ పఠిం
చి మనోజ్ఞంబగు లగ్నవేళ శుభముల్ నేర్పించే శాస్త్రస్థితిన్
విమల శ్రీల మదాశయాత్మజకు మాణిస్తంభికిం ప్రేమతోన్.

పురోహితుడు 'మాంగళ్యం తంతునానేన' అంటూ చదువుతుండగా వరుడు వధువు మెడలో తాళిబొట్టు కట్టాడు.

ఘోలయలుకందు వేడుకొను పోలిక దెల్పెడు లీల సిగ్గుతో
ట్రిలిన ముఖాబ్జమెత్తి, మెడ క్రిందికి హస్త యుగంబు సాచి, వే
నలి దెమలించి, సౌఖ్య కలన స్థితి గట్టిగ బట్టికట్టె న
వ్వెలదున్ కంఠసీమ కురువీరుడు మంగళసూత్రమయ్యెడన్.

చెలికెత్తలు ముత్యాలు, రత్నాలు కలిపిన తలంబ్రాల పళ్ళేలు తెచ్చిపెట్టారు.

ఇరువంక జెలు లెత్తు లిడుచు నుబ్బింపంగ

జిఱునవ్వుతో గొంత సిగ్గువదలి
ఘనతరంబగు గుబ్బ చనుదోయి మీది కెం
తయు మిటారింప హస్తంబు లెత్తి
కడుదీగె సాగుచు బడుగు నెన్నడుము మి
క్కిలి గృశంబుగ దత్తరిలుచు నిక్కి
ముత్తెదువలు దగ నెత్తు బంగరు పళ్లె
ముల ప్రాలు దోయిళ్ళ ముంచి ముంచి

వధూవరులు ఒకరిపైనొకరు తలంబ్రాలు పోసుకున్నారు. పురోహితులు హోమాగ్నిని వెలిగించారు. ప్రదక్షిణ చేయించారు. సన్నెకల్లు తొక్కించారు. కొంగులు ముడివేశారు. అరుందతిని చూపించడానికి నడిపించారు.

'మిగులంగ సూక్ష్మమై మినుకు మినుకుమటంచు బ్రకాశమొందెడున్
ధ్రువు గనుగొంటె యల్లదె యరుంధతి జూచితె యంచు దత్సమీ
ప విశద తారలం గుఱుతు పల్కుఱు జెప్పుచు బోండ్లు తెల్పితె
ల్పి వనిత చేత ' గంటి' ననిపించిరి తత్పతి విన్చు రంజిలన్.

అంతటితో అయిందా? కాలేదు. మామ అల్లునికి ఎన్నో బహుమానాలు ఇచ్చాడు.

ఉర్వీజానికి మామ యిచ్చె శిఖి పింఛోద్భాసి వర్ణంబుచే
నర్వాచీన ఘనాళి రోహిత సహస్రాకీర్ణగా మింట భూ
పార్వ స్తోమము జిత్ర యానముల నూటడించు గాంధార్వం గం
ధర్వవ్యూహము దీప్తి చండమణి కాండ స్వర్ణ సన్నాహమున్
తళతళని తరణి మెఱుగుల
దలదల మను మణుల మెఱసి తలచిన చోటన్
నిలుచు విమానము ఖేచర
కుల తిలకుడు కూర్మి పెండ్లి కొడుకున కొసగెన్.

వధూవరులకు బంధుమిత్రులందరు బహుమానాలు చదివించారు. అనంతరం అందరూ విందు లారగించడానికి బయలుదేరారు. అక్కడ భోజనం ఇలా ఉందట.

కలవంటకములు బూరెలు తేనెతొలలు చా
పట్లు మండెగ లొబ్బట్లు వడలు
కుడుములు సుకియలు కడియంపుటట్లు వె

న్నప్పాలు వడియంబు లప్పడాలు
పొంగరంబులు సొజ్జె బూరె తాగులు నేపె
లుక్కెర లదిసెలు చక్కిలములు
ఖర్జూర గోస్తనీ కదళికా సహకార
ఫలములు కొబ్బెర పనస తొలలు
తేనియులు జున్ను మీగడ లానవాలు
పానకములు రసావళ్ళు పచ్చడులును
నాజ్య మొలుపు బప్పులు కూరలనుపమాన్న
మపుడు ప్రజనెల్లదని యుంచె నహరంబు.

పెళ్ళి భోజనాలు కడుపునిండా తిన్నారు కదా! భుక్తాయాసంగా ఉందా? ఇంతటితో పెళ్ళి అయిపోయింది అనుకుంటారేమో! ఇంకా పూర్తికాలేదు. వివాహానికి చివరి అంకమయిన శోభనం ఇంకా మిగిలి ఉంది. రాత్రి అయితేనే కదా దానికి ముహూర్తం. రాత్రికి దానిని కూడా పూర్తి చేయిస్తే పెళ్ళి వేడుకలు సంపూర్ణమవుతాయి.

రాత్రికి శయ్యాగృహాన్ని అందంగా అలంకరించి వధూవరులను గదిలోకి పంపించారు. ఆ రాత్రి వారిద్దరి శృంగార జీవనానికి తొలిరాత్రి. వారిద్దరూ ఏకాంతంలో మదన కదనానికి సమాయత్తమయ్యేసమయమది. వాళ్ళు ఊరుకుంటారా?

ఇగెడు వెన్కకుం బయికి నీడ్చిన; బైట దోలంగజేయ గే
లొగ్గెడు; రెమ్మి పోకముడి యూడ్చిన గ్రుంగిలి రెండు కొంగులన్
బిగ్గనడంచుచున్ విడిచిపెట్టదు; బాలననం బనేమి? యా
సిగ్గుకు సిగ్గులేదిటులు సేసిన పిమ్మట నుండవచ్చునే?

సిగ్గుకు సిగ్గులేకపోయినా మనకు సిగ్గు ఉందిగా! ఇంక మనం ఇక్కడ ఎందుకు? వివాహ వేడుకలను కనులారా తిలకించి ఆనందించాము కదా! ఇక ఇంతటితో ముగిద్దాం.

సూచన : ఈ వ్యాసంలోని పద్యాలు మనుచరిత్ర, వసుచరిత్ర, కళాపూర్ణోదయం, విజయవిలాసం అనే ప్రబంధాలనుండి గ్రహింపబడినవి.

# పదసాహిత్యం-ప్రతిఫలనం



డా. కంపల్లె రవిచంద్రన్

భక్తిని అనుసరించే వ్యక్తులు లౌకిక జీవితంలోనే ఉన్నా కొన్ని ప్రత్యేక లక్షణాలు కలిగి ఉంటారు. భక్తుల మానసిక చిత్తవృత్తి ఇహలోక సౌఖ్యాలకు అతీతంగా ఉండడం వల్ల లౌకిక జీవితానికి భిన్నంగా ప్రవర్తిస్తారు. లౌకికజీవితాన్ని త్యజించి సన్యాస జీవితాన్ని గడపడం భారతదేశంలో చాలా ప్రాథమికదశనుండి కనిపించే లక్షణం. సాధారణ జీవితంలో ఎదురయ్యే బాధలనుండి ముక్తిని సాధించి శాశ్వతానందసిద్ధికోసం పరితపించడం సన్యాస జీవితంలోని ముఖ్య లక్షణం. సంసారంలో ఎదురయ్యే సమస్యలు, ఆత్మీయులమరణం, ప్రకృతిలోని అనేక శక్తులు తమ ఆధీనంలో లేకపోవడంతో వాటి పై ఆధిపత్యం సంపాదించాలన్న కాంక్ష లౌకిక జీవితాన్ని వదిలి పెట్టడానికి కారణం కావచ్చు. అనేకశక్తులను సంపాదించాలంటే భగవంతుని ధ్యానించి ఆతణ్ణి ప్రత్యక్షం చేసుకోవడం ద్వారా సాధించగలమని భావించారు. అందు కొన్ని మంత్రాలను పఠించి భావావేశం పొంది లౌకిక జీవితానికి అధిస్థితిలో ఉన్నట్లు, లౌకికజీవితం కంటే ప్రత్యేక జీవితం గడుపుతున్నట్లు తలచారు. సన్యాసిలాగే భక్తుడు సహితం లోకంలోని పలు అంశాలను త్యజించాలి. లౌకిక జీవితానికి భిన్నంగా ప్రవర్తించాలి. భక్తుడు వ్యవహరించవలసిన తీరును మల్లికార్జున పండితుడు ఇట్లా వివరించాడు.

"లోకము విడువని వానిని
లోకము విడువదని విశ్వలోకేశ్వర నీ
లోకము గోరెడు మనుజుడు
లోకము వోవిడుచు నీవ - లోకముగ శివా" (శివతత్త్వసారం, పద్యం. 143)

ఈశ్వరుడినే లోకంగా భావించి లోకవ్యవహారాలపట్ల ఉక్ష వహించకపోతే ఈ లోకం గూడా తనను వదిలిపెట్టదని అంటాడు. అందువల్ల భక్తిని సాధించాలంటే

త్యాగ జీవితం అవసరమని బోధించాడు. పాల్కురికి సోమనాథుడు కూడా భక్తులు లోకధర్మాలకు అతీతంగా ప్రవర్తిస్తారంటాడు.

"లోకమునందు బుట్టియును లోకవిరుద్ధులనంత జీవన
వ్యాకుల చిత్తులయ్యు నధనార్థులనారత ధర్మసత్క్రియా
నీక సమేతులయ్యు ఫలని ప్రియులంగ విధేయులయ్యు దూ
రీకృత దుర్మదేంద్రియచరిత్రులు జాణలు భక్తు లల్పులే?"

(అనుభవసారం, పద్యం. 204)

భక్తులు సాధారణ ప్రజల్లాగే లోకంలో జన్మించినప్పటికీ సాధారణ జీవితానికి అతీతంగా ఉంటారని, జీవితంలో పలు కష్టాలు ఎదురైనప్పటికీ ధనం పట్ల ఆపేక్ష ప్రదర్శించక, ధర్మబద్ధంగా జీవితాన్ని కొనసాగించినప్పటికీ ఫలితమాశించక, శరీరాన్ని కాపాడుకున్నప్పటికీ ఇంద్రియ లంపటత్వం లేక జీవితం గడుపుతారు.

వీరశైవులలాగే వైష్ణవమతస్థుడైన అన్నమాచార్యులు గూడా వైరాగ్యజీవితం గడపాల్సిన అవసరాన్ని బోధించాడు. ఆయన ఒక సంకీర్తనలో వస్తుసంచయంపట్ల, ఇంద్రియ అంశాలపట్ల కోర్కెలను త్యజించి జీవించాల్సిన అవసరాన్ని వివరించాడు.

"వలనను వారిదె వైష్ణవము యిది
వలపు దేనెవో వైష్ణవము ॥వలనను ॥
సుడిగొను దేహపు సుఖదుఃఖములో
వడి జూరనిదెపో వైష్ణవము
ముడివడియింద్రియముల కింకరుడై
వడబడనిదె పో వైష్ణవము" ॥వలనను ॥

(ఆధ్యాత్మ సంకీర్తనలు, ప్రథమసంపుటం, సంకీర్తన. 405)

జీవితంలో ఎదురయ్యే అన్నిరకాల కష్టాలను భరించడానికి భక్తుడు సిద్ధంగా ఉంటాడు. ఇతర భక్తులవల్ల తనకు బాధలు సంప్రాప్తమైనా వాటిని అంగీకరిస్తాడు. ఈ క్రమంలో ఇహలోక సౌఖ్యాలను వదులుకుని నిరంతరం భగవంతుడిని ధ్యానించడానికి కొన్ని నియమనిష్ఠలను పాటిస్తూ ఒక ప్రత్యేక తరహా జీవనవిధానాన్ని అనుసరిస్తాడు. ఇక్కడే భక్తుడికి, సన్యాసికి మధ్య భిన్నలక్షణాలు కనిపిస్తాయి. భక్తుడు ప్రత్యక్ష జీవితానికి సంబంధించిన వివిధ మతకర్మకాండలను పాటిస్తే సన్యాసి వాటిని త్యజిస్తాడు. లౌకిక జీవితంలోని ప్రధాన సౌఖ్యాలను వదులుకుంటాడు. అంతేగాక లౌకికజీవితంలోని బాధలను తొలగించుకోవడానికి సమాజంలో అన్ని సంబంధాలు వదిలివేస్తాడు. భక్తిభావనను ప్రచారం చేసిన వ్యక్తులు ఇందుకు భిన్నం.

వీరశైవులు, వైష్ణవులు మోక్షసాధనను ప్రధాన ధ్యేయంగా భావించినప్పటికీ సమాజంలో భాగస్వాములయ్యారు. వీరు గృహస్థధర్మాలను అనుసరించారు. అందుకే వీరు ప్రచారం చేసిన భావాల్లో కులాలు, ఆర్థిక విషయాలు భాగమయ్యాయి.

మానవాతీత అత్యున్నతరూపంగా భావింపబడే భగవంతుడిని పూజించడం చాలా ప్రాథమిక దశనుండి ఉన్నప్పటికీ భగవత్కీర్తనకు 'భక్తి' అని వ్యవహరించడం తమిళదేశంలోని ఆళ్వార్లు, నయనార్ల వల్ల ప్రాచుర్యం వహించింది. 'భక్తి'కి ఆళ్వార్లు, నయనార్ల రచనలే మూలం. క్రీ.శ.6-9 శతాబ్దుల మధ్య తమిళదేశంలో వైష్ణవ, శైవ సంప్రదాయాలను ప్రచారం చేసిన ఆళ్వార్లు, నయనార్ల వల్ల భక్తి మార్గానికి నిర్దిష్టమైన రూపం ఏర్పడింది. వీరినుండే భగవంతుడిని పలురూపాలలో అర్చించి అతనితో బంధుత్వాన్ని ఆపాదించుకోవడం అధికమైంది. తండ్రిగా, తనయుడిగా, ప్రియుడిగా భగవంతుడిని ఊహించి అతడితో తమ భావాలను పంచుకోవడానికి భక్తకవులు ప్రయత్నించారు. భగవంతుడిని పలురకాలైన సంబంధాలతో అర్చించినప్పటికీ అతడిని ప్రియుడిగా పరికల్పించుకోవడం ఆళ్వార్లలో అత్యధికంగా కనిపిస్తుంది. 'భక్తి' అంటే భగవంతుడిని అర్చించడమనే పరిమితమైన అర్థంగాక ప్రేమస్వరూపమైన భగవంతునిలో సంలీనమవడమనే అర్థం స్థిరపడింది.

> భక్తి మౌలికంగా భగవంతుని అర్చించడమనే అంశంతో ముడిపడినప్పటికీ అది నిర్వహించే పాత్ర వైవిధ్యపూరితమైంది.

భక్తి మౌలికంగా భగవంతుని అర్చించడమనే అంశంతో ముడిపడినప్పటికీ అది నిర్వహించే పాత్ర వైవిధ్యపూరితమైంది. ప్రాథమికదశలో భగవంతుని పూజించడం ద్వారా అతణ్ణి ప్రసన్నం చేసుకోవాలనే భావమున్నప్పటికీ కాలక్రమంలో భగవంతుడితో ఆత్మీయ సంబంధాన్ని ఊహించడానికి, అతని గుణకీర్తనం ద్వారా వ్యక్తిగత ఆనందం ఆశించడానికి, సామాజిక సమస్యలను చర్చించడానికి 'భక్తి' ముఖ్యవాహిక అయింది. భక్తి నిర్వహించిన పాత్రను బట్టి అది పలు రకాలుగా విశ్లేషించబడుతూ వస్తుంది. 'భక్తిని ప్రముఖమైన అంశంగా గుర్తించిన కాలం నుండి సిద్ధాంతవేత్తలు భక్తిని అనేక రకాలుగా సూత్రీకరించారు. ఆలంకారికులు రసంగా నిరూపించారు. అలాగే ఆధునిక కాలంలోని సామాజిక శాస్త్రవేత్తలు భక్తి ఉపయోగితాగుణాన్ని పరిగణనలోకి తీసుకుని దాని వర్గప్రయోజనాన్ని చర్చించారు. ఇట్లా విభిన్న అభిప్రాయాల ప్రకటనకు కారణ

భూతమైన భక్తిస్వభావాన్ని, అది చర్చించిన అంశాలను పరిశీలించాల్సిన అవసరం ఉంది.

భక్తిభావనకు సైద్ధాంతిక రూపమిచ్చిన నారద భక్తి సూత్రాలలో భగవంతుని యందు పరమ ప్రేమ 'భక్తి' అన్న వివరణ ఉంది. శాండిల్యభక్తి సూత్రాలలోనూ భగవంతుని యందు అత్యంత అనురక్తి కలిగి ఉండడమే 'భక్తి'గా పేర్కొనబడింది. వైష్ణవమత ప్రచారకుడైన రామానుజుడు ప్రేమపూర్వకంగా నిరంతరం భగవంతుడిని ధ్యానించడమే భక్తి" అని, వేదాంత దేశికులు 'అత్యున్నత ప్రేమ స్వరూపమే పరమభక్తిగానూ భక్తిని గూర్చి వివరించారు. భక్తి స్వరూపాన్ని వివరించిన ఈ సిద్ధాంతవేత్తలు 'భక్తి'ని భగవంతుని పట్ల అత్యంత ప్రేమపూర్వకమైన అంశంగా భావించినట్లు పై అంశాలు విశదం చేస్తున్నాయి. పరమప్రేమనే భక్తిగా భావించడం వల్ల ప్రేమకు అత్యున్నత రూపమైన శృంగారం భక్తిభావనలో ప్రవేశించింది. అందువల్ల 'భక్తి'ని గూర్చి వివరణ యివ్వాల్సిన సమయంలో రతితో పోల్చడం చాలా ప్రాథమికదశ నుండి కన్పిస్తుంది. భగవంతుని అర్చించే భావాన్ని రతితో పోలుస్తూ బృహదారణ్య కోపనిషత్తు ఇట్లా పేర్కొంటుంది.

'ప్రియురాలి పరిష్వంగంలో ప్రియునికి బాహ్య జ్ఞానం, అంతరజ్ఞానం నశించిపోయినట్లు భగవత్ పరిష్వంగంలో జీవుడికి బాహ్యాంతరజ్ఞానం ఉండదు. దానివల్ల అతడు ఆప్తకాముడు - తీరిన కోరిక గలవాడు అవుతాడు. పరమాత్మ అతని కామం. ఆ దశలో అతనికి ఏ కామం ఉండదు. ఏ శోకం ఉండదు. భగవంతుడిని నిరంతరం ధ్యానిస్తూ అతనితో మమేకం కావడం కోసం ప్రయత్నించడం 'భక్తి' అని సాధారణ అర్థంలో నిర్వచించినప్పటికీ భక్తి మార్గాన్ని అనుసరించిన పలువురు కవులు శృంగారాన్ని పోషించడం, అన్నమయ్యలాంటి భక్తులు భగవద్రతిని కీర్తిస్తూ వేల సంకీర్తనలు రచించడం భగవంతునిపట్ల ఉండే భక్తికి, శృంగారానికి అభేదాన్ని ప్రతిపాదిస్తున్నారా అనిపించకపోదు. సోమనాథుడు కూడా 'అనుభవసారం'లో భక్తుడైన వ్యక్తి చిత్తవృత్తిని గూర్చి యిలా వివరించాడు.

'ప్రియురాలి పరిష్వంగంలో ప్రియునికి బాహ్య జ్ఞానం, అంతరజ్ఞానం నశించిపోయినట్లు భగవత్ పరిష్వంగంలో జీవుడికి బాహ్యాంతరజ్ఞానం ఉండదు.

కామంబు భక్తిరతియెడఁ
దామణి క్రోధంబు దేహధర్మముల యెడన్
వ్యామోహము భక్తులయెడ
శ్రీమతి లోభంబు వలయు శివపూజయెడన్"(పద్యం-59)

స్త్రీకి పురుషుడిపట్ల ఎలా బలమైన వాంఛ ఉంటుందో భగవంతునిపట్ల అలాగే వాంఛ ఉండాలని సాదృశ్యం తేవడం గూడా భక్తి, రక్తిల మధ్య సమానభావాన్ని హిస్తున్నాడని చెప్పడానికి అవకాశం ఉంది. భక్తునికి భగవంతునిపట్ల అనురక్తి, ఆత్మరతి ఉండడంతో నిరంతరం ధ్యానించి దేవుడి దయకు పాత్రమవ్వాలని ఆశిస్తాడు. భక్తుడైన వ్యక్తి తన ప్రత్యేకతను, అస్తిత్వాన్ని సంపూర్ణంగా త్యజించి తనను భగవంతునికి సమర్పించుకోవాలని కోరుకోవడమే 'భక్తి', నారదుడు, శాండిల్యుడు భగవంతుణ్ణి నిరంతరం ధ్యానించే ప్రేమస్వరూపాన్ని 'భక్తి' అని నిర్వచించారు. భగవంతుణ్ణి తదేకంగా ధ్యానించే సందర్భంలో భక్తునిలో కలిగే వివిధ మానసిక చిత్తస్థితులను గుర్తించిన అలంకారికులు 'భక్తి'ని రసంగా నిరూపించారు.

తెలుగులో పదకవిత్వం (సంకీర్తనవాఙ్మయం) కృష్ణమాచార్యుల సింహగిరి నరహరి వచనాలతోనే ప్రారంభమైంది. పన్నెండు, పదమూడు శతాబ్దాలలో దేవాలయాలలో సంకీర్తనలను గానం చేసేవారు. ఆనాటికి తెలుగుదేశంలో భాగవతసంప్రదాయం ఏర్పడింది. కృష్ణమాచార్యుల తరువాత చెప్పుకోదగ్గ పదకర్తలు యాగంటివారు. యాగంటికవులు శైవులు. యాగంటిపదాలలో యాగంటి గురుడు, యాగంటి శివుడు, యాగంటి లింగడు, యాగంటి శంభుడు, యాగంటి హరుడు, దలైన ముద్రలుండడం వల్ల యాగంటి పదాలు రాసిన కవులు ఒకరా, పలువురా! అన్న అనుమానం కల్గుతుంది. యాగంటి పదాలు ఎక్కువగా యాగంటి లక్ష్మయ్య పేరు మీద ప్రచారంలో ఉన్నాయి. యాగంటి లక్ష్మయ్య కృష్ణమాచార్యులకు, అన్నమాచార్యులకు మధ్యకాలంలో జీవించినట్లు పండితుల అభిప్రాయం.

'ఆంధ్ర వాగ్గేయకారచరిత్ర'లో బాలాంత్రపురజనీకాంతరావు పదసాహిత్యాన్ని కొన్ని యుగాలుగా విభజించుకొని ఆయా యుగాలలో ఉండిన పదకవుల జీవితాలను, రచనలను, పరిశీలించారు. డాఎ ఎస్. గంగప్పగారు ఈ క్రింది విధంగా విభజించాడు.

1. అన్నమాచార్య పూర్వయుగం (1400 వరకు), 2. అన్నమాచార్యయుగం (1400-1600), 3. క్షేత్రయ్యయుగం (1600-1750), 4. త్యాగయ్యయుగం (1750-1850), 5. ఆధునికయుగం (1850 నుండి...)

ఈ విధంగా పదసాహిత్య చరిత్రను విభజించి పరిశీలించడం శాస్త్రీయంగా ఉంది.

## 1. అన్నమాచార్య పూర్వయుగం

ఈ యుగం సుమారు శ్రీనాథునికాలం వరకు విస్తరిస్తుంది. ఈ యుగంలో మొదటి సంకీర్తనాచార్యుడుగా కృష్ణమాచార్యులు, తరువాత తత్త్వాలు రాసిన యాగంటికవులు ప్రముఖంగా కనిపిస్తారు.

## 2. అన్నమాచార్య యుగం

అన్నమయ్యే తెలుగులో పదకవితకు ఆద్యుడు, సార్వభౌముడు. అన్నమాచార్యులు, ఆయన సంతతి వారు రచించిన పదసాహిత్యమే గాక తొలి యక్షగానకర్తల రచనలు, తత్త్వకర్తలతత్త్వాలు యీ యుగం కింద పరిశీలింపబడతాయి. రెండు వందల సంవత్సరాలు విస్తరించిన ఈ యుగంలో యుగకర్త కాదగిన లక్షణాలు అన్నమయ్యకు తప్ప మరెవ్వరికీ లేవు. అన్నమయ్య కుమారుడైన పెదతిరుమలా చార్యులు, అతని కుమారుడైన చినతిరుమలాచార్యులు కూడా సంకీర్తనలే!



తాళ్లపాకకవుల తరువాత క్షేత్రయ్య వరకు గల మధ్యకాలంలో ఎందరో పదకర్తలు పదసాహితీలతను పరిపోషించారు. వారిలో మొదట చెప్పదగ్గవారు పోతులూరి వీరబ్రహ్మం, అతని శిష్యుడు దూదేకులసిద్ధయ్య. తత్త్వకర్తలని వీరికి పేరుంది. వీరబ్రహ్మం క్రీ.శ. 17వ శతాబ్దానికి చెందినవాడు. ఇతడు గొప్ప తాత్త్వికవేత్త, సంస్కరణాభిలాషి. ఇతడు రచించిన కాలజ్ఞాన తత్త్వం ప్రమాణ గ్రంథం. వీరబ్రహ్మం విగ్రహారాధన, ఆ జాతిభేదాలు, జాతరలు, జంతుబలులు మొదలైన వాటిని నిరసించాడు. శివకేశవుల భేదాన్ని, మతభేదాలను పాటించని వీరబ్రహ్మం సర్వమానవసమానత్వాన్ని బోధించాడు. అతని శిష్యవర్గంలో బ్రాహ్మణులు మొదలు దళితుల వరకు సర్వులూ ఉండేవారు.

'చెప్పలేదంటనక పొయ్యేరు - జనులాగ గురుని చేరి మ్రొక్కితె బ్రతుక నేర్చేరు

'ఇల్లు వాకిలి నాది ఇల్లాలు నాదనుచు - ఏ భ్రమసితివయ్యో మనసా' -

చెడు గుణంబుల జిక్కి చెడిపోకె మనసా చేరి సద్గురుని సేవించవే మనసా'

'చిల్లరరాళ్లను మొక్కుచునుంటే - చిత్తము చెడుగా ఒరే ఒరే"

మొదలైనవి వీరబ్రహ్మం ప్రసిద్ధతత్త్వాలలో కొన్ని.

బ్రహ్మంగారి శిష్యులలో దూదేకులసిద్ధయ్య ప్రసిద్ధుడు. ఇతడు మహమ్మదీయుడైనా వైరాగ్యం కలిగి అప్పటికే తత్త్వకర్తగా ప్రసిద్ధికెక్కిన బ్రహ్మంగారి నాశ్రయించి అతని శిష్యుడైనాడు. స్వమతస్థుల కోపానికి గురియైనా ఇతడు లెక్కచేయలేదు.

'ఏ కులమని నను వివరమడిగితే యేమని దెల్పుదు లోకులకూ -
పలుగాకులకూ, దుర్మార్గులకు, యీ సుష్టులకు'

'ఏల దేహము పనికిరాని దెందుకీ మోహము
జాలమనె సంసారబంధములోన జిక్కి మూలమెరుగని'

ఇత్యాది తత్వాలతో సిద్ధయ్యకు దేశంలో ప్రచారముంది. వీరబ్రహ్మం, సిద్ధయ్యల గురుశిష్య సంబంధం గొప్పది. 'బ్రహ్మం వంటి గురువు, సిద్ధయ్య నంటి శిష్యుడు' లేరని చెప్పడం ఈనాటికీ ఉంది.

భద్రాచలరామదాసని పేరుపొంది నాటినుండి నేటి వరకు ఆంధ్రదేశంలోనే గాక యించుమించు భారతదేశమంతటా పరమభక్తాగ్రేసరుడుగా పేరుపొందిన ఈ వాగ్గేయ కారుని అసలు పేరు కంచెర్ల గోపన్న.

ఇతని కీర్తనలను గానం చేయని రామమందిరాలు గాని, రాశుమందిరాలు లేని గ్రామాలుగాని ఆంధ్రదేశంలో లేవంటే అతిశయోక్తి కాదు. గోల్కొండ రాజ్యంలోని నేలకొండపల్లెలో లింగనమంత్రికీ కామమ్మకు పుత్రుడై జన్మించిన గోపన్న 1650 నాటికి తానీషా కొలువులో తహసిల్దారుగా చేరి వసూలు చేసిన పన్ను ధనంతో భద్రాచల రాముని ఆలయం నిర్మించినట్లు చరిత్ర చెపుతుంది. చిన్నతనంలోనే వైష్ణవదీక్ష తీసుకొని తన జీవితాన్ని రామభక్తికి అంకితం చేసుకొన్న రామదాసు నూటికి పైగా కీర్తనలను, దాశరథీశతకాన్ని రచించాడు.

రామదాసు కీర్తనలు భక్తి రసస్ఫోరకంగా, గాన పద్ధతికి అనుకూలంగా ఉంటాయి. సంగీత విద్వాంసుల ఆదరించకున్నా రామదాసుకీర్తనలు 'లోకుల రసనలె ఆకులు%%' దేశంలో ప్రచారం పొంది భక్తుల హృదయాలను నయం చేస్తున్నాయి.

రామదాసు కీర్తనలన్నీ భజనగోష్ఠులలో శ్రవణపర్వంగా నేటికీ మనం వినేవే. రామదాసు కీర్తనలను చదివినపుడు, పాడినపుడు, వినినపుడు మనకు పులకాంకురాలు పుడతాయి.

భక్తి ద్వారా మానవుడు మాధవునిగా మారాలి. కర్మ, జ్ఞానాది అంశాలకతీతంగా

అందరి ఆ దైవాన్నే చూడాలి. తనలోనే ఆ దివ్యత్వం ఉందని భావించాలి. అప్పుడే మనిషి ఆనందమూర్తి అవుతాడు. ఆ మూర్తి మత్వ నిర్మాణానికే రామదాసు తపన చెందాడు. అందుకే ఆయన సంకీర్తనల్లో విరాడ్రూప సమాజం కనిపించింది.

మనది వ్యక్తి కేంద్రీకృత సమాజం. వ్యక్తి సంస్కారవంతుడైతే కుటుంబం సమాజం వికాసశీలదిశలో నడుస్తుంది. వ్యక్తిలో పేరుకుపోయిన వికృతులను దూరం చేయాలి. సాంస్కృతికమానవుణ్ణి నిర్మించాలి. అప్పుడు సమాజం సంస్కృతీసంపన్నం అవుతుంది. ఇది భక్తి ద్వారానే సాధ్యమౌతుంది. భక్తి ఎక్కువ తక్కువలు లేని సమాజాన్ని నిర్మిస్తుంది. భక్తి అంటే మతం కాదు. భక్తి సామాజిక సమానత్వాన్ని సాధిస్తుంది. దశావతారాలు సామాజిక సమానత్వం నిమిత్తం, ధర్మరక్షణ నిమిత్తమే పురాణాల్లో ప్రవచింపబడ్డాయి. సామాజిక న్యాయాన్ని నిర్మించాయి. ధర్మవీర ప్రదర్శనతో దుష్టశిక్షణ శిష్టరక్షణ చేశాయి. ఈ దృష్టితోను, లౌకిక దృష్టితోను భక్త రామదాసు సంకీర్తనలు పరిశీలిస్తే ఆ కీర్తనల్లోని సామాజిక ప్రతిఫలనం అవగత మౌతుంది.

"శ్రీరాముల దివ్యనామస్మరణ - సేయుచున్నజాలు" అనే సంకీర్తనలో పరమధర్మం గురించిన బోధ ఉంది.

పరులహింస సేయకున్న - పరమధర్మ మంతేచాలు
పరుల రక్షింతునని - పలుక నేటికే మనసా

'అహింసాపరమోధర్మః' అన్న సూకే కీర్తనాఖండిక. హింసలేని సమాజం నిర్మాణం కావాలి. శారీరక, మానసిక హింసలుండరాదు. స్త్రీ బాలవృద్ధుల్ని హింసించరాదు. గృహహింస అవసరంలేదు. ఉన్నవాడు లేనివాణ్ణి హింసించరాదు. పని చేయండి! పరమాత్ముని నామస్మరణ చేయండి! ఘోరతపస్సులు కూడా చేయాల్సిన అవసరంలేదు. పరులను హింసించరాదు. "దొరకొని పరుల మనసు దోచుకొన్న నంతే జాలు" - అంటాడు భక్తరామదాసు. ఇదే సంకీర్తనలో, మరో విషయం పరిశీలిద్దాం!

నాడైనా నేడైనా రేపైనా అధికారశక్తి సామాన్య జనపక్షంలోనే నిలవాలి. అలనాడు రంతిదేవుడిదే మాట అన్నాడు. అన్నీ దానం చేసిన రంతిదేవుణ్ణి ఆ దివ్యశక్తి ఏం కావాలో కోరుకొమ్మంది. అప్పుడాయన ఇలా కోరుకొన్నాడు.

శ్లో॥ నత్వహం కామయేరాజ్యం - నస్వర్గం నపునర్భవమ్
కామయే దుఃఖ తప్తానాం - ప్రాణినా మార్తి నాశనమ్ ॥ (సంస్కృతభాగవతమ్)

నాకు రాజ్యం అక్కరలేదుబీ స్వర్గం వద్దుబీ పునర్జన్మ వద్దు దుఃఖతప్తులైన ప్రాణుల కష్టాల్ని దూరం చేసే శక్తి నాకు కావాలి. పరమభాగవతోత్తముడైన భక్తరామదాసు పరమాత్ముని పక్షం వహించేకన్నా పరమ దీనజనపక్షం వహించడం మిన్న అన్నారు.

"పరగ దీన జనులయందు - పక్షముంచితే చాలు
పరమాత్ముని యందు ప్రీతి - పట్టనేటికే మనసా ||"

రామదాసు దీనజనపక్షపాతి. ఆ దీనజనులలోనే రాముణ్ణి దర్శించాలనే సందేశమిచ్చిన భక్తాగ్రగణ్యుడు. సామాన్యమానవుని హితాన్ని ఆపేక్షించిన వాగ్గేయకారుడు.

చీనీ చీనాంబరాలు, నగలూ, నట్రా ఎన్ని ఉన్నా ఫలం లేదు. అధికారం ఉండవచ్చుబీ పాండిత్యం ఉండవచ్చు; పదిమందిలో ఏదోవిధంగా కీర్తి ప్రతిష్ఠలు పొందవచ్చు. ఇవేవీ నిలిచేవికావు. ఆధునిక దార్శనికులు స్వామి వివేకానంద ఈ లోకంలోకి వచ్చినందుకు విద్యాదానం, శ్రమదానం, సేవాదానం, అన్నదానం అనే యీ నాల్గింటిని కొనసాగించాలని అన్నారు. 'వేమున్న 'అన్ని దానములకు అన్నదానమె మిన్న' అన్నాడు. మరి, పై సంకీర్తనలోని రామదాసు చరణం చూడండి!

అతిథి వచ్చి ఆకలన్న - అన్నమిడినదేచాలు
క్రతువు సేయవలె ననెడి - కాంక్షలేటికే మనసా" ||

యజ్ఞయగాదులు తదితర కర్మకాండలు కొనసాగించేకన్నా అతిథికి అన్నం పెట్టడం ఉత్తమం; అందులో ఆకలిగొన్న అతిథికి. కూడూ-గూడూ-గుడ్డ ఏ సమాజంలో, ఏ దేశంలో అందరికీ అందుబాటులో ఉంటాయో ఆ సమాజం, ఆ దేశం దివ్యమైంది. అన్నానికి సకనకలాడే ప్రజలుండాలని ఎవరూ అనుకోరు. ఆకలికి అలమటించని సమాజం కావాలి. ఆకలితో ఎవరైనా ఉన్నారంటే వారు మా అతిథి అని పిలుచుకొనే వ్యక్తులున్న సమాజం నిర్మించుకోవాలి. రామదాసు రాగాల్లోని అనురాగమిదే.

ఆ దేవదేవునికి పతితపాలన, పతితపావన అనే బిరుదులున్నాయి. నేను కష్టాల్లో ఉన్నాను; ఆ బిరుదులు సార్థకం చేసుకో! ఆ బిరుదులు ఇతరులు నాడుకోవడం వల్ల వచ్చాయి. ఎవరేమి అన్నా నన్నూ, నాలాంటి వారిని ఆదుకో! కష్టాలు కడగళ్లు కన్నీళ్లు తొలగించు.

"అడుగుదాటి కదలనియ్యను
కభయమివ్వక నిన్ను విడువను
గడియా గడియకు తిరిగి తిరిగి
అడిగితిని వేసరిల వచ్చెను
గడువు దప్పిన వేనునిక బహు
దుడుకుతనముల సేయుదును విను ॥అడుగు ||

"పతితపాలన బిరుదు లేదా - నన్ను
పరిపాలన సేయరాదా!
ప్రతిదినంబున దేవతలు-భూ
పతి వటంచును వేడినను నీ -
హితవు జనములు వచ్చి - నన్ను
వేడికొనినను విడువనిన్ను ॥అడుగు ||

"భూమి నెట్టైలు దెఱచినా, చెట్లు ఎండినా, గోడలు పగిలినా, రాని దుఃఖం సమర్థుడు చేతులు ముడుచుకున్నప్పుడు వస్తుంది. సర్వజ్ఞుడూ, సమర్థుడూ అయిన పరమాత్మ దీనజన బంధువు. అటువంటివాడిని భక్తకవి చూస్తూ ఊరుకుంటే నేనూరుకోను, మంకుపట్టుపట్టి నీచేత పని చేయిస్తానంటున్నాడు. ఇది కేవల కవివాణి కాదుబీ ప్రజాబలం ఉన్న కవివాణి. ఆత్మనివేదనలో అనంతలోకాల సంక్షేమం కోరిన వాగ్గేయకారుడు భక్తరామదాసు.

రామదాసు సంకీర్తనల పాదాలను, పై విధంగా అర్థం చేసుకుంటే, ఆచరిస్తే సామాజిక సంక్షేమం సాధించినట్లే. వికాసశీలజగత్తులోకి సమాజాన్ని నడిపించినట్లే. ఉన్నవాణ్ణి లేనివాడు నరకడం, వర్గపోరాటం ద్వారా సామాజిక సమానత్వం సాధించడం అనేవి సామాజిక చైతన్యం క్రిందికి రావు. అవి హింసనూ, అశాంతిని సమాజంలో ప్రస్థాపిస్తాయి.

ఓం ద్యౌఃశాస్త్రి, అంతరిక్షగ్ం శాస్త్రిః, పృథ్వీశాస్త్రి, ఆపఃశాస్త్రః, ఓషధయశ్శాని.. అనేదే సామాజిక చైతన్యానికి, శాంతిస్థాపనకు దోహదం చేసే దివ్యవాక్కులు. భక్తరామదాసు సంకీర్తన సాహిత్యంలో కూడా ఇలాంటి అంశాలనే సామాజిక చైతన్యంగా పరిగణించడం జరిగింది. చైతన్యం శాంతిని నిర్మించాలిబీ అశాంతిని కాదు అనేది రామదాసు అభిప్రాయం.

క్షేత్రయ్య పదాలు సంగీత సాహిత్య, అభినయాలకు త్రివేణి సంగమం. క్షేత్రయ్య వేణుగోపాలస్వామికి పరమభక్తుడైనా, ఆ కాలప్రభావం నుంచి తప్పించుకోలేక పోయాడు. అతని పదాలన్నీ శృంగారరసప్రధానాలై, కొన్ని కొన్ని సందర్భాలలో, సభ్యతామర్యాదను కూడా అతిక్రమించడానికి హేతువు, ఆనాటి సాంఘిక పరిస్థితులే. పదిహేడవ శతాబ్దానికి చెందిన క్షేత్రయ్య పదాలన్నింటిలోనూ రసం శృంగారమే.

శృంగారరసభేదాలన్నీ అతని పదాలలో గోచరిస్తాయి. సంభోగ విప్రలంభ శృంగారంలో ఉన్న ప్రభేదాలన్నిటికీ క్షేత్రయ్యపదాలు లక్ష్యంగా నిలుస్తున్నాయి.

క్షేత్రయ్య దర్శించిన దైవాలలో వైష్ణవాంశసంభూతులే ఎక్కువ. ఆ దైవాలన్నిటి

లోనూ, ఆతడు, తన ఇలవేల్పు అయిన మువ్వగోపాలుణ్ణి దర్శించాడు. ఆతడు కొలిచిన దేవతలలో శ్రీశైలమల్లికార్జునుడు, శివకంచి ఈశ్వరుడూ ఉన్నారు. ఆ విధంగా క్షేత్రయ్య శివకేశవాద్వైతభావాన్నీ, సమదర్శిత్వాన్ని ప్రదర్శించాడు.

క్షేత్రయ్యది మధురభక్తిగా ప్రఖ్యాతం. మనస్సులోని శృంగారభావనలు ఉపశమించకపోతే, ఆ భావాల్ని చెప్తూనే, దేవుడి పరంచేసి జయంచడానికి చేసే ప్రయత్నమే మధురభక్తి. తెలుగు పదకర్తల్లో క్షేత్రయ్య మధురభక్తి ఆవిష్కరణ అసమానమైంది. ప్రియుని తోడి విరహవేదన, ప్రియుడు రాకపోవడం చేత చెప్పరానంత బాధ ననుభవించడం, మొదలైన భావాలతో క్షేత్రయ్యపదాలన్నీ నిండి ఉంటాయి. ఇవన్నీ ఆయనలోని భగవద్విరహవేదనా సూచకమైన ఆవిష్కరణలే. ప్రతిభావాన్నీ భగవద్విరహవేదన పరంగా అన్వయించుకునే అవకాశం కూడా ఉంటుంది.

'పడతిరో! మువ్వగోపాలుడైన
కడప వెంకటేశుని గుడి
యెడబాయక యుందునని యెంచుకుంటి
తడయ నేనొకటి తలచితే
దైవమొకటి తలచినందుకు
తొడబడనే తెగువ చేసెదనంటే
తొయ్యలి వాడేమి చేసుకొనునో

'కూడి ఎడబాయక యుందునని యెంచుకుంటి' అనడంలో విరహబాధ ఉండదని భావించడం, లేదా 'ఎడ'అంటే హృదయమనుకుంటే, ఎప్పుడూ హృదయం లోనే ఉంటాడని ఆశించడం అనుకోవచ్చు. అద్వైత భావాన్ని తీవ్రంగా కాంక్షించిన కవి, ఆ భావన దూరం కావడానికి పడే బాధ అడుగడుగునా కనిపిస్తుంది. మనసులోని శృంగారభావాన్ని తీసివేసే ప్రయత్నమే యిది. అభినయం అనుగుణంగా పదాలన్నీ రాయడం, సంగీతజ్ఞానంలో తానే తన పాటలకు రాగాలు నిర్ణయించడం. క్షేత్రయ్య మధురభక్తికి తగిన సంగీత, నాట్యగాఢతకు నిదర్శనం.

ఇక అన్నమయ్య విషయానికి వస్తే -
బ్రహ్మ మొకటే, పరబ్రహ్మమొకటే, పర
బ్రహ్మ మొకటే, పరబ్రహ్మమొకటే
కందువగు హీనాధికము లిందులేవు,
అందరికీ శ్రీహరే అంతరాత్మ,
ఇందులో జంతుకుల మంతా నొకటే
అందరికీ శ్రీహరే అంతరాత్మ

నిండారరాజు నిద్రించు నిద్రయు నొకటే,
అండనే బంటు నిద్ర అదియు నొకటే,
మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి యొకటే,
చండాలు డుండేటి సరిభూమి యొకటే,
అనుగు దేవతలకు అల కామసుఖమొకటే,
ఘనకీటపశువులకు కామసుఖ మొకటే;
దిన మహోరాత్రములు తెగి ధనాఢ్యున కొకటే,
ఒనర నిరుపేదకును ఒక్కటే అవియు
కొరలి శిష్టాన్నములు కొను నాక లొకటే,
తిరుగు దుష్టాన్నములు తిను నాక లొకటే;
పరగ దుర్గంధములపై వాయువొకటే;
వరుస పరిమళముపై వాయువొకటే;
కడిగి ఏనుగు మీద కాయు ఎండొకటే,
పుడమి శునకము మీద పొలయు నెండొకటే;
కడుపుణ్యులను, పాపకర్ములను సరిగావ
జడియు శ్రీవేంకటేశ్వరు నామమొకటే -

పదకవితా పితామహుడు తాళ్ళపాక అన్నమయ్య తంబురా మీటుకొంటూ తన్మయత్వంతో పాడిన పాట ఇది. తిరుమలేశుని నామమహిమను గురించి పొటిన పాట ఇది.

బ్రహ్మమొక్కటేనట, పరబ్రహ్మమొక్కటేనట. ప్రాణులన్నీ ఒకటేనట. హెచ్చు తగ్గులు లేవట. అందరికీ శ్రీహరే అంతర్మా అట.

రాజు నిద్ర, బంటు నిద్ర ఒక్కటేనట. సత్బ్రహ్మణుడు, చండాలుడు నడిచే నేల ఒకటేనట. దేవతలకు క్రిమికీటకాలకు, పశువులకు కామసుఖమొక్కటేనట. ధననంతుడికి, దరిద్రుడికి దివారాత్రాలు ఒక్కటేనట. శిష్ఠాన్నానికి, మృష్ఠాన్నానికి ఆకలి ఒక్కటేనట. దుర్వాసన మీద, సువాసన మీద వీచే గాలి ఒక్కటేనట. ఏనుగు మీద, కుక్కమీద కాసే ఎండ ఒక్కటేనట. పుణ్యాత్ములను, పాపాత్ములను కాపాడే శ్రీ వేంకటేశ్వరుని నామం కూడా ఒక్కటేనట.

ఏకత్వాన్ని, సమత్వాన్ని చాటి చెప్పే అన్నమయ్య కృతిలోని భావం క్రొత్తదేమీ కాదు. అది అతి ప్రాచీనమైనదే. 'ఏకంసత్', 'ఏకమైనా ద్వితీయం బ్రహ్మ', 'ఈశావాస్య మిదం సర్వం' - ఇవన్నీ ఇప్పటి మాటలా! వేదకాలం నుండి వినిపించే మాటలే.

అయితే, అన్నమయ్య చెప్పిన తీరు మాత్రం అద్భుతం. అంతేకాదు, అనాడాయన తంబురా మీటుకుంటూ పరవశించి ఈ పాట పాడుతుంటే ఎంతమంది తన్మయత నొందారో! తరతమ భేదాలు పాటించేవాళ్లు ఎంతమంది తమ మనస్సులు మార్చుకున్నారో.

ఏకత్వం సృష్టిలో అంతర్లీనంగా ఉంది. ఏ మహానుభావుడో దాన్ని గుర్చి తెలియచెపితే గాని తెలుసుకోలేం. ఎన్నో జన్మలు తపస్సు చేస్తేగాని దాన్ని దర్శించలేం. సమానత్వం సంగతి కూడా అంతే. ఒకవిధంగా అత్యున్నత స్థాయిలో ఏకత్వమే సమానత్వం. సర్వసమానత్వాన్ని ఈ సృష్టిలో చూడాలంటే వ్యక్తి బ్రహ్మజ్ఞాని కావాలి. అందరి దృష్టికి ఈ సృష్టిలో అగుపించేవి - అనేకత్వ అసమానత్వాలే." అనేకత్వ అసమానత్వాలు చాలా చిత్రమైన అంశాలు. ప్రాపంచికవ్యవహారాల్లో అవి చాలా ప్రాధాన్యం వహిస్తున్న అంశాలు. అందుకే వాటిని కట్టగట్టి గంగలో పారవెయ్యటం సాధ్యం కాదు. సామ్యవాదులకు, ప్రజాస్వామ్యవాదులకు కూడా అది సాధ్యం కాలేదు. వాళ్ల ప్రచారాల్లో వినిపించినంత ఏకత్వ సమానత్వాలు వాళ్ళ ప్రవర్తనల్లో అగుపించవు. అందుకే ప్రపంచంలో ఇంత పరపీడన.

> అహంకారం మనిషి పతనానికి ఒక ప్రబలకారణం. అహంకారం వల్లనే అతడు అందరికంటే తాను వేరనుకొంటాడు. అధికుడను అకొంటాడు.

అహంకారం మనిషి పతనానికి ఒక ప్రబలకారణం. అహంకారం వల్లనే అతడు అందరికంటే తాను వేరనుకొంటాడు. అధికుడననుకొంటాడు. అగుపించే అనేకత్వ అసమానత్వాలు నిజాలని భ్రమపడుతాడు. వాటిని తన స్వార్థానికి వాడుకోవాలని అనుకొంటాడు. అందుకు అక్రమమార్గాలు అవలంబిస్తాడు. పరపీడనకు పాల్పడుతాడు. పతనమౌతాడు.. మానవుడు దేశాలని, ప్రాంతాలని, జాతులని, మతాలని, కులాలని, రంగులని, రూపాలని ఎన్నో తేడాలు కల్పించుకొన్నాడు. తనవారని, పెరవారని భేదాలు ఏర్పరచుకున్నాడు. పరహింసకు పాల్పడుతున్నాడు. పాపం పెంచుకొంటున్నాడు. సామాజిక సుఖశాంతులకు కూడా భంగం కలిగిస్తున్నాడు.

తాత్త్వికంగా చూస్తే తేడాలు ఎక్కడున్నాయి? ఉన్న తేడాలన్నీ మనిషి చూపులోనే ఉన్నాయి. మనిషి మనస్సులోనే ఉన్నాయి. గాలి, నీరు, కాంతి, నింగీ, నేల అంతటా ఒకటే కదా. అందరికీ సమానమే కదా. మనిషి తాత్వికంగా ఎదిగిన రోజు, అగుపించే

ఈ అనేకత్వ అసమానత్వాలన్నీ సత్యాలు కావనీ, ఇవి సముద్ర తరంగాల్లాంటివనీ, విశ్వమంతా విష్ణుమయమని తెలుసుకొంటాడు. అనేకత్వంలో ఉన్న ఏకత్వాన్ని అసమానతల్లో ఉన్న సమానతను దర్శించగలుగుతాడు. బ్రాహ్మణుని చండాలుని, గోవును, కుక్కను సమానంగా చూడగలుగుతాడు. అన్నమయ్యలాగే "అందరికీ శ్రీహరే అంతరాత్మ" అని పరవశించి పాడగలుగుతాడు.

ఎందరో మహానుభావులు - అందరికి వందనములు



ఇది త్యాగరాజు పంచరత్న కీర్తనల్లో ఒక ప్రసిద్ధమైన కీర్తనకు పల్లవి. మనుషుల అహంకారానికి ఒక మంచి విరుగుడు మందు.

ఆధ్యాత్మికంగా అహంకారం అంటే దేహాత్మభావన. అంటే మానవుడు తాను ఆత్మస్వరూపుడనన్న సత్యాన్ని మరచి, పైకి అగుపించే తన దేహాన్ని, అగుపించకున్నా అనుభవంలో ఉన్న తన మనస్సును 'నేను' అని అనుకొని వ్యవహరించే అజ్ఞానము, మాయ అహంకారం. మానవ జీవిత పరమార్థం మోక్షసాధన అన్న విషయాన్ని విస్మరించి, ఐహికంగా తానార్జించుకొన్న పదవులు, సంపదలు, పలుకుబడులే జీవిత పరమార్థాలన్న భ్రమతో విర్రవీగటం అహంకారం.

సామాన్యదృష్టితో చూస్తే - అహంకారం అంటే తానే గొప్ప అన్నట్లు ఊహించుకొని, ఎదుటివాళ్లను తక్కువగా లెక్కగట్టి ప్రవర్తించటం, సామాజికంగా తాను సాధించిన. వాటిని తలచుకొని ఎగిరెగిరిపడటం.

కొందరి అహంకారం మరీ మీదపడి కొట్టినట్లుంటుంది. మరికొందరి అహంకారం కుంపటి ప్రక్కన కూర్చున్నట్లుంటుంది. ఇంక కొందరి అహంకారం చాపక్రిందినీరులా ఉంటుంది. ఏవిధంగా ఉన్నా అహంకారం అహంకారమే. అది వెగటుగానే ఉంటుంది.

లోకంలో అహంకారాలు అనేక రకాలు - జాత్యహంకారం, ఆభిజాత్యహంకారం, ధనాహంకారం, అధికారాహంకారం, విద్యాహంకారం, విజయాహంకారం ఇలాంటివి ఎన్నో! అహంకారులు ఒక ముఖ్య విషయాన్ని విస్మరించి విర్రవీగుతుంటారు. తమ జాతి, తమ వంశం, తమ కులం, తమ సంపద, తమ విద్య, తమ పదవి తమకెంత

గొప్పవో - ఎదుటివాళ్ల జాతి, వాళ్ల వంశం, వాళ్ల కులం, వాళ్ల సంపద, వాళ్ల విద్య, వాళ్ల పదవి వాళ్లకూ గొప్పవే కదా. తాను గొప్పవాడినుకొన్నట్లే ఎదుటివాడూ అనుకోవచ్చు కదా. ఈ విషయాలను విస్మరించటం వల్లనే మనిషికి అహంకారం.

> అహంకారాల్లో ధనహంకారమే అధికంగా అగుపిస్తూ ఉంటుంది. విశేషమేమి టంటే – అక్రమ ధనానికి అహంకారం మరీ ఎక్కువ.

అహంకారాల్లో ధనహంకారమే అధికంగా అగుపిస్తూ ఉంటుంది. విశేషమేమి టంటే - అక్రమ ధనానికి అహంకారం మరీ ఎక్కువ. ఇది అమితంగా ప్రదర్శనలిస్తూ ఉంటుంది. ఎగిరెగిరి పడుతూ ఉ ంటుంది. తక్కిన అహంకారం సంగతి ఎలా ఉన్నా, విద్యాహంకారవిషయమే వింత గొలుపుతుంది. నిజానికి విద్యవల్ల మనిషిలో వినయం ఏర్పడాలి. అందుకు విరుద్ధంగా అహంకారం పెరగటం వింతే కదా. విద్యాహంకారం కంటే వింతగొలిపేది ఇంకొకటి ఉంది. అదే కొందరు తాపసులలో అగుపించే అహంకారం. ప్రాపంచిక విషయాలకు దూరమై, ఇంద్రియాలను నిగ్రహించి, పరమాత్మమీద దృష్టి నిలిపి, అంతా బ్రహ్మమయం, అందరు ఆత్మస్వరూపులు అన్న సమభావనతో తపస్సు చేసుకొనే వారిలో అహంకారమా? ఇది ఎంత ఆశ్చర్యకరం! మహాభారతం ఇలాంటి అహంకారాన్ని, కౌశికునిలో, జాజలిలో చూపింది. వాళ్ల అహంకారాలు అంతం కావటానికి కౌశికుణ్ణి ధర్మవ్యాధుడి దగ్గరికి పంపింది. జాజలిని తులాధారుడి దగ్గరికి పంపింది.

మరో విశేషం ఏమిటంటే, ఈ తాపసాహంకారం కంటే ఆశ్చర్యకరమైన మరో అహంకారం ఉండటం. అదే భక్త్యహంకారం. అహంకారానికి విరుగుడు మందే భక్తి. అలాంటప్పుడు కొందరు భక్తులు తాము ఇంత భక్తులమని అంత భక్తులమని అహంకారం ప్రదర్శిస్తుంటారు. వెగటుగా మాట్లాడుతుంటారు. వింతగా ప్రవర్తిస్తుంటారు. ఏ అహంకారమైనా, అది వ్యక్తిలోని డొల్లతనానికి నిదర్శనమే కాని, నిండుతనానికి కాదు. అది వ్యక్తి ఆత్మోన్నతికి అడ్డుగోడ. పతనానికి ప్రబలహేతువు. సువిశాలమైన ఈ ప్రపంచంలో, అనంతమైన ఈ కాలంలో ఎవరి గొప్పతనం ఎంత? నేను అంత గొప్పవాడిని, ఇంత గొప్పవాడిని అని ఎగిరెగిరిపడటం ఎంత అవివేకం! అయితే, ఆత్మవిశ్వాసాన్ని అహంకారంగా భ్రమపడకూడదు. ఈ రెండూ వేరు. అహంకారం ఎంత ఉండకూడదనిదో, ఆత్మవిశ్వాసం అంత ఉండదగింది.

> మనిషి ఒకింత ఉన్నతంగా ఆలోచించాలేగాని, ఈ జగత్తులో దేని విశిష్టత దానిది. మల్లెపువ్వుకు పండులేదు. అట్లని దానికి విలువ లేదా?

మనిషి ఒకింత ఉన్నతంగా ఆలోచించాలేగాని, ఈ జగత్తులో దేని విశిష్టత దానిది. మల్లెపువ్వుకు పండులేదు. అట్లని దానికి విలువ లేదా? పనసపండుకు పువ్వులేదు. అట్లని దానికి విలువ లేదా? తమలపుతీవకు పువ్వు, పండు రెండూ లేవు. తమలపాకుకు ఎంత ప్రాధాన్యత! ఎంత పవిత్రత! అలాగే లోకంలో ఎవరి గొప్పతనం వారిది. ఒక రంగంలో ఒకరు గొప్పవారైతే మరొక రంగంలో మరొకరు గొప్పవారు. ఒకరిలో ఒక ప్రజ్ఞ ఉంటే, మరొకరిలో మరో ప్రజ్ఞ. అందుకే 'ముఖేముఖే సరస్వతీ' అన్నారు. పాండిత్యంలో ఒకరు గొప్ప అయితే, పాటలు పాడటంలో మరొకరు గొప్ప. ప్రవాహాలు మళ్లించటంలో ఒకరు గొప్ప అయితే, పంటలు పండించటంలో మరొకరు గొప్ప. నేరాలకు శిక్ష వెయ్యటంలో ఒకరు గొప్ప అయితే, రోగాలకు మందులివ్వటంలో మరొకరు గొప్ప. భగవత్సేవలో ఒకరు గొప్ప అయితే, ప్రజాసేవలో మరొకరు గొప్ప. ఒక్కసారి ఈ సత్యాన్ని తెలుసుకొంటే చాలు, అహంకారం దానంతట అదే అణిగిపోతుంది. ఎదుటివారిని గౌరవించే గుణం పెరుగుతుంది.

అందుకే త్యాగరాజుగారు 'ఎందరో మహానుభావులు అందరికి వందనములు' అని వినయ రమణీయంగా చెప్పారు. ఎందరెందరో మహానుభావులను ఆయన కీర్తనలో ప్రస్తావించారు. మనసారా వారిని కీర్తించారు. అహంకారానికి విరుగుడుమందులాంటి ఈ పల్లవిని ప్రతి వ్యక్తి రోజుకు ఒక్కసారైనా మననం చేసుకొంటే చాలు. అతడు అహంకారానికి దూరమౌతాడు. మానసికంగా ఎదుగుతాడు. తాత్వికంగా పండుతాడు.

ఉదయంతు శతమాదిత్యః
ఉదయంతు శతమిందవః
న వినా విదుషా వాక్యైః
నశ్య త్యాభ్యంతరం తమః

ఇది పండితవాక్యానికున్న ప్రాధాన్యాన్ని చెప్పే శ్లోకం. 'వందమంది సూర్యులు ఉదయిస్తే ఉదయింతురు గాక! అలాగే, వందమందిచంద్రులు ఉదయిస్తే ఉదయింతురు గాక! మనిషిలోని చీకటి మాత్రం విద్వాంసుల వాక్యాల వల్ల తప్ప వేరే

విధంగా తొలగిపోదు' అన్నది శ్లోకభావం.

ఎంత వాస్తవమైన మాట!

సూర్యుడు వెలుగునిచ్చేవాడే. చంద్రుడు కూడా వెలుగునిచ్చేవాడే.. ఇక వందమంది సూర్యులు,

వందమంది చంద్రులు ఉదయిస్తే ఎంత ఎక్కువ వెలుగు వస్తుందో వేరే చెప్పాలా! ఈ వెలుగు లోకంలోని చీకటినంతా చెరిపివెయ్యగలదు. అందులో ఏ సందేహం లేదు. కాని, ఈ కాంతి అంతా మనిషి మనస్సులోని అజ్ఞానం అనే చీకటిని, మాలిన్యం అనే చీకటిని ఆవగింజంత అయినా పారద్రోల గలదా? అసలు మనిషి మనస్సులోకి చొచ్చుకొని పోగలదా? లేదే! మనిషి మనస్సులో ఉండే అజ్ఞానం ఒక చీకటి. దురాలోచనల రూపంలో ఉండే మాలిన్యం మరో చీకటి. ఈ చీకట్లను పారద్రోలగలిగేది విజ్ఞానాత్మకమైన పండితవాక్యంబీ ధర్మప్రబోధాత్మకమైన పండితవాక్యంబీ జీవితతత్వాన్ని, జీవితపరమార్థాన్ని తెలియజెప్పే పండితవాక్యం. అందుకే ఆ శ్లోకకర్త అలా చెప్పాడు.

> దేహానికి ఆహారం ఎలాంటిదో, మనస్సుకు విజ్ఞానం అలాంటిది. అజ్ఞానం అనే చీకటిని తొలగించుకొని, విజ్ఞానం అనే వెలుగును పొందితే గాని, మనిషి మానసికంగా ఎదగలేడు.

దేహానికి ఆహారం ఎలాంటిదో, మనస్సుకు విజ్ఞానం అలాంటిది. అజ్ఞానం అనే చీకటిని తొలగించుకొని, విజ్ఞానం అనే వెలుగును పొందితే గాని, మనిషి మానసికంగా ఎదగలేడు. అలాగే, దేహానికి ఆరోగ్యం ఎలాంటిదో మనిషికి సదాలోచన అలాంటిది. దురాలోచన అనే మాలిన్యాన్ని తొలగించుకొని, సదాలోచన అనే వెలుగును పొందితే గాని అతడు సుఖశాంతులతో జీవించలేడు. సమాజ సుఖశాంతులకు దోహదం చెయ్యలేడు. అంతేకాదు, అతని జన్మసార్థకం కావాలంటే అతనికి జీవితతత్త్వం తెలియాలి. జీవితపరమార్థం బోధపడాలి. జీవితాన్ని సార్థకం చేసుకోవాలన్న సంకల్పం కూడా అతనిలో ఏర్పడాలి. అందుకు అతడు అవిశ్రాంతంగా కృషి చేయాలి.

ఈ విధంగా మనిషి మనస్సులోని చీకట్లను పారద్రోలి వెలుగులను నింపే పనిని, జీవితాన్ని సార్థకం చేసుకోవటానికి మనిషిని పురికొల్పే పనిని సూర్యకాంతి, చంద్రకాంతి చెయ్యగలవా? ఒక సూర్యుని కాంతి, ఒక చంద్రుని కాంతి కాదు వందమంది సూర్యుల కాంతి, వందమంది చంద్రుల కాంతి అయినా చెయ్యగలదా? సూర్యచంద్రుల సంగతి సరే- సమాజంలోని వ్యాపారులు చెయ్యగలరా? వ్యవసాయదారులు చెయ్యగలరా? వైద్యులు చెయ్యగలరా? లాయర్లు చెయ్యగలరా? రాజకీయనాయకులు చెయ్యగలరా.?

ఈ పని చెయ్యగలిగే వాళ్ళు కవులు, పండితులు, తాత్త్వికులు, సనాతన ధర్మ ప్రచారకులు మాత్రమే. వీళ్లందరూ పండితులే. మనిషి మనస్సులోని చీకట్లను పారలి, మనస్సు నిండా వెలుగులు నింపే మంచివాక్యాలు చెప్పటమే వీరి పని. అందుకే ఆ శ్లోకకర్త వందమంది సూర్యులు, వందమంది చంద్రులు చెయ్యలేని పనిని పండితుల వాక్యాలు మాత్రమే చేస్తాయని చెప్పాడు.

కోటానుకోట్ల జీవరాసుల్లో తనలోని చీకటిని తొలగించుకోగల శక్తి ఒక్క మానవుడికే ఉంది. అందుకే అతడు వెలుగునిచ్చే పండిత వాక్యాలు వినాలి. పండితుల గ్రంథాలు చదవాలి. తనలో ఉన్న చీకటిని తొలగించుకోవాలి. జీవితతత్త్వాన్ని తెలుసుకొని జీవితపరమార్థాన్ని సాధించటానికి ప్రయత్నించాలి. అప్పుడే మానవ జన్మకొక సార్థకత అన్న ప్రబోధాన్ని ఆ జీవితాంతం బోధించినవారు వాగ్గేయకారులు.



*In a democracy, the well-being, individuality and happiness of every citizen is important for the overall prosperity, peace and happiness of the nation*

- అబ్దుల్ కలామ్

# శతక సాహిత్యము - సామాజిక దృష్టి



డా. గన్నమరాజు గిరిజామనోహర బాబు
99490 13448

శ్రీగురు లింగమూర్తి సువిశేష మహోజ్జ్వల కీర్తి, సత్క్రియో
ద్యోగకళాప్రపూర్తి, యవధూత పునర్భవజార్తి, పాలికా
భ్యాగత సంశ్రితార్థ కవి పండిత గాయక చక్రవర్తి, దే
వా! గతి నీవె మాకు బసవా! బసవా! బసవా! వృషాధిపా!

పద్యాన్ని పల్లకి ఎక్కించి నేటివరకూ వైభవంగా ఊరేగింపజేస్తున్న విశేష ప్రక్రియ శతక ప్రక్రియ, సంపూర్ణ శతక లక్షణాలున్న తొలి తెలుగు శతకంగా సాహిత్యలోకం గుర్తించిన పాల్కురికి సోమనాథుని "వృషాధిప శతకం" లోని తొట్ట తొలి పద్యమే ఇది. ఈ శతకంలోని ప్రతి పద్యమూ పాల్కురికి ప్రతిభను తదనంతర తరాలకు స్ఫూర్తినిచ్చి శతక రచనలను ప్రోత్సాహించినదే కావడం విశేషం. ఆయన భాషా సామర్థ్యం, ఆయన రచనలోని భావ సంపన్నత తదనంతర కవులకు దిగ్దర్శనం చేసిందన్న సాహిత్య చరిత్రకారుల అభిప్రాయం సత్య సమ్మతం.

శతక ప్రక్రియ ప్రారంభంలో అత్యధికంగా భక్తివరకే పరిమితమై పరిఢవిల్లింది. క్రమక్రమంగా పలు విధాలుగా విస్తరించింది. మానవ విలువల ప్రచారానికి, నైతిక విలువల ప్రచారానికి, సామాజిక బాధ్యతల నిర్వహణ విషయాలకు విస్తరించి శతకం తన పరిధిని మరింతగా పెంచుకొని స్థిరపడింది. తెలుగు సాహిత్యం ప్రక్రియా వైవిధ్యం ఎంతగా పెరిగినా 'శతకం' మాత్రం నాటి నుండి నేటిదాకా తన గమనాన్ని కొనసాగిస్తూనే ఉంది. అది ప్రత్యేకంగా మనం పరిగణనలోనికి తీసుకోవలసిన అంశం. తిరుపతి కవులు చెప్పినట్టు "కాలముబట్టి దేశమును గాంచి" తనను తాను మలచుకొన్న ప్రక్రియ గనుక శతకం నేటికీ నిలిచి వెలుగుతున్న ప్రక్రియగా అలరిస్తున్నది, సమాజానికి

సందేశాలను అందిస్తూనే ఉన్నది. తొలినాటి తెలుగు సాహిత్య చరిత్రకారులు తమ సాహిత్య చరిత్రలలో తెలుగు శతకానికి అంతగా ప్రాధాన్యాన్ని ఇవ్వలేదు. కానీ క్రమంగా ఈ ప్రక్రియ స్థిరపై, సామాజిక ప్రయోజనమే లక్ష్యంగా ఎదిగిన కారణంగా సాహిత్య చరిత్రకారులు ఈ ప్రక్రియకు సరియైన గుర్తింపును ఇస్తూ వచ్చారు. శతకం తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్న కారణంగానే ఇది సాధ్యమైంది.

తొలిదశలో తెలుగు శతకం భక్తికే పరిమితమైనా అవసరం వచ్చినప్పుడు భక్తి నేపథ్యంతోనే సమాజాన్ని గురించి, సమాజంలో ఉండే వ్యక్తులకు ఉండవలసిన లక్షణాలను గురించి మరోరీతిలో చెప్పే ప్రయత్నం చేశారు. నేరుగా సామాజిక విషయాలు ప్రస్తావించకున్నా ఇతర కారణాలను చెప్పవలసి వచ్చినప్పుడు మాత్రం ఎప్పుడు వెనకాడలేదనడానికి తొలితరపు శతకాల్లో ఒకటైన యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకంలోని పద్యం దీనికి నిదర్శనంగా నిలుస్తుంది.

"సత్యంబెప్పుడు తప్పడేనియు, దురాచారుండుగాడేని , యౌ
చిత్యం బేమఱడేని, దుర్జనుల గోష్ఠింబొందడే భక్త సాం
గత్యంబాదట బాయడేని, మదనగ్రస్తుండు గాడేని, నీ
భృత్యుండాతడు మూడులోకములలో బూజ్యుండు సర్వేశ్వరా!"

అంటూ చెప్పిన మాటల్లో శివభక్తులెట్లా ఉండాలో చెప్పినా సమాజంలో ఒక వ్యక్తి ఉన్నతుడు కావడానికి అతడు గొప్ప సంస్కారవంతుడుగా ఎదగడానికి, అతనిలో పెరగాల్సిన దైవత్వాన్ని గురించి వివరిస్తూ శతక కవి "సత్యమార్గానుయాయిగా, దుష్టకామానికి దూరుడుగా, భక్తి కలిగిన వాడుగా, భక్తుల సాంగత్యం వీడనివాడుగా, దుర్మార్గుల స్నేహం లేనివాడుగా" చెప్పడం మానవునికుండవలసిన ఉత్తమ వ్యక్తిత్వం ధ్వనిస్తున్నట్లుగా ఉంది. సమాజంలో ఉత్తమ సంస్కారం కలిగి ఉండాల్సిన వ్యక్తులను గురించి భక్తి శతకం చెప్పిన తీరు నాటి కవుల సామాజిక దృష్టిని తెలుపుతున్నది.

తెలుగు శతకం భక్తితో బాటు ఇతర ప్రయోజనాల దిశగా విస్తరించినప్పుడు శతక కవులు తాము జీవిస్తున్న సమాజాన్ని గురించి, సమాజంలో ఉన్న వ్యక్తులకు ఉండవలసిన సంస్కారాన్ని గురించి, వాళ్ళు గౌరవించవలసిన మానవ విలువలను గురించి వేలాది శతకాలలో వ్యక్తీకరించారు. వేమన్న వంటివారు సమాజానికి భిన్నమైన వాటి విషయంలో ప్రశ్నించడానికి కూడా వెనుకాడలేదు. నైతిక విలువలే ఏ సమాజాన్నైనా ఉన్నతస్థాయికి తీసుకొనిపోతాయన్న సత్యాన్ని తెలిసినవారు గనుక నేరుగా వాటిని బోధిస్తూ శతక రచన చేశారు. భాస్కర శతకం, సుమతి శతకం

వంటి శతకాల ఆవిర్భావానికి ప్రధాన కారణం కూడా అదే. అడుగడుగునా ప్రజలను గురించి, ప్రజా పాలకులను గురించి, పౌరులను గురించి, పౌరబాధ్యతలను గురించి అనేక శతకాలు అందించి శతక సాహిత్యాన్ని మరింత పుష్టిమంతం చేశారు.

మహాకావ్యాలను రచించి విశ్రుతకీర్తి గడించిన కవులు కూడా శతకాలు రచించడానికి కారణం సమాజంపట్ల వారికున్న చింతనమేనన్నది కాదనలేని సత్యం. ధూర్జటి తాను రాచరిక వ్యవస్థలో ఉన్నవాడైనా 'రాజుల్ మత్తులు, వారి సేవ నరకప్రాయంబు" అనగలిగిన ధీరకవి. ప్రజల విషయంలో పాలకులకు ప్రేమ, గౌరవం ఉండాలి. రాజు కాగానే అవి మృగ్యమైపోతున్నందుకు వేదన చెంది-

> "రాజన్నంతనెపోవునా కృపయు, ధర్మాంబాభిజాత్యంబు, వి
> ద్యాజాతక్షమ సత్యభాషణము, విద్వన్మాత్రసంరక్షయున్
> సౌజన్యంబు, కృతంబెఱుంగుటయు విశ్వాసంబుగాకున్నదు
> ర్బీజ శ్రేష్ఠులుగా గతంబుగలదే? శ్రీకాళహస్తీశ్వరా!"

అంటూ పాలకుల ప్రవృత్తిని, పాలితుల పట్ల వారుచూపే నిర్దయతను స్పష్టంబుగా ఖండిస్తూనే, ప్రజల పట్ల, సమాజం పట్ల పాలకులకు ఉండవలసిన లక్షణాలను గురించి భంగ్యంతరంగా చెప్పాడు. రానివని భక్తి శతకాలే అయినా, చెప్పిన విషయాలన్నీ భక్తి నేపథ్యంగా సమాజంలోని పౌరుల అవసరాలను తెలిపేవే ఆనాటి కవులకు అది తప్ప మరొక మార్గం లేదు. కొంతమంది కవులు మాత్రం ప్రత్యేకంగ నైతిక విలువలను పెంపొందించే నీతి శతకాలను రచించి అందించారు. సమాజం పట్ల నిబద్ధతతో ఇట్లా వెలువడ్డవే భాస్కర శతకం, సుమతి శతకం మొదలైనవి. ప్రత్యేకంగా వెల్లువలాగానే ఈ మార్గంలో శతకాలు వెలువడి సమాజ నిబద్ధతను, ప్రజాజీవనాన్ని వెలిగించాలన్న ధ్యేయమే వాటి లక్ష్యంగా నిలిచింది.

వేమన కాలానికి సామాజిక స్థితిగతులు అస్తవ్యస్తంగా ఉండటం, మూఢవిశ్వాసాలు విజృంభించి మనుషులను ఋజువర్తన నుండి దూరం చెయ్యడం, ద్వేషాలు, రోషాల వల్ల తమలో తాము కలహించుకోవడం, నైతికంగా పతనం చెందడం వంటి అనేక విధాలైన సామాజిక రుగ్మతలకు లోను కావడం వేమన్న వంటి కవుల హృదయాలను గాయపరచింది. సమాజం పట్ల నిబద్ధతతో, మానవ సంక్షేమం పట్ల మమకారం పద్యాల వెల్లువను ప్రవహింపజేసింది. ఎక్కడ అన్యాయం జరిగినా, ఎక్కడ మౌఢ్యం ముసురుకున్నా, ఎక్కడ అవినీతి విజృభించినా వేమన్న తన పద్యాల ఖడ్గాన్ని ఝుళిపించాడు. తెలుగు శతకానికి సమాజ దృష్టి ఎక్కువ అన్నమాటకు పూర్తి స్థాయిలో న్యాయం చేకూర్చింది వేమన శతకమే. సమాజంలోని అస్పృశ్యత విషయంలో ఆగ్రహించిన వేమన్న మానవుల మధ్య ఈ

వివక్షకు తావుండరాదన్న భావంతోనే.

"మాలవానినేల మహిమీద నిందింప
నొడల రక్తమాంసమొకటి గాదె?"

అన్న ప్రశ్న సంధించి తార్కిక రీతిలో జనాలలోని వివక్షభావాన్ని నేరుగా నిలదీసి మరో తాత్త్విక విషయాన్ని దానికి జోడిస్తూ "వాని లోనివాని కులంబేది?" అని గట్టిగా ప్రశ్నించడం మానవ సమాజానికి, మానవ ప్రవృత్తికి ఇదొక కళంకమేనన్న విషయాన్ని స్పష్టపరచడమే. ప్రతి జీవునిలో ఉన్న దేవుడొక్కడే అన్న విషయాన్ని మరచిపోతున్న మానవులకు ఇది గుర్తుచేసినట్లనిపిస్తుంది. అస్పృశ్యత విషయంలో అనేక సందర్భాల్లో అనేక విధాలుగా వేమన ప్రశ్నించాడు. నిలదీశాడు అంతేకాదు మరొక తీర్పు కూడా చెప్పాడు. అసలు మాలవాడెవరో కుండబద్దలుగొట్టి చెప్పాడు.

"మాలమాలగాదు మహిమీద నేపొద్దు
మాట తిరుగువాడె మాలవాడు"

అంటూ నిర్ధారించిన కవి వేమన్న చెప్పిన ప్రతి పద్యం సమాజాన్ని, దాని పోకడనూ స్పష్టంగా, సంపూర్ణంగా పరిశీలించి చెప్పినవే. అందుకే అతని ప్రతి పద్యంలో మానవత్వం పరిమళం గుభాళిస్తుంటుంది. మన మధ్య పెరిగిన అంతరాలు, మనలో కనిపిస్తున్న మూఢ విశ్వాసాలు, మనవాళ్ళలోని ఆచరణరాహిత్యం వంటి అనేక విషయాల్లోని డొల్లతనాన్ని నిర్భయంగా ప్రస్తావించిన కవి వేమన్న.

ఏ సమాజానికైనా వ్యక్తులే ప్రధానకేంద్రాలు. కనుక వ్యక్తి నిర్మాణం ముఖ్యమని గుర్తించిన శతక కవులు వ్యక్తిత్వాన్ని దృఢం చేసుకోవడానికి అవసరమైన ధర్మాల్ని తమతమ శతకాల్లో చెప్పే ప్రయత్నం చేశారు. ఇటువంటి భావాలున్న గొప్ప శతకాల్లో భాస్కర శతకం, సుమతి శతకం వంటివి శిఖరాయమానంగా పరిగణింపబడతాయి. చదువు అనేది మనిషిలోని సంస్కారాన్ని పెంచి సన్మార్గం దిశగా సాగే స్ఫూర్తినివ్వాలి. చదువు, సంస్కారం ఉన్న వ్యక్తి వల్లే సమాజ పురోగతి, మానవ సంక్షేమాలు సాధ్యమవుతాయి. మంచి చెడులను స్పష్టంగా విభజించుకొని తనను తాను సంస్కరించుకోడానికి మనిషికి చదువు కావాలి. అందుకే మారద వెంకయ్య తన భాస్కర శతకంలో

"చదువది యెంత గల్గిన రసజ్ఞత యించుకయైనలేని యా
చదువు నిరర్థకంబు" అంటూ అటువంటి చదువును
"గుణసంయుతులెవ్వరు మెచ్చర" ని కూడా చెప్పారు.

అంటే చదువు మనిషిలోని రసజ్ఞత పెంచాలన్న భావనను మనం సంస్కారంగా భావిస్తే చదువు విలువ తెలుస్తుంది. ఒక వ్యక్తి వ్యక్తిత్వాన్ని అది మరింత బలాన్నిస్తుంది. కేవలం జ్ఞానం సరిపోదు జ్ఞానఫలంగా సంస్కారం పెరగాలి. అది వ్యక్తిని సంపూర్ణ వ్యక్తిగా సిద్ధం చేస్తుంది. అటువంటి సంపూర్ణ వ్యక్తిత్వం కల వ్యక్తులతో కూడి ఉండే సమజమే ఉన్నతసమాజంగా నిర్మాణమవుతుంది.

శతకకవులు అన్ని కాలాల్లోనూ ఏ భావనతో శతక నిర్మాణం చేసినా నేపథ్యంలో సమాజ హితాన్నే కాంక్షించి సామాజిక దృష్టిని తమ తమ పద్యాల్లో ధ్వనింపజేశారు. సుమతి శతక కారుడైన బద్దెన

“వినదగు నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింపదగున్
కనికల్ల నిజము దెలిసిన
మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ!”

అని మనిషి మొదట ఎదుట వాళ్ళు చెప్పేది వినాలి, తరువాత ఆలోచించి ఏది మంచియో, ఏది చెడో తెలిసి తన పని చెయ్యాలని చెప్పడం వ్యక్తిని సంస్కరించడమేనన్నాడు. అంతేకాదు “తన కోపమే తన శత్రువు” అని కోపం మనిషిని పతనం దిశగా నడిపిస్తుందని, ఎప్పుడూ ఇతరులలో తప్పులు వెదకరాదని కూడా చెబుతూ అటువంటి వారితో స్నేహం కూడా తగదంటూ....

“ఎప్పుడు తప్పులు వెదికెడు
నప్పురుషుని గొల్వగూడ దదియెట్లన్నన్
సర్పంబు పడగనీడను

గప్ప వసించిన విధంబుగదరా సుమతీ” అని చెప్పడమే అటువంటి వారివల్ల వ్యక్తిగతంగా తనకూ, తన సమాజానికీ ప్రమాదమేనన్న సంకేతాన్ని పంపినట్లయింది. “అన్యులు మనములు నొప్పింపరాదని” చెప్పి ఒప్పించిన గొప్ప శతకం సుమతి శతకం. నీతిబోధ మార్గంగా సమాజోన్నతిని కాంక్షించినవే శతకాలు.

సమాజంలో అస్తవ్యస్త పరిస్థితులు, అరాచకస్థితులు ఏర్పడినప్పుడు ప్రజలుపడే కష్టాలకు అంతుండదు. అటువంటి సందర్భాలనుకూడా చూచిన తెలుగు కవుల శతకాల్లో దేవునికి విన్నవించే నెపంతో నాటి సామాజిక చిత్రాన్ని మనముందుంచారు. శేషప్పకవి రచించిన “నారసింహ శతకము” కాసుల పురుషోత్తమ కవి రచించిన “ఆంధ్రనాయక శతకము” అడిదము సూరకవి రచించిన “రామలింగేశ శతకము” పోతిపెద్ద వెంకటరాయకవి “వేణుగోపాల

శతకము" కూచిమంచి తిమ్మన "కుక్కుటేశ్వరశతకం, గోగులపాటి కూర్మనాథ కవి "సింహాద్రి నారసింహ శతకం" వంటి శతకాలన్నీ దైవానికి చెబుతున్నట్టుగా నాటి సమాజపు తీరు తెన్నులను ప్రజల కష్టాలను, పాలకుల విధులను చెప్పిన తీరు ఆయా కవులకున్న మానవ సంక్షేమ భావనను వ్యక్తం చేస్తున్నది. శేషప్పకవి నాటి కాలంలో.

"అధిక విద్యావంతులప్రయోజకులైరి
పూర్ణశుంఠలు సభాపూజ్యులైరి...." అంటూ
చెబుతూ "సత్యవంతుల మాట జనవిరోధంబాయె
వదరుబోతుల మాట వాసికెక్కె....."

అని కూడా నాటి లోకం పోకడలను తెలపడంతో బాటు పాలకుల అశక్తతను కూడా కళ్ళకు కట్టించే విధంగా

"మాన్యంబులీయ సమర్థుడొక్కడులేడు
మాన్యముల్ చెఱువ సమర్థులంత
యెండినయూళ్ళ గోడెరిగింపడెవ్వడు
పండిన యూళ్ళకే ప్రభువులంత...."

అని చెప్పడం సమాజ దుస్థితికి, పాలకుల అసమర్థతకు అద్దంపడుతున్నది. సామాజిక చింతన కవులకే ఇటువంటి రచనలు చెయ్యడం సాధ్యమవుతుంది.

భక్తిమార్గంలో సామాజిక దృక్పథాన్ని కూడా అక్కడక్కడా అవకాశాన్నిబట్టి రచించిన అనేక శతకాలు కూడా తెలుగులో లెక్కకు మిక్కిలిగా వచ్చాయి. వ్యక్తులకు, సమాజాన్ని పట్టించుకున్న కవులు ఎక్కువగా శతక కవులేనన్నది ఆయా శతకాల కారణంగా తెలుస్తున్నది. కుమార శతకం, కవి చౌడప్ప శతకం, గువ్వల చెన్నశతకం వంటి అనేక శతకాలు తాము చెప్పదలచుకున్న విషయాన్ని సమాజంతో జోడించి చెప్పే ప్రయత్నం చెయ్యడం గమనిస్తే సమాజం పట్ల శతక కవుల కున్న బాధ్యత అర్థమవుతున్నది.

పద్య ప్రక్రియను నేటికీ సజీవంగా ఉంచి వెలిగిస్తున్న ప్రక్రియ శతక ప్రక్రియయేనన్నది నిర్వివాదమైన అంశం. ఆధునిక కవులు కూడా నేటి మానవుల మంచి చెడ్డలను, నేటిపరిపాలకుల ధోరణులను, నేటి సమాజపు తీరు తెన్నులను చెప్పే పద్ధతులు మనకు ఆధునిక శతకాల్లో కనిపిస్తాయి. ఆధునిక తెలుగు సాహిత్య రంగంలో లబ్ధప్రతిష్ఠులైన శతక కవులు కూడా శతక రచన

చెయ్యడం ఒకవిధంగా సమాజాన్ని గురించి ఆలోచించడమే ప్రధాన కారణం అనవచ్చు. డా. బోయిభీమన్న, దాశరథి, శ్రీశ్రీ, విశ్వనాథ, నార్ల వెంకటేశ్వరరావు, సంపత్కుమారాచార్య, సుప్రసన్నాచార్యవంటి ప్రసిద్ధులు తమతమ శతకాల్లో నేటి సమాజంలోని అసంగతులను, అవసరాలను పలుచోట్ల ప్రస్తావించారు.

ఆధునిక సాహిత్యంలో 'శతకం' నేటి సమాజాన్నిచిత్రించే ఒక ప్రధాన ప్రక్రియగా కొనసాగుతుందన్న సంగతిని గ్రహించి డా.బోయి భీమన్నగారు తమ "పిల్లీ!" శతకంలో మనుషుల మనస్తత్వాన్ని చెబుతూ

"తను చేయుచున్న పనినే

తన వైరి యొనర్చినేని తప్పని తెగడున్" అంటూ మనిషి నైజం ఎండగట్టడం గమనిస్తే, మనిషి ఋజువర్తనుడైనప్పుడే మనిషి తన సమాజంలోని యితరులు కూడా తనవంటి వారేనని తలచినప్పుడే అది మానవ సమాజానికి మేలు కలుగుతుందని 'పిల్లీ' శతకంలో అనేక విధాలుగా బోధిస్తూ కవిత్వం మనిషికి జ్ఞానంతోబాటు మానసిక ఆనందాన్నికూడా అందిస్తుందని స్పష్టపరుస్తూ "మానవుని నిత్యవిధిలోప్రాణమ్ములు డస్సియున్న పట్టునకావ్యంబానందమొసగు...."నని, దానివల్ల జరిగే మానసికమైన స్థితిని చెప్పి అంతటి ప్రశాంత చిత్తత కలిగిన వ్యక్తులే సమాజం పట్ల తమ బాధ్యతను సక్రమంగా నిర్వహిస్తారని భావించాడు. దాశరథి తమ 'అభినవ దాశరథి శతకం'లో నేటి పాలకుల నియంతృత్వ ధోరణులను నిరసిస్తూ,

"రాజన నీవెగాని, ప్రజలన్ పసులట్టుల వీథిలోన హ
ట్టాజానరించి, వారి రుధిరమ్ములు ద్రావి సుఖించునట్టి యా

రాజులు....." రాజులేనా? అని శ్రీరామునికి మొఱపెట్టుకున్నట్లుగా చెప్పడం సమాజంలోని దుర్మార్గానికి ఒక విధంగా పాలకుల దుష్టనీతి కూడా కారణమని చెప్పడం ధ్వనిస్తున్నది. విశ్వనాథ వారు కూడా తమ "విశ్వేశ్వర శతకం"లో "అన్యాయంబనినంత భగ్గుమని దేహంబంతయున్ మండి కాఠిన్యంబుగొను నాదు వాక్కు....." అన్నప్పుడు కలికి అన్యాయాన్ని ఎదిరించి మనిషిని మందలించి ఋజుమార్గంలో నడిపించాలని చెప్పినట్లయింది. ఒక్కోసారి మందలించే సందర్భంలో మాట కఠినం కావచ్చు, కాని అది మనిషిపై కోపం కాదు, అన్యాయంపై కోపం, ఇటువంటి కోపం కవికి అవసరం. ఆ కోపం వల్లనే శ్రీశ్రీ గారు కూడా తమ "సిరిసిరి మువ్వ శతకం"లో

"ఈ రోజులలో ఎవడికి
నోరుంటే వాడె రాజు, నూరుచుమిరియాల్
కారాలు తెగబుకాయి
స్తే రాజ్యాలేల వచ్చు సిరిసిరి మువ్వా!" అని

ఇప్పటి సమాజంలో మనుషుల ప్రవర్తనను ఎండగట్టారు. వరంగల్లు వాసియైన పల్లారామకోటార్యగారు "వినగదప్ప వెఱ్ఱి వెంగళప్ప" అనే మకుటంతో రాసిన తన శతకంలో "ఆత్మరక్షణ పేర అణ్వస్త్రఖర పీఠినధివసించి.... "ప్రపంచ రాజ్యాధినేతల శాంతినభిలషించడంలోని ఔచిత్యాన్ని ప్రశ్నించారు. కోవెల సంపత్కుమారాచార్యగారు

"బందుల్, ప్రేలెడిమందుపాతరలు, ఒప్పందాలు హత్యల్, వధల్
ముందున్ వెన్కలు కాల్పులన్, ఎదురుకాల్పుల్ చంపుటల్, చచ్చుటల్
ఎందాకీ ప్రజాసేవ సాగునో ప్రజాహింసారిరింసావ్రత...."

మంటూ నేటి సమాజ స్థితిని చూచి వేదన చెందడం కవికున్న మానవతా దృష్టికి నిదర్శనం.

ఆధునిక ప్రపంచాన్ని ఒక వేదికమీదికి తీసుకురాగలిగిన శక్తి వార్తాపత్రికలకుంటుంది. అయితే అవి ఎటువంటిదో చెబుతూ నార్ల వెంకటేశ్వరరావు గారు

"పత్రికొక్కటున్న పదివేల సైన్యమ్ము, పత్రికొక్కటున్న మిత్రకోటి
ప్రజకు రక్షలేదు పత్రికలేకున్న నవయుగాల బాట నార్లమాట!"

అంటూనే "నీతి నియతిలేని నీచుని చేతిలో పత్రికుండెనేని ప్రజకు ముప్పు" అన్న నిజాన్ని నిర్భయంగా చెప్పడం కవి బాధ్యత ఎంతటిదో తెలిపినదానికి తార్కాణంగా భావించవచ్చు. నిజాల్ని నిర్భయంగా చెప్పాలన్న బాధ్యతను తన రచనల ద్వారా చెప్పి ఒప్పించాలన్న విషయం బోధపడుతున్నది.

వేమన్న కాలంనుండే అస్పృశ్యత, వివక్ష కొనసాగి వస్తున్న ఒక సామాజిక రుగ్మత. దాదాపు సమాజం పట్ల, సామాజిక శ్రేయస్సు పట్ల, నిబద్ధత ఉన్న ప్రతి కవీ తమ శతకాలలో దీనిని తీవ్రంగా వ్యతిరేకించారు. ఆధునిక కాలంలో కూడా యీ దుర్మార్గం నేటికీ కొనసాగి వస్తున్న దుస్థితిని చూసి చలించి తమ ధూర్తమానవా"! శతకంలో త్రిపురనేని రామస్వామి చౌదరి గారు.

"పసులను చెట్టుచేమలను, పక్షితతిన్, క్రిమికీటకాదులన్
పుసుకున తాకినంత తలపోయవు స్నానము మాట, కాని మా
నిసినిను తాకినంత తలనిండుగ స్నానము ధర్మమార్గమే?" అంటూ నిలదీయడం త్రిపురనేని వారి సామాజిక దృక్పథానికి అక్షరసాక్ష్యం.

శతకం ఆవిర్భావం నాటినుంచి ఆధునిక కాలం వరకూ ప్రతి శతకకవికి సామాజికమైన బాధ్యత పట్ల నిబద్ధత ఉన్నదనడానికి వారి శతకాలే సాక్ష్యాలు. ప్రతి సమాజానికి అక్షరమే జ్ఞాన భిక్షపెట్టే గొప్ప సాధనం.ఆ జ్ఞానాన్ని సమాజంపరం చేసి మానవ సంక్షేమాన్నే లక్ష్యంగా చేసుకోవాలని బోధించింది తెలుగుశతకం. అందుకే సాహిత్యంలో ఎన్ని ప్రక్రియలు వచ్చినా 'చెడనిది" శతకమొక్కటేనన్న సత్యాన్ని శతకకవులు నిజం చేసి నిరూపించారు. దీనికి వారిలోని సామాజిక దృష్టే ప్రబల కారణమన్న మాట నిర్వివాదాంశమైనమాట.

గన్నమరాజు గిరిజామనోహరబాబు
2.11.501/5, విజయనగర్ కాలనీ
హనుమకొండ- 506009



*"We owe a lot to the Indians, who taught us how to count, without which no worthwhile scientific discovery could have been made."*

- ఆల్బబర్ట్ ఐన్‌స్టీన్

# యక్షగాన వాఙ్మయంలో ప్రజాజీవనం



ఆచార్య పి. ఆర్. హరినాథ్

ప్రజలనుంచి పుట్టుకుని వచ్చి ప్రజా భాషకు పట్టం గట్టిన ప్రక్రియ, యక్ష గానం. ఇది పుట్టింది తెలుగు నేలలో అయినా, తమిళ కర్ణాట దేశాలు దీనికి విహార భూములైనాయి. ఇది ప్రజలకు బాగా సన్నిహితమైన కళారూపం. ప్రజా హృదయాన్ని సాహిత్యం లో ప్రతిబింబింప జేయగలిగిన శక్తి ఉన్న ప్రక్రియ తొలిరోజుల్లో యక్షగానం ఒక పాటగా ఆరంభమై మలి రోజుల్లో ఒక నృత్యరూపకంగా మహా ప్రదర్శన కళగా మారింది. సంభాషణలు, గీతాలతో విస్తరించింది. నాయక రాజుల పాలనలో యక్షగానాలు విస్తారంగా వెలిశాయి. అది యక్ష గానాలకు ఒక స్వర్ణయుగం. క్రమంగా అది ఒక సామాజికమైన సార్వజనీనమైన ఆస్తిగా మారింది. మార్పులకు గురి అవుతూ వచ్చింది కూడా. ఆ సామీప్యత కారణంగానే కొన్ని చోట్ల వ్యాపార స్థాయికీ, మరి కొన్ని చోట్ల ప్రచార స్థాయికీ కూడా పరిణమించింది. ఇది ప్రజాసమూహానికి అతి సమీపం లో ఉండడం దీనికి ఒక కారణంగా భావించవచ్చు.



తంజావూరు రాజుల పాలనలో యక్షగానాలు బాగా ప్రచారం లోకి వచ్చాయి. నాటి పాలకులు కూడా స్వయంగా ఎన్నో యక్షగానాలు రచించారు . రఘునాథ

నాయకుడు రుక్మిణీ కృష్ణ వివాహం గురించి యక్ష గానాన్నిరచించాడు. విజయరాఘవనాయకుడు 24 యక్ష గానాలను రచించాడని ప్రతీతి. కాళియ మర్దనం, విప్రనారాయణ, రాఘవాభ్యు దయం మొదలైనవి ఆయన రచనలు. అలాగే, నాటి కవయిత్రులలో పేరెన్నిక గన్న రంగాజమ్మ మన్నారు దాస విలాస నాటకం రచించింది. మన్నారు దేవుడు హేమాబ్జ నాయికా పరిణయం రచించాడు. మహారాష్ట్ర రాజులు యక్షగానాలకు ప్రోత్సాహమిచ్చారు. కూచిపూడి వారి నృత్యాన్నీ, నాటకాన్నీ కలిపిన ప్రయోగాలలో ఇది ప్రాచుర్యం పొందింది..

## విజయ రాఘవుని వీరవైష్ణవభక్తి

అయితే, దీన్ని పోషించిన రాజులు తమ తమ మత వి శ్వా సాలను కూడా దీనిలో జొప్పించారు. విజయరాఘవనాయకుడు వైష్ణవాభిమాని. ఆనాటి పాలకులలో బాగా ప్రసిద్ధి కెక్కిన వాడు, విజయరాఘవ నాయకుడు. ఆయనకు వైష్ణవమతం పట్ల అలవిమాలిన అభిమానం. ఎంతటి దీక్ష అంటే -యుద్ధ కాలంలో కూడా వీడని పూజ ఆయనది.

ఒకసారి తంజావూరు కోటపై ముట్టడి జరిగింది. ఆజన్మ శత్రువులైన మధుర సేనలు దాడి చేస్తున్నాయి. ఫిరంగులు మ్రోగాయి. కోటగోడ బ్రద్దలైంది. సైన్యం లోనికి ప్రవేశిస్తుంది. అపుడు విజయ రాఘవ నాయకుడు పూజలో ఉన్నాడు. వార్తా హరులు వేగంగా వెళ్లి ఆయనతో చెప్పారు. నారాయణ పూజ లో ఉండి విడిచి రాలేకపోయాడు. " సరే రానీ చూద్దాం లే" అని పూజ కొనసాగించాడు. ఆయన. శత్రువులు లోపలికి వచ్చినా సరే పూజ మానని వీరవైష్ణవభక్తి ఆయనది రాజ్యంలో వైష్ణవులు తప్పు చేస్తే శిక్షించడానికి కూడా వెనకాడే వారట. దీనికి కారణం రాజు కు ఆ మతం పట్ల ఉన్న ఆదరణ. వైష్ణవ దీక్ష అది.

దీనిని గురించి రంగాజమ్మ చేసిన వర్ణనలో కనిపిస్తుంది
"పరమతంబుల నెల్ల నిరసించి ఏ మేటి
వైష్ణవ మతము శాశ్వతము చేసె"

విప్రనారాయణుని కథ అసలు జరిగింది శ్రీరంగం లో. కానీ శ్రీరంగం పాండ్యరాజ సీమలో ఉంది. పాండ్యరాజు తమ విరోధి. అందుకని వైష్ణవ భక్తుడు తన విరోధి సీమలో పుట్టాడని చెప్పడం ఇష్టం లేక,ఆ మహా భక్తుడు మన్నారుగుడి లో పుట్టాడని చెప్పాడు. విష్ణుభక్తుని పట్ల గౌరవాభిమానాలు ఉన్నాయి కానీ,

అంతటి భక్తుడు ఎక్కడో తన శత్రువుకు చెందిన సీమలో పుట్టడం ఏమిటి. అలాంటి వాడు తన రాజ్యంలో పుట్టాలిఅనుకుని,అంతటితో ఆగక పురాణాలనే మార్చాడు రాజు. విప్రనారాయణుడు మన్నారుగుడిలో పుట్టినట్లు చిత్రించాడు.

## అన్నదాన సత్రం

అన్నదాన సత్రం గురించిన యక్షగానం లో నాటి సమాజం స్పష్టం గా కనిపిస్తుంది. నాయక రాజులు ధర్మ సత్రాలను, ముఖ్యం గా అన్నదాన సత్రాలను నెలకొల్పారు. తంజావూరు లో నిరంతరం అన్నదానం జరిగేది. అన్నదానం లో ఎప్పుడూ లోపం జరగరాదు అనీ, అది నిరంతరం సాగాలి అనీ తంజావూరు పాలకులు భావించారు. ఒకవేళ వానాకాలం వచ్చి, జడివాన మూలంగా వంట చెరకు దొరకక పోతే నగరంలో ఉండే పాత మేడలను పడగొట్టి వాటి దూలాలను, మంచాలను వంట చెరకు గా వాడేవారట. అన్న సంతర్పణ మాత్రం ఆగరాదని దీక్షగా చేశారుట.

తంజావూరు సత్రం గురించిన నాటకంలో సత్రం లోని పద్ధతులు, అక్కడకు వచ్చే బ్రాహ్మణుల జీవన విధానం వంటివి చిత్రితమైనాయి . ఇక్కడ -విద్యాదూరులైన వారి గురించి, యజ్ఞోపవీతం మాత్రం ధరించి తక్కిన బ్రాహ్మణ్యాన్ని మరచిన వారి గురించి, అక్కడికి వచ్చిన తిప్పాబొట్లు వంటి వారి గురించి హాస్య రసం తో చిత్రణలు చేశారు. అనాచారం, ఆశపోతుతనం వంటివి ఇక్కడ పదేపదే కనిపిస్తాయి పూజారి వేశ్యలను ఉంచుకోవడం, స్నానం చేయకుండా తడి బట్టతో ఒళ్ళు తుడుచు కోవడం, పూజా విధానాల్లో తారుమారు చేయడం వంటివి కనిపిస్తాయి. ఇవన్నీ వ్యంగ్యాస్త్రాలు. సత్రానికి వచ్చిన తిప్పాభట్లు మొదలైన వారు తమ పాండిత్యాన్ని చూపించుకోవడాని కేదో ఒక మాట చెప్పి వేదం అంటారు.

" తూర్పెత్తు శ్లోకో భవతి గంపమ్ నింపయతి"

" వంటి మాటలు చెప్పి మభ్య పెడతారు. జ్యోతిష్యం చెప్పమని అడిగితే " భరణి పెట్టెలోను మేషం మేకలమంద యందును" ఉంది అని నటిస్తారు. సత్రంలో భోగాల వాళ్ళు, జక్కుల రంగసాని, వెంగసాని మొదలైన వారి వర్ణనలు ఉన్నాయి. సత్రం అధికారిని ఆశ్రయించుకుని అనేకులు ఉండేవాళ్ళని తెలుస్తుంది. అన్నదాన సత్రం లో సోమరులై కాలం గడిపే వారి గురించి హాస్య రససమన్వితంగా చిత్రించారు. భోజనం వేళ కు వచ్చి కడుపునిండా తినే సోమరులు ఉండేవారని తెలుస్తుంది.

## భోజనం ఒక భోగం

నాటి సత్రాలల్లో భోజనం ఒక భోగం లాగే ఉండేదని తెలుస్తుంది అక్కడి తిండి పదార్థాలు, పిండి పదార్థాలను గురించిన వర్ణనలో ఇది బాగా తెలుస్తుంది. వేపుడుకూరలు, ఊరగాయలు, ఊరుబిండ్లు, పిండి మిరియాలు,పుల్లగూరలు, పాయసాలు, కజ్జాయాలు వంటివి ఎన్నో ఉండేవి. అక్కడ భోజనం చేసాక తాంబూలం గూడా ఇచ్చే వారట. మన్నారుదాస విలాసంలో పెళ్లి భోజనాల వివరణలో దాదాపుగా 67 రకాల వంటల గురించిన ప్రస్తావన ఉంది.

రఘునాథాభ్యుదయం లో విజయ రాఘవనాయకుడు చిత్రరేఖ పాత్రను ప్రవేశ పెట్టి తన తండ్రితో సరసాలాడించాడు. దీనితో ఒకింత గాంభీర్యం దెబ్బతినింది. ఇది ఆనాటి వ్యవస్థలో శృంగారం ఒక స్వేఛ్ఛాయుతంగా- కొన్ని కోట్ల విచ్చలవిడి వ్యవహారంగానూ సాగిందని ఊహించే వీలు కలిగిస్తుంది

విజయ రాఘవుని కొడుకు మన్నారు దేవుడు. ఆయన హేమాబ్జ నాయికా పరిణయం రాసాడు. ఇందులో లక్ష్మి జననం, విష్ణువు ఇలాంటివి విజయ రాఘవుని కాలం లో జరిగినట్లుగా చెపుతాడు. దాదాపుగా అన్ని రచనలలో రాజు తప్పని సరిగా కనపడడం జరుగుతుంది . కాలం తో, ఔచిత్యంతో నిమిత్తం లేకుండా ప్రతి కథ లోనూ రాజును ప్రవేశ పెట్టడం కనిపిస్తుంది. రాచరికపు అహంభావం స్పష్టంగా ఇలాంటి చోట్ల తెలుస్తూంది,. అది పురాణమైనా, చరిత్ర అయినా రాజు పాత్ర కనపడాలి.

మోసాలు : కరణాలు చేసే మోసాల గురించి కొన్ని వర్ణనలు సూచిస్తాయి. కరణం వచ్చిన వర్ణణ:

పండ్లు తెరచుకొని పకపక నగుచు పుసుళ్ళ
కండ్లు తెరచుచు కుంటి కరణమువాడు వచ్చెను

కరణం పట్ల జనానికి ఉన్న ఒక నిరసన భావం ఇక్క కనిపిస్తుంది. కరణాల గురించి చాలా చోట్ల వ్యంగ్యాస్త్రాలు ఉన్నాయి

వీలు దొరికితే ఎవరి నైనా సరే మోసం చేయడానికి వెనకాడని వారు కూడా ఉన్నారు. నగరం లో సహస్ర నామ పూజకు సువర్ణ పుష్పాలు తెప్పించిన ఘట్టం ఒకటి ఉంది అక్కడ అసలైన సువర్ణ పుష్పాలను కాజేసి వాటి స్థానంలో మలాము వేసిన పుష్పాలు ఉంచిన సన్నివేశాన్ని ఒక యక్షగానం చిత్రిస్తుంది.

వరుణ జపం చేయించాలని రోమపాదుడు భావిస్తే, దాని కోసం ఇచ్చిన సొమ్మును కాజేయాలని మునులు ఆలోచన చేస్తారు. శాంతాకళ్యాణం లో ఈ చిత్రణ

ఉంది. వరుణ జపం కోసం ఏమి కావాలో వాటిని ఇవ్వుమని రాజు తన మంత్రికి చెప్తాడు. మంత్రి వెళ్లి మునులను అడిగాడు. మునులు ఒక పెద్ద పట్టికను ఇచ్చారు ఇందులో నీ కావు. స్వర్ణ కలశాలు,రజత కలశాలు,బియ్యం,కందులు,పప్పులు,ఉప్పు-ఎన్నో అడిగారు. ఒక ఏడాదికి సరిపడే గ్రాసం అది. అంతా తీసుకుని జపం మొదలు పెడితే ఉన్న మేఘాలే వెళ్లిపోతున్నాయి. అపుడు మునులు మాట్లాడుకుంటారుమనం రాజు దగ్గరికి వెళ్లి ఈ జపాల నుంచి వాన రాదని చెపుదాం. ఇచ్చిన వస్తువులతో అడవికి వెళ్ళిపోదాం అనుకుంటారు. ఈ విషయాన్ని కథకుడు మనతో చెపుతాడు. బౌద్ధ మునుల పట్ల ఉన్న అనుమానాలను ,నాటికి సమాజం లో వారికి ఉన్న అప్రతిష్టను ఈ మాటలు సూచిస్తాయి

## మితిమీరిన హాస్యం

భక్తవత్సల విలాస నాటకం లో హాస్యం లో కొన్ని చోట్ల మితిమీరిన హాస్యపు మాటలు ఉన్నాయి. అవి కూడా కూడా అందరూ మెచ్చేవి కావు. కొన్ని చోట్ల అయితే నాటక వేదికను బట్టి కూడా భాష మారుతుంటుంది. రంగావధాన్లు, సింగావధాన్లు లాంటి పాత్రలలో పాత్రోచిత భాషను ఉపయోగించారు. పండితుల లౌల్యాన్ని చెప్పడానికి కొన్ని చోట్ల వెకిలి మాటలు కూడా ఉన్నాయి. పరమేశ్వర కుంభోదర సంవాదం లో ప్రజా భాష కనిపిస్తుంది. 'వ్యాసవి అంటే యెండ కాలమోయి "అని పరమేశ్వరుడు అంటాడు. ఇక్కడ కూడా తాను మాట్లాడుతున్నది పరమేశ్వరుడితో అన్న స్థాయి మరచి కుంభోదరుడు వెకిలిగా మాట్లాడతాడు

## భాష

యక్షగానాలతో కనిపించే విశిష్ట లక్షణాలలో భాష ఒకటి. 'పూతనాహరణం'లో ప్రజా వ్యవహార భాష కనిపిస్తుంది . అన్నగారులు ( నపుంసకులు) మాట్లాడిన మాటలలో భాష లో సాంకర్యం కనిపిస్తుంది. ఇవన్నీసామాన్యులను ఉద్దేశించినవి.

సల్లాము సల్లామురే జావురు
సళ్ళాము విజయ రాఘవ సాహెబు మేరె
సంగీత లోలారే ఆహా మేరె
సాహిత్య భోజారె సాగర విజయా రే
జగదేక వీరా రే ( విజయరాఘవ కళ్యాణం)

నాటి భాషను గ్రంథస్తం చేసి ప్రజావ్యవహారాన్ని కూడా అక్షరబద్ధం చేశారు.

ఆయిత్తారాలు (ఆదివారాలు), కూత్తు (అన్నం), దినశుద్ధి (ముహూర్తం), జన్నేవారము (ఆదివారము) సంక చక్కిలాలు(శంఖుచక్రాలు), సొల్లు(చెప్పడం), గంత(వక్కలు ఆకులు ఉంచుకునే చిన్న చేసంచి/తిత్తి ) లాంటి మాటలతో పాటు, వ్యాకరణ విరుద్ధమైన మాటలు కూడా ఉన్నాయి. మూర్ఖ పగ, రసపిచ్చి,, ఇష్ట వేలుపు, అతిపగ, దినరోజులు,పుణ్యచేడెలు, వాగ్దిట్ట వంటివి కొన్ని ఉదాహరణలు భక్తవత్సల విలాస నాటకం లో

పరమేశ్వర కుంభోదర సంవాదం లో ప్రజా భాష కనిపిస్తుంది. 'వ్యాసవి అంటే యెండ కాలమోయి "అని పరమేశ్వరుడు అంటాడు.

ఋష్యశృంగుని వద్దకు వచ్చి అతనిని అయోధ్యకు తీసుకు వెళ్లే చిత్రణలో వేశ్యలు ఇలా అంటారు

ఋషి కప్పుకున్న కొప్పున మేన నిండఁగ
మేయించినట్టాలి ఈ బూది ఏంది

ఇక్కడ శైవాన్ని ఎగతాళి చేయడం కనిపిస్తుంది. అసలు రచనలో వేశ్యలు ఎవరో కానీ రఘునాథుని రచనలో మాత్రం వారు వైష్ణవులు. వైష్ణవ ప్రీతి తో పాటు పరమత నిరసన కూడా ఉంది.

'రఘునాథ నాయకాభ్యుదయం" లో నాటి రాచరిక విధానాలు చిత్రితమయ్యాయి. రాజు దినచర్య,, ఆయన అలవాట్లు,విలాసాలు అన్నీ వివరంగా చెప్పబడ్డాయి. రాయవాచకం లాగా ఈ రచన నాటి రాచరిక వ్యవస్థను చిత్రించింది. దానితో బాటు నాటి కళారూపాల గురించి ప్రస్తావన కూడా ఉంది. పేరిణి నృత్యం ఉంది. శశిరేఖ అనే పాత్ర జక్కిణి వినిపించింది. కేళికను నటించిన స్త్రీ ఉంది. అక్కడ జరిగిన వేడుకలలో గుజరాతీ దేశస్తురాలైన వారు కొరవంజి శివలీలలు వినిపించారు. మహారాజు రచించిన కృతులను కొందరు గానం చేస్తున్నారు. సంగీత సాహిత్య కలాపాలు నిరవధికంగా సాగాయి. కమ్మవక్కణం కార్యక్రమం లో రాజు కార్యక్రమాల గురించి వివరాలు ఉన్నాయి.

సభలో లెక్కలను వివరించిన కస్తూరి కీ రంగయ్యకూ మధ్య జరిగిన గొడవ గురించి చిత్రణ లో నాటి సభా పరిస్థితులను ఊహించ వీలుంది. ఇక్కడ కన్నడం లోనూ, తమిళం లోనూ కూడా మాటలున్నాయి. రాజదర్శనానికి ఎక్కడెక్కడి పాలకులూ వచ్చారు. నంద్యాల, కర్నూలు, కడప వంటి ప్రాంతాల నుండి వచ్చి కానుకలను ఇచ్చారు. ఉషాపరిణయం లో రంగాజమ్మ మన్మధుని దాడి గురించి

వర్ణించింది. ఇందులో రాజుల దాడి గురించిన సూచన ఉంది. .విప్రనారాయణుని కథలో మొగలులు, పకీరులు వంటి మాటలు ఉన్నాయి. మొగలుల ప్రస్తావన ఉంది.

## వక్కలాకుల తిత్తి

'సతీపతిదాన విలాసం' లో సత్యభామ శ్రీకృష్ణుని నారదునికి దానం ఇచ్చింది. ఆయన బరువును తూచే సొమ్మునిచ్చి నాథుడిని వెనక్కు తీసుకోవాలి. సత్యభామ తన వద్ద ఉన్న సొమ్మంతా ఉంచింది. కృష్ణుడు తూగలేదు. అప్పుడు ప్రజలంతా తమ వద్ద ఉన్న వస్తువులను ఉంచారు. చీరలు, రవికలు వంటివి కూడా ఉంచారు. ఈ సందర్భం లో వక్కలాకుల తిత్తి నీ,మొలను పెట్టిన పొగచుట్టనూ కూడా పోగొట్టుకుని ప్రజలు నిలబడ్డారు.

రవికలు చీరలు పోయె తందనాన
కృష్ణుని రక్కసి ముని విడువాడాయె తందనాన
వక్కలాకుల తిత్తి పోయే తందనాన
మొలను బెట్టిన పొగచుట్ట పోయే తందనాన

ఈ సందర్భం లో బలరాముడు కరణం తో అన్నాడు

వినరా కరణీకుడా, ఎవరి సొమ్ములు వచ్చెను ఎవరెవరి సొమ్ములు రాలేదు గణితము సూడరా

అపుడు రుక్మిణి వచ్చి ఒక తులసి ఆకుతో కృష్ణుడిని తూచ గలిగింది. ఆ తర్వాత జనం తాలూకు సొమ్మును వాళ్లకు పనిచేశారు.

జలక్రీడలు లో శ్రీకృష్ణుడు పప్పు తిమ్మక్క కట్టుకుని ఉండే గంతను దోచుకున్నాడు. ఆమె వక్కలాకుల తిత్తి పోయిందనీ,మొలను చెక్కిన పొగచుట్ట పోయిందనీ ఏడుస్తుంది.

ఇక్కడే వేటలో వైద్యం కూడా ఉంది. రంగప్ప అనే వాడిని ఎలుగొడ్డు పట్టుకుంది. దానికి వైద్యం ఏమిటి? "శొంఠి తెచ్చి నమిలి వాని చెవిలో ఊదితే" మూర్చ తేరుకుంటాడని వేటగాళ్లు చెప్పారు.

వళ్ళీ కళ్యాణంలో శ్రీమంతుడు అనే పాత్ర కుమారస్వామిని తీసుకుని పెళ్లికి తంజావూరు వస్తాడు. ఇక్కడ వేట వర్ణనలు ఉన్నాయి.. అప్పటికి తుపాకీ ప్రవేశించింది కుమారస్వామి తో వేటగాళ్లు అంటారు

"ఒక్క తుపాకీ తోనే యేయుడు జూడుండా స్వామీ"

సీతా కళ్యాణం లో పట్టణాన్ని సింగారించడానికి వచ్చిన తలవరులు కత్తులు, తుపాకులు కూడా తెస్తారు.

ఇక్కడ తలవరుల వర్ణన :

"అరిగెల కత్తులును విండ్లును
మెరయు తుపాకులు దుడుములును
కరముల బూనుకొని తలవరు
లరుదెంచిరి కడు వింతగనూ"

రాముడి పెళ్ళి గురించి జనకుని నుంచి ఉత్తరం వచ్చింది. అపుడు దశరథుడు ' ఎవర్రా మన వ్రాయస గాళ్ళు. -కమ్మ చదువు" అన్నాడు. కమ్మవక్కణాలగురించి యక్షగానాలు తరచూ పేర్కొంటాయి.

ఎక్కడో పౌరాణిక యుగంలో జరిగిన వాటిని తంజావూరులో జరిగినట్లు చెప్పడం చాలా యక్షగానాల్లో కనిపిస్తుంది. దీనితో ఆ కథ అంతా తమ సమకాలీన కథ అనిపిస్తుంది. సామాజికంగా అది మరింత దగ్గర అవుతుంది.

## కరణాలు

గ్రామ కరణాలు ఉండేవారు. ఆ కరణాలకు ఒక పెద్ద ఉండే వారు. వారిని సంప్రతి కరణాలు అనే వారు. కొన్ని గ్రామాలను కలిపి లేదా రాజ్యాన్ని కొన్ని భాగాలుగా చేసి కానీ దాని ఆదాయ వ్యయాలకు సంబంధించిన లీకలను చూసే పెద్ద కరణాలను సంప్రతి కరణాలు అన్నారు. ప్రజలకు వీరి పట్ల ఉన్న నిరసన భావం చాలా యక్షగానాలలో కనిపిస్తుంది.

యక్ష గానాలతో ఉన్న ఒక గొప్ప లక్షణం ఏమిటంటే, నాటి కాలాన్ని అక్షర బద్ధం చేసింది. కొన్ని కల్పనలు ఉంటే ఉండవచ్చు. కానీ ప్రజల అలవాట్లు, వారు ఉపయోగించిన సామగ్రి,వంటలు, ఆభరణాలు వంటివి చిత్రిస్తున్నప్పుడు ఒక విలువైన విషయ సంభారం లభిస్తుంది.

## సంగీత వాయిద్యాలు

ఆనాటి సంగీత వాయిద్యాల్లో ఇవి కొన్ని: వీణె, మురళి, రబాబు, తంబురా, కిన్నర, ముఖ వీణ, రావణ హస్తము, చెంగు, దండె, డక్కి మొదలైనవి నాట్యబంధాలలో పదచాళి, పేరణి, జక్కిణి ,కొరవంజి, గుజరాతీ, దేశి, కేళిక,శివలీల

మొదలైనవి. ఉత్సవాలలో వాడిన వాద్యాలు చిరుత మద్దియలు,కాహళలు, భేరులు, ఢక్కాలు, ధవళ శంఖాలు మొదలైనవి, ఉన్నాయి.

ఆనాటి స్త్రీలలో ఉన్నత పదవుల్లో ఉన్నవారు కూడా ఉన్నారు రాజుకు పరిపాలనలో తోడునిలిచిన రాయసం పాత్ర వహించిన వారు కూడా ఉన్నారు. రాజగోపాల విలాసం లో తోయజముఖి అనే రాయసం స్త్రీ గురించిన ప్రస్తావన ఉంది. రాజగోపాల స్వా మి రథోత్సవం జరిగిన సమయంలో ఆమె విజయ రాఘవనాయకుని పక్కనే ఉంది. ఆమెకు రాజు శ్రీముఖాన్ని అందించి గౌరవించాడు. హేమాబ్జనాయికా స్వయంవరం లో ఒక స్త్రీ కమ్మ వక్షణం చదువుతుంది.

కొలువుకూటంలో వేశ్యలకు చాలా గౌరవం ఆదరణ ఉండేది. కొన్ని సార్లు ఆమాత్రపు గౌరవం కవులకూ,పండితులకూ కూడా ఉండేది కాదు నాయకరాజులు భోగ ప్రియులు.

## లంచగొండి తనం

లంచగొండి తనం,ఆశ్రిత పక్షపాతం బాగా ఉన్నాయి. సత్రంలో భోజనాల విషయంలో కూడా అక్కడ ఉండే అధికారి తన బంధువులను ముందుగా భోజనానికి పంపుతాడు. అలాగే రాజు దర్శనం పొందడానికి, ఆస్థానం లో ప్రవేశించడానికి కూడా లంచాలు ఇవ్వాల్సిన పరిస్థితి కనిపిస్తుంది. ప్రజల సొమ్ముకు భద్రతా లేదు. దాన్ని కొల్లగొట్టడానికి అధికారులు కుతంత్రాలు పన్నేవారు.

మన్నారు దాస విలాసం లో రాజదర్శనం కోసం ఒక బ్రాహ్మణుడు వస్తాడు. దానం అడగడానికి ఆయన వస్తాడు. అయితే లోపలి ప్రవేశించడం అంత సులభం కాలేదు. సొరకాయ, గానుగ పిండి లంచం ఇస్తే తప్ప అతనికి లోనికి ప్రవేశం దొరకలేదు.

## వేష భూషణాలు

నాటి బ్రాహ్మణులు,జ్యోతిష్యులు, చెంచులు, ఎరుకలు వంటి వారి వేష భూషణాల గురించి వివరమైన చిత్రణ కనిపిస్తుంది క్రీడలు,నృత్యాలు, ఆయుధాలు, ధాన్యాలు గురించిన వివరాలు ఉన్నాయి. శంకర పల్లకి సేవా ప్రబంధం లో ఆభరణాలు అలంకార సామగ్రి గురించిన ప్రస్తావనలున్నాయి

మురువు ముత్యంబు ముంగర
మోహన మాలికలు
మెరుగు బన్నసరములు

మెన్నూరు తీగెలు
సరిపెణెలు పతకములు
సరసహారములు చిరుత కెంపుల కుతి కంట చెలగా

ఇత్యాది వర్ణనల్లో వాటిని గమనించ వీలుంది

**ఆటలు**

అచ్చనగండ్లు, పగడసాల, వామనగుంటలు, సయ్యాట, సొగలాటవంటి, ఆటలు, అమ్ములు, అరిగెలు, ఈటె, వుం టవిల్లు, పట్టాకత్తి, విచ్చుకత్తి, తుపాకీ, లకోరిమొదలైన ఆయుధాలు, చిందు, కొరవంజి, గుజ్జరి, పూయాలి, మైసిరి వంటి నృత్యాలు, సుబేదారు, అమరనాయకులు, అవసరము వారు, కేకైజీతము వారు,కారణము, బారాబరీ, బొక్కసము వారు, రాయసము వారు మొదలైన ఉద్యోగులు ఈ రచనల్లో కనిపిస్తారు.

"వీర తెలంగాణ "-అనే యక్షగానాన్ని శ్రీ సుద్దాల హనుమంతు, శ్రీ సుద్దాల అశోక్ గార్లు రచించారు. ఇందులో భూస్వాముల పెత్తనం, తెలంగాణ జనజీవనం చిత్రితమైంది. యక్షగానం సామాన్య ప్రజలను ఆకర్షించిన ప్రక్రియ. ఒక పాత్ర ప్రవేశం, ఆ పాత్ర ప్రవర్తన వంటి ఎన్నో అంశాలలో యక్ష గానం జన జీవితానికి చేరువ అయింది.

ఇది సామాజిక చైతన్యం కలిగించగలిగిన ఒకబలమైన కళారూపం



*" After the conversations about Indian philosophy, some of the ideas of Quantum Physics that had seemed so crazy suddenly made much more sense."*

- హైసన్‌బర్గ్

# చాటువులు, సమాజ ప్రయోజనాలు

డా. పణతుల. రామేశమ్
98668 83019

చాటువు' - అంటే ప్రియమైన మాట. ఇది అచ్చమైన సంస్కృత శబ్దం. చాటువు తత్సమరూపం దీన్నే 'చదర', 'చాప' - అంటూ ఉచ్చరిస్తూ ఉంటారు. మన పెద్దలు మనకు మిగిల్చిన 'చద్దిమూటలు' ఈ చాటుపద్యాలు. చాటువులు విజ్ఞానానికీ, వినోదానికీ, ధారణకు ఆటపట్టు వంటివి. 'వాక్యం రసాత్మకం కావ్య' మన దానికి ఈ చాటుపద్యాలు చక్కని నిదర్శనం. ఈ 'చాటు' శబ్దానికి 'ఆంధ్రవాచస్పత్యం'లో ' అప్పుడప్పుడూ కవి, ఆశువుగా చెప్పిన పద్యములు' - అనే అర్థమిచ్చారు.

ఉబికి వచ్చిన భావాన్ని పద్యంగా మలచడమే చాటువు. సామెతలకు ఉన్న సంక్షిప్తత, సూటిదనం, జనప్రియత్వం, స్ఫూర్తి, ప్రాచుర్యము ఇత్యాదులన్నీ చాటు పద్యాలకు ఉంటాయి. అన్ని నిఘంటువులూ ఇదే అర్థాన్ని స్ఫురింపజేస్తున్నాయి.

చాటు పద్యములను చాలదా ఒక్కటి ' అని వేమన అన్నట్లు చాటుపద్యం ఎప్పటికీ అందంగానే ఉంటుంది. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 'చాటుపద్యమణిమంజరి', దీపాల పిచ్చయ్య శాస్త్రిగారి 'చాటుపద్య రత్నాకరము'– అను గ్రంథములు - చాటువుల గొప్పతనాన్ని గుర్తించడానికి మూల భూతములు.

రామాయణావతరణానికి దారితీసి 'మా నిషాద'శ్లోకం చాటువే. 'శ్లోక శ్లోకత్వమాగతః' చాటుపద్యాలకు కర్తృత్వ నిర్ణయం చాల కష్టం. ఒకవైపు గంగా సమాన మహాకావ్యాలూ, మరోవైపు నదీనాదాల్లాగా చాటుపద్యాలూ ఆవిర్భవించాయి. జానపదగేయాల్లాగా చాటు పద్యాల్లో కర్త పేరు గుర్తించడం కష్టమనుకొన్నాము గదా! 'చేత వెన్నముద్ద'..... పద్యకవిని గుర్తించడం కష్టం. వాసనలేని పూవు... పద్యం కూడా అట్టిదే.

చాటు పద్యాలు చెప్పిన పూర్వకవుల్లో వేములవాడ భీమకవి, శ్రీనాథుడు, తెనాలి రామకృష్ణుడు, అందం సూరకవి ముఖ్యులు. ఆశువు కంటే చాటువుకు ఆయుష్షు ఎక్కువ. ఈ రుచికరంగా కాని వస్తువు రుచికరంగా అందించడం ఈ చాటువు యొక్క లక్ష్యం.

అందఱివే అర్థమయ్యేలా, భావాల్ని పొందుపరచి తమ ప్రజ్ఞాపాటవాలను చూపిస్తూ, శాశ్వతంగా ప్రజల హృదయాంతరాళల్లో నిలిచి పోయేలా వారి ఆలోచనలను ప్రభావితం చేసేవి చాటువులు. కవులకు కలిగే గుండె పొంగువే అనగా కోపమో, తాపమో, అనురాగమో, ఆనందమో, అవహేళనమో, భక్తి భారమో కలిగినప్పుడే అప్పటికప్పుడు తమకు కలిగిన అనుభూతులు పద్యాలుగా అవతరించాయి. అవే చాటువులుగా ప్రఖ్యాతినందాయి.

ఇక ముక్తకాలయిన చాటువుల్లో అనేక శాస్త్ర సంపద ఉన్నది. మహాకవులు తమ కావ్యాలలో చెప్పలేనివి కొన్ని ఉంటాయి. కావ్య చాటువులలో ఈ విషయాలు అర్థముకావు కనుక ప్రతిభ చిమ్ముకొస్తుంది. కాటయవేముని కీర్తిస్తూ ఎవరో చెప్పిన పద్యమిది.

కం॥వెలయాలు, శిశువు, నల్లుఁడు,
నిల నేలిక, యాచకుండు - నేఁరు ధరలోఁ
గలిమియు, వేమియుఁదలఁపరు
గలియుగమునఁ గీర్తికామ! కాటయ వేమా!

వెలయాలు, శిశువు, అల్లుడు, రాజు, యాచకుడు ఈ ఐదుగురూ కూడ ఉందా? లేదా? ఆలోచించకుండా అడుగుతూనే ఉంటాడు. - అన్నపుడు వారి వారి బాధ్యతా రాహిత్యం మనకు స్ఫురిస్తుంది. సంఘంలో వారి వారి బాధ్యతను గుర్తుచేస్తూ ఎంతో ప్రభోధాత్మకంగా ఉందీచాటువు.

అట్లే ఒకనాటి వర్షకాల సంధ్యా సమయంలో రాయలవారితోపాటు, రామకృష్ణకవి కూడా వెళ్ళాడట. ఇంతలో కప్పలు బెకబెకలాడటం విన్న రాయలు, ' రామకృష్ణకవీ! ఈ కప్పల బెక బెకలను పద్యంలో చంధించు' అన్నాడట.

'అదెలా రాజా?' అంటే ఐతే నీకు దేశ బహిష్కరణే' అన్నాడట రాయలు. ఇక అప్పుడు మరో మార్గంలేక.

చం॥ "ప్రమథ గణేశ! వర్షములు
పట్టగ, రాత్రులనీట ఝుంఝుణాం,

ఞమ ఞమ, ఞామ్యఞాం, ఞమఞ
ఞామృఞ ఞామృఞఞామృఞాం మృఞాం,
ఝమకిటు ఝంకృతం, కిటుకు
ఝంకృత ఝాంకృత ఝాంకృతాం కృతాం
కిమకిటు కిఙ్ఝు కిఙ్ఝుమని, కింకిణి
కింకిణి, కింకిణీం కిణిం
ధిమతకు ధిక్కు ధిక్కు, తకిధిక్కని
మ్రొగ్రెను భేషణవముల్"

అన్నాడట. ఇదే ధ్వన్యాను కరణ చాటువనబడుతుంది.

అట్లే ధూమపానం వల్ల కలిగే అనంతమైన కష్టాలు గూడ చాటువుల్లో ఒదిగాయి. చూడండి. ఇది గూడ సమాజానికి ఎంతగానో ఉపకరిస్తుంది.

పొగత్రాగనివాడు దున్నపోతై పుట్టుక 'అనేవాడికి - అయ్యా! హెూమగుండము లోని పొగ . అని సందేశమిస్తున్నాడు- అట్లే ఈ పద్యం కూడా చూడండి.

చం॥ ధూమపానమునఁ బ్రాప్తములేఁ
బదమూఁడు చేటులున్,
మొదలు ధనంబువోవుట, నపుంసకుఁడౌట,
విదాహమౌటయున్,
వెదకుబానెల్లవారలను వేడుట,
తిక్కట; బొక్కుటల్; రుచుల్
వదలుట; కంపువేయుట; కళత్
తొలఁగించుట;ఆ వర్మ పట్టుటల్,
పెదవులు నల్లనై చెడుట,
పెద్దకులోగుటు...
బట్ట కౌలుటల్".

సరిగ్గా ఈ 13 చేటుల్లా కూడా, నిజంగా పొగత్రాగే వాడే వ్రాసి ఉంటాడు సుమా! ఏతావతం పొగత్రాగడం - అనేది తనకు తానుగా కొనితెచ్చుకొనే యహాహానిగా అభివర్ణిస్తూ, సమాజంలో పొగత్రాగడం మానుకోవాలి- అనే సందేశాన్ని ఇందులో పొందుపరచాడు మహాకవి.

ఇంక ఏకాక్షరాలతో చాలా చాలా చాటువులే ఉన్నాయి. అయితే ఒక చక్కని చిన్న వాక్యం - నెమలికా?; ఆ = ఉంటుందా? కాకి ఈక; కాకికే ఉంటుంది గాని,

నెమలికి ఉండే అవకాశం లేదు కాకి + ఈక; కాకికి కాక, కాకికి అని అర్థం.

అలాగే తెలుగులో చమత్కారాలు చూడండి. కామా పెట్టడం - అంటే నిలిపి చదవడంలో చమక్కులు కనిపిస్తాయి.

ఆ॥ వె వంగతోట నుండు; వరి, మళ్ళతోనుండు;
జొన్న, చేతనుండు; చోద్యముగను;
తలుపు, మూలనుండు; తల, మీఁద నుండును;
సరి జవాబు అందె అరసి చెపుతా.
రంగంతోడేలోను; వరి - మడిలోనో, -

జొన్న - చేతలోను; తలుపు - ఒక మూలను; తలపైనను ఉండును అని తాత్పర్యము - ఇది ఒక చమత్కార చాటువు. అట్లే

ఆ॥ వె॥ కాండ నుండు నెమలి; కోరిన పాలిచ్చు
పశువు; శిశువుతోడఁ బలుక్ నేర్చు
వనిత; వేదంబుల వల్లించు చుండును
బ్రాహ్మణుండు; కాకి, పలలముఁదిన

ఈ పద్యంలో నెమలి కొండలో ఉంటుందనీ, పశువు కోరిన పాలిస్తుందనీ; వనిత శిశువుతో పలుక నేరుస్తుందో; బ్రాహ్మణుడు వేదాలు పఠిస్తూ ఉంటాడనీ; కాకి మాంసాన్ని తింటుందనీ అన్వయించుకోదగిన మరొక చమత్కార చాటువు. భాషా నైపుణ్యాలను పెంపొందించుకోవడంలో ఇవి ప్రత్యేక పాత్ర వహిస్తాయి.

ఇక ధూర్జటి రాయలవారి కొలువులో ఉన్నట్లు ప్రతీతి. శ్రీకాళహస్తీశ్వర శతకము; శ్రీ కాళహస్తి మాహాత్మ్యము - వీరి రచనలు.

ఒకసారి వీరిని గూర్చి వ్యంగ్యముగా రామకృష్ణకవి - "స్తుతి మతి యైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల, గల్గె నీ యతులిత మాధురీ మహిమ...? " అని మరొక కవిని ప్రశ్నిస్తే.... ఆయనంటాడు. "హాతెలిసెన్... భూవనైక మోహగోద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపహార సంతత మధురాధరోదిత సుధారసధారలఁ గ్రోలుటంజోమీ!" అన్నారని ప్రతీతి.

భావము : చక్కని కవితా శక్తి గల ధూర్జటి మహాకవి కైతలో నీ అతులిత మాధురీ మహిమ ఎలా వచ్చింది? అని ఒకరంటే- మరొకరు అంతా అర్థమైంది; ధూర్జటిగారు వారవనితల అధారాలు గ్రోలుతుంటే ఆ అమృతంలోని మాధుర్యం

ఇలా తొణికిసలాడుతోంది. - అన్నారని ఒక చిన్న కథ. ఈ పద్యం కూడా సుప్రశస్తమైన చాటువుగా ఆంధ్రదేశంలో ప్రసిద్ధి నొందింది.

ఇక చిన్న చిన్న కథల ద్వారా చాటువులు రూపొందినపుడు గమనించండి.

ఒకసారి ముక్కు తిమ్మనగారు కూడ ఉయాలలో ఊగుతుంటె రామకృష్ణకవి విచ్చేశాడట. అక్కడికి, రామకృష్ణకవికి నోటినిండా తాంబూలం ఉంటే, తాతా ఊతునా? అన్నాడట. ఇంతలో తిమ్మనకవి మీద ఉ మ్మేశాడట. అప్పుడు తిమ్మనగారు ఒక్క తన్ను తన్నాడట. పాపం రామకృష్ణకవికి ఒక పల్లు రాలిపోయిందట. తేలుకుట్టిన దొంగలాగా తెనాలివారు ఇంటికెళ్ళి, ఒక దుప్పి కొమ్మును చాది పల్లుగా అమర్చుకున్నాడట! ఈ క్రింది చాటువులో పై విషయాన్నే గమనించండి.

||ఊ|| ఆ రవి, వీరభద్రాచరణాహలు
మల్లిన బారసినోటికిన్
నేరఁడు; రామలింగకవి
నేరిచెఁబో మన ముక్కు తిమ్మన
క్రూర పదాహతిన్ దెగిన
కొక్కిరి పంటికి దుప్పికొమ్ము
త్తారచియించినాఁడు; రవి గానని
చోఁగవి గాంచు నెయ్యేడన్.

అనే పద్యం మనకు వివరిస్తుంది.

ఇందులో హేళన చేయడం ఎవరికీ మంచిది గాదు అనే సందేశం మనకు అర్థమౌతుంది.

ఒక్కసారి చాటుకవిగా ప్రసిద్ధి వహించిన శ్రీనాథుడు అటుగా వెళ్ళుతుంటే ఒక గాడిద ఎదురైందట. వెంటనే ఆయన

"గాడిద! నీవునుం గవివి గావు గదా! అనుమాన మయ్యేడున్" అన్నాడని లోకంలో ఒక ప్రచారం ఉంది. ఆ కాలంలో అందరూ, కవులూ - అందరూ పండితులూను.

ఇక అదే శ్రీనాథుడు పలనాడు నేఁటి ప్రకాశం జిల్లాకు వెళ్లినపుడు అక్కడి జొన్నలతోడి అన్నం తినలేక

కం॥ జొన్నకలి, జొన్నయంబలి
జొన్నన్నము, జొన్న విసరు, జొన్నలె తప్పన్
సన్నన్నము సున్న సుమీ!

పన్నుగ | బలనాట నున్న ప్రజలందఱకున్. అన్నాడంటూ ఆశువుగా ఒక చాటువు చెప్పాడట. అంతేగాదు - మార్కాపురం ప్రాంతానికి వెళ్ళినప్పుడు చాలండి.

ఆ॥ వె॥ చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవుళ్లు
నాగులేటినాళ్ళు నాపరాళ్లు
సజ్జ, జొన్న .........సర్పంబులునుదేళ్ళు
పల్లెనాటి సీమపల్లె టూళ్ళు - ఇది మరొక చాటువు. -
ఇక నల్లిని గురించి ఎవరు చెప్పారో గాని

కం॥ శివుడద్రిని వసియించుట
రవి చంద్రులు వింట నాంట; రాజీ వాక్షం
రవిరళ ముగతేఘునిపైఁ
బవళించుట - నల్లి బాధ పడలేక సుమీ!

అన్న పద్యం అందరూ తెలిసిందే.

ఇక చమత్కారమైన పొడుపుకథల పద్యాలు చూడండి -

1) ఆ॥వె॥ చలనశక్తిగలదు; జంతువుగా దడి
చేతు లెపుడుఁ ద్రిప్పు శిశువు కాదు;
కాళ్లు లేవు సర్వ కాలంబు నడచును
దీని భావమేమి? తిరువలేశ! (జవాబు :- గడియారం)

2) ఆ॥వె॥ కాళ్ళు రెండు గలవు; కాని... జుడుగాడు
గోరు గల్గి యెదుటివారి నరచు!
గాలిమేసి లెస్సగా నరుమోయును
దీని భావమేమి? తిరుమలేశ! (జవాబు : సైకిలు)

3) ఆ॥వె॥ మనుజుడేమికాదు; మాటలాడగనేర్చు
పాటగాడు కాదు పాడనేర్చు;
కథలు పెక్కు నుదువు కాదు జేజయ్యాము
దీని భారమేమి? తిరుమలేశ! (జవాబు : - రేడియో)

**ఇలాంటివి మెదడుకు మే..త లాంటి పద్యాలు. చూడండి.**

**ఆ॥వె॥ కరయు గంబు గలదు చరణంబులా లేవు**
**కడుపు నడుము వీపు మెడయు గలవు**
**శిరహులేదుగాని నరుల 'బట్టుకమ్రింగు**
**సొగసు.. గూర్చుదుని సొగసు; గను..డి! (జవాబు :- చొక్కా (షర్టు))**

**ఆ॥వె॥ ఒడలి శిండకన్నులుండు నింద్రుడగాడు**
**కంఠమునకు నలుపు కాదు శివుడు**
**ఫణుల(బట్టి చంపు - పక్షీంద్రుడు కాడు**
**దీని భావమేమి? తిరుమలేశ! (జవాబు :- నెమలి)**

**ఈ రకంగా చాటువులు సామాజికంగా, దైహికంగా, మానసికంగా మానవుని అలసటలను పోగొట్టి మంచి మిత్రునివలె ఆదుకొను అమూల్య పద్యరత్నములని మనము ఉటంకించ వచ్చును.**



*"I do not want that our loyalty as Indians should be in the slightest way affected by any competitive loyalty whether that loyalty arises out of our religion, out of our culture, or out of our language.*
*I want all people to be Indians first, Indian last, and nothing else but Indians."*

**- డా. బి.ఆర్. అంబేద్కర్**

# యువతకి ఆదర్శం గాంధీ తత్వం



డా.శేఖర్ కుట్టు

మానవ జీవితం లో కౌమార యౌవన దశలు కీలకమైనవి. ఆ దశలలోనే వ్యక్తి యొక్క మూర్తీమత్వం నిర్మితమౌతుంది. అదే కాలంలో ఆలోచనా సరళి, నడవడికల్లో మార్పులు సంభవిస్తాయి. ఆ సమయంలోనే సమాజం పట్ల అవగాహన, ధిక్కార స్వభావం, స్నేహసంబంధాలు అంకురించడమో లేక బలపడడమో జరుగుతుంది. ఈ దశలోనే ఒక సగటు యువతీ లేదా యువకుని జీవన గమ్యం, దిశ ప్రస్ఫుటంగా కనబడతాయి. ఎందరో మేధావులు, సామాజికవేత్తలు, మనో వైజ్ఞానికులు యువతపై పరిశోధనలు చేసి విస్తృతమైన సమాచారాన్ని, శాస్త్రీయమైన దృష్టికోణాలను మనకందించారు. అయితే మహాత్మ గాంధీ యువతను అధ్యయనం చేసినట్లుగా బహుకొద్దిమందే చేయగలిగారు. యౌవనం లో ఎదురయ్యే మానసిక ఒత్తిడి, మానసిక సంఘర్షణ, అంతర్మథనం, మంచి చెడుల మధ్య తారతమ్యాన్ని గుర్తించడంలో వైఫల్యం, విలువల పట్ల అవగాహన లేమి ఇత్యాది అనుభవాలను గాంధీజీ తన యౌవన దశ నుండే సునిశితంగా పరిశీలించి కౌమార యౌవన దశాలపై నిర్దిష్టమైన అభిప్రాయాలను ఏర్పరచుకొని తదనుగుణంగా యువతకు అమూల్యమైన సందేశాన్ని ఇవ్వగలిగారు. ఆయన దేశ యువతకు చేసిన దిశా నిర్దేశం, ఇచ్చిన సలహాలు, చూపిన మార్గం నేటికీ నిత్యనూతనంగా భాసిల్లుతున్నాయి.



గాంధీజీ మూడుపదుల వయసు లోపలే ఖండాంతర జీవితాన్ని గడిపారు. విభిన్న సంస్కృతుల మేళవింపును ఔపాసన పట్టారు. దక్షిణ ఆఫ్రికాలో తీవ్రమైన వర్ణ వివక్షకు గురికాబడ్డారు. పిన్న వయసులోనే భారతీయ సంతతి వారిని సమీకరించి వివక్షకు వ్యతిరేకంగా ఉద్యమానికి సారధ్యం వహించారు. ఈ అనుభవాలు ఆయనను ఒక రాజీ పడని ఉద్యమకారుడిగా, సంకల్ప బలమే ఊపిరిగా ముందుకు సాగే యోధునిగా తీర్చిదిద్దాయి. అదే విధంగా యువత ఉద్యమాలలో పాల్గొంటే అత్యుత్సాహం, దుందుడుకు చర్యల వలన అప్పుడప్పుడూ ఉత్పన్నమయ్యే జటిల సమస్యల గురించి కూడా ఆయనకు స్పష్టమైన అభిప్రాయాలుండేవి. అందుకే ఆయన యువతకు ఇచ్చే సందేశాల్లో జాతీయోద్యమం కన్నా జ్ఞానార్జన, సహనశీలత, పెద్దల పట్ల గౌరవాన్ని చూపడం లాంటి విషయాలను తరచుగా ప్రస్తావించారు. ఒక యువతి లేక యువకుడు తన పరిధిలో దేశానికి చేయగలిగే సేవను, జాతి నిర్మాణంలో పోషించదగ్గ పాత్రను మూల్యాంకనం చేసి యువతను కార్యోన్ముఖులను చేయడానికి ఆయన నడుం కట్టారు.



విద్య, జ్ఞానార్జన, క్రమశిక్షణ, అనియత విద్య, సాంకేతిక శిక్షణ లాంటి విషయాలపై బాపూజీ వ్యక్తపరచిన అభిప్రాయాలు జగద్విఖ్యాతమయ్యాయి. ఆయన ఆలోచనలు, ఆచరణ మార్గాలు పూర్తిగా ప్రగతిశీలకమైనవని చెప్పలేము. కానీ వాటిలో చాలా మటుకు క్షేత్ర స్థాయిలో ఆచరణాత్మకమైనవని ఖచ్చితంగా చెప్పవచ్చును. యువత దేశానికి ఆత్మ వంటిదని ఆయన అభిప్రాయపడ్డారు. విద్యకు వయోపరిమితి ఉండరాదని వయోజన విద్య వ్యక్తి ఎదుగుదలకు, దేశ ప్రగతికి ఎంతగానో ఉపకరిస్తుందని, వృత్తి విద్య కు ప్రాధాన్యతనివ్వాలని 1920 ల లోనే సెలవిచ్చిన దార్శనికుడాయన. నేడు ప్రభుత్వాలు, మేధావి వర్గం నిరంతరం నొక్కివక్కాణిస్తున్న నైపుణ్యాభివృద్ధి, శిక్షణ గురించి దాదాపు శతాబ్దం క్రితమే ప్రస్తావించిన మేధావి గాంధీజీ. యువకులు నైపుణ్య శిక్షణ పొంది ఆ నైపుణ్యాలను గ్రామీణ ప్రజలకు బదిలీ చేయగలరన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. యువత శాస్త్ర సాంకేతిక విజ్ఞానాన్ని ఒడిసిపట్టుకుని ఆధునికత సాంప్రదాయానికి వారధి లా మెలగాలని ఆయన కోరారు. అదే విధంగా యువత సామాజిక మార్పుకు ప్రతినిధిగా ఎదగాలని కాంక్షించారు.

గాంధీజీ క్రీడాకారుడు కాకపోయినా క్రీడల విలువను బాగా ఎరిగిన వారు. క్రీడా ఔత్సాహికుడు. దక్షిణాఫ్రికాలో భారతీయ సంతతి వారితో ఫుట్ బాల్ సంఘాన్ని స్థాపించి భారత క్రీడాకారులకు, ప్రేక్షకులకు వర్ణ వివక్షపై అవగాహన కల్పించేవారు. కానీ జాతీయోద్యమానికి నాయకత్వం వహిస్తున్న రోజుల్లో ఆయనే ఫుట్ బాల్ మోజులో పడి యువత - ముఖ్యంగా బెంగాలీ యువత - స్వాతంత్రోద్యమాన్ని అలక్ష్యం చేస్తున్నారని ఆ క్రీడను నిరుత్సాహపరిచారు. ఎప్పుడు, ఏ విధంగా, ఏ కార్యక్రమాన్ని చేపడితే జాతీయోద్యమానికి ప్రయోజనకరమో, యువతయొక్క భాగస్వామ్యం సాధ్యమవుతుందో ఆయనకు అవగతమైనట్లు మరే నాయకునికి కాలేదు, కాబోదు. ఎందుకంటే యువత యొక్క ధోరణులు, ఆలోచనలు, ఉద్రేక స్వభావం పట్ల ఆయనకున్న అవగాహన పరిపూర్ణమైనది. ఆ అవగాహన వలనే ఆయన లక్షలాదిమంది యువతీ యువకులను హింస వైపు మళ్లకుండా జాతీయోద్యమంలో పాల్గొనేటట్లు చేయగలిగారు.



హింసా విధానాన్ని తృణీకరించాలని ఆయన చేసినన్ని సార్లు విజ్ఞప్తిని మరే ప్రపంచ నాయకుడు చేయలేదు. హింసకు, ప్రతి హింస సమాధానం కారాదని జాతీయోద్యమకారులు హింసా విధానాన్ని చేపడితే పోయేవి భారతీయుల ప్రాణాలేనని, నష్టపోయేది మన దేశమేనని పలు మార్లు హెచ్చరించేవారు. 'యంగ్ ఇండియా' లో వ్రాస్తూ .... స్వాతంత్ర్యమనే దేవాలయం, సహనం, వివేకవంతమైన కార్యాచరణను అభిలషిస్తోందని స్వాతంత్ర్యం పట్ల తన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. తన స్వీయ రచన 'హింద్ స్వరాజ్' ప్రాధాన్యతా క్రమం తెలియని యువతకు ఒక కరదీపికలా ఉపయోగపడింది. గాంధీజీ దృష్టిలో అనైతిక లేదా పాప కార్యాలు ఏడు. అవి..... 1. సిద్ధాంత రహిత రాజకీయం 2. కష్టఫలం కాని సంపద 3. మనసాక్షి లోపించిన సుఖం 4. శీలం లేని జ్ఞానం 5. నైతికత లేని వాణిజ్యం 6 మానవతా లేని శాస్త్ర విజ్ఞానం 7. త్యాగం లేని ఆరాధన. యువత పైన ఉదహరించిన అనైతిక అంశాల పట్ల అప్రమత్తులై మెలగాలని ఆయన ఉద్బోధించారు. వ్యసనానికి ఆకర్షితులైన యువకులను ప్రేమతో చేరదీయాలని, వారు ఒక 'ప్రత్యేకమైన స్థితిలో ' వివేచన కోల్పోయి అలాంటి ఊబిలో కూరుకు పోయారని, వారికి క్రమ శిక్షణ కలిగిన జీవితం యొక్క విలువను తెలియచెప్పాలని కోరారు జాతి పిత.

తరాంతర ఘర్షణ గురించి ప్రస్తావిస్తూ యువత సహజంగానే వారి ముందు తరం వారిని నిర్లక్ష్యం చేస్తారని, కానీ హేతువు, అనుభవపూర్వక పాఠాలు ఎవరి వద్దనుండైనా స్వీకరించి వాటి ఆధారంగా ప్రతి విషయాన్ని పరీక్షించాలని పిలుపునిచ్చారు మహాత్ముడు. యువత సెలవు దినాల్లో గ్రామాలలో గడిపి అసలు సిసలైన భారతాన్ని అర్థం చేసుకోవాలని, అప్పుడే 'సేవాభావానికి' ఒక ప్రాతిపదిక ఏర్పడుతుందని బాపు ముక్తాయించారు. యువత సహనం, సంయమనం, మర్యాద, వినయం కోల్పోయినప్పుడు వినాశకారకులవుతారని ఆయన వలే ఆయన సమకాలికులెవరూ అంచనా వేయలేదు. అలాగే దేహ దారుఢ్యం,



భౌతిక శ్రమ, వ్యాయామం, సమతుల్య ఆహారం, నిరాడంబరతల ఆవశ్యకతను మహాత్ముని కన్నా చక్కగా ఎవరూ విశదీకరించలేదు. దేశంలో ఉన్నత విద్య విస్తరించేకొద్దీ ఉత్పన్నమవుతున్న కొన్ని పేద ధోరణులను గమనించి యువత వినయభూషణులై మెలిగి గురువులను గౌరవించాలని హితవు పలికారు. 1936 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి కొందరు విద్యార్థినులు తమను కొందరు యువకులు వేధించారని బాపుకు ఒక లేఖ వ్రాసారు. దానికి సమాధానంగా ఆయన వారు వేధింపుకు గురవ్వగానే అధికారులకు ఫిర్యాదు చేశారా, ఒక వేళ చేసివుంటే వారి స్పందన ఏమిటి అని వివరాలు అడిగారు. వెంటనే నాటి కులపతికి ఒక లేఖను వ్రాసారు. కానీ తన సహజ సిద్ధమైన పితృస్వామ్య ధోరణిలో యువతులు తమ వస్త్రధారణ పై కొంత శ్రద్ధ వహించాలని కోరారు. ఇలాంటి చిరు లోపాలు గాంధీజీ గొప్పతనాన్నిఈషన్మాత్రం తగ్గించలేవు. తన రచనలు, ప్రకటనలు, సందేశాల ద్వారా మహాత్ముడు, యువతను చైతన్యవంతులను చేసి వారిని శాంతి మార్గం లో పయనింపచేయడంలో సఫలీకృతుడయ్యారు.

# భారతీయ సివిల్ సర్వీసు ప్రయాణాలు - ప్రమాణాలు



డా. రేవూరు అనంత పద్మనాభరావు
✆ 98665 86805



"ఇనుపచట్రంగా" జవహర్‌లాల్ నెహ్రూచే అభివర్ణించవడిన సివిల్ సర్వీసుల పుట్టుపూర్వోత్తరాలు సుదీర్ఘం. రాజ్యాంగంలోని 308, 323 అధికరణాలలో కేంద్ర, రాష్ట్ర పబ్లిక్ సర్వీసు కమీషన్ల ఏర్పాటు నిబంధనలను పొందుపరచారు. భారత రాజ్యాంగంలోని 312వ ఆర్టికల్ IAS, IPS సర్వీసులను గూర్చి విస్తృతంగా పేర్కొంది. ప్రస్తుతం దేశవ్యాప్తంగా 5231 మంది IAS అధికారులు, (6746 శాంక్షన్ పోస్టులు) 3972 మంది IPS అధికారులు (4661 శాంక్షన్ పోస్టులు) అధికార యంత్రాంగానికి రెండు చక్రాలుగా పేరు గడించాయి.

బ్రిటీషు ప్రభుత్వ హయాంలో......

ఈస్టిండియా కంపెనీవారి హయంలో 1757లోనే Covenanted civil serviceలు మొదలయ్యాయి. (C.C.S) 1854లో బ్రిటీషు ప్రభుత్వం ఇండియన్ చార్డర్, 1853 ప్రకారం లార్డ్ మెకాలే కమిటీ వారు ప్రతిభ ఆధారంగా సివిల్ సర్వీసులకు ఎంపిక జరగాలని సూచించారు. 1886లో AITCHISON అనే ప్రముఖుడు సివిల్ సర్వీసుల్లో భారతీయులకు ప్రాతినిధ్యం ఇవ్వాలని సిఫారసు చేశాడు. అలా ప్రారంభమైన ఈ సర్వీసులో 1912 నాటికి 25 శాతం భారతీయులు ఎంపికయ్యారు. 1922లో తొలిసారిగా I.C.S పరీక్షలు నిర్వహించారు. 1926 అక్టోబరు 1న పబ్లిక్ సర్వీస్ కమీషన్ ఆఫ్ ఇండియా (ప్రస్తుత UPSC) ఏర్పాటైంది. భారతదేశ సివిల్ సర్వీసు పితామహుడిగా చార్లెస్ కార్నవాలిస్‌ను పేర్కొంటారు.

1864లో తొలి సివిల్ సర్వీసు అధికారిగా సత్యేంద్రనాథ్ టాగూరు ఎంపికయ్యారు. (ఆయన రవీంద్రనాథ టాగూరు సోదరుడు) కాని, సర్వీసులో చేరలేదు.



**భారతీయ వ్యవస్థ :-** అప్పట్లో I.P.S అధికారులు నిరంకుశంగా ప్రవర్తించసాగారు. అందువలన ఆ వ్యవస్థను రద్దు చేయాలని రాజ్యాంగ నిర్మాణ సభలో డిమాండ్ చేశారు. స్వాతంత్రానంతరం కూడా సివిల్ సర్వీసులు కొనసాగేలా సర్దార్ వల్లభాయ్ పటేల్ బ్రిటీషు వారిని వొప్పించారు. I.P.S అధికారులలో K.P.S మీనన్ తొలి విదేశాంగ శాఖ కార్యదర్శిగాను, చింతామణీ దేశముఖ్ రిజర్వు బ్యాంకు గవర్నరుగా, తొలి ఆర్థికశాఖ మంత్రిగా ప్రశస్తి గడించారు. తొలి IAS ఆఫీసర్లు 1947 నుండి పరిపాలన పగ్గాలు చేపట్టారు. తొలి IAS అధికారి ఆర్. పిళ్ళై క్యాబినెట్ కార్యదర్శి స్థాయి కెదిగారు. అన్నా రాజం మల్హోత్రా తొలి IAS మహిళా అధికారిణి. ఆంధ్రదేశానికి చెందిన యం. రామకృష్ణయ్య తొలిబ్యాచ్ అధికారి. ఒరిస్సా ప్రధన కార్యదర్శిగా, నేషనల్ అగ్రికల్చర్ బ్యాంకు ఛైర్మన్ గాను వ్యవహరించారు.

**పోలీసు వ్యవస్థ :-** I.C.S వ్యవస్థ 1948 లో ప్రారంభమైంది. తొలి అధికారి సి.వి. నరసింహన్. 1948 సెప్టెంబరు 15 రాజస్థాన్‌లోని మౌంట్ ఆబూలో వీరికి శిక్షణ మొదలైంది. 1975లో పోలీసు శిక్షణా సంస్థ సర్దార్ వల్లభాయ్ పటేల్ పేర హైదరాబాదులో ఆరంభమైంది. ఇప్పటివరకు 73 బ్యాచ్‌లలో దాదాపు 5922 మందికి శిక్షణ ఇచ్చారు.

ఢిల్లీలోని IAS శిక్షణా స్కూలు, సిమ్లాలోని IAS స్టాఫ్ కళాశాల రెండింటిని కలిపి 1959 లో నేషనల్ అకాడమీ ఆఫ్ అడ్మినిస్ట్రేషన్ ముస్సోరీలో ప్రారంభించారు. దానికి 1972లో లాల్ బహదూర్ శాస్త్రి పేర నామకరణం చేశారు. ప్రతిఏటా యు.పి. యస్.సి సివిల్ సర్వీసుల పరీక్షలు పారదర్శకంగా నిర్వహిస్తోంది. IAS, IPS, IFSతో బాటు మిగతా 20 దాకా కేంద్ర సర్వీసులకు ప్రిలిమినరీ, మెయిన్స్ పరీక్షలు నిర్వహించి, ఇంటర్వ్యూ ద్వారా సెలక్టు చేస్తున్నారు. ఏటా 850 నుండి 1100 వరకు ఖాళీలు ప్రకటిస్తారు. అందులో వందదాకా IAS, 80దాకా IPS అభ్యర్థులు ఎంపిక చేయబడతారు. వారికి రెండేళ్ళ శిక్షణ ఇస్తారు. మిగతావారు ఇతర సర్వీసులైన IRS, IA&AS, IPOS, IRTS తదితర ఆలిండియా సర్వీసులకు ఎంపికవుతారు.

**ఉత్తమ ప్రమాణాలు :-** దాదాపు మూడు దశాబ్దాలు 1950-80 మధ్య సివిల్ సర్వీసు అధికారులు ఉత్తమ ప్రమాణాలకు పెద్ద పీట వేశారు. ఆ రోజుల్లో ఒరిస్సా ముఖ్యమంత్రిగా వున్న నందినీ శతపథి పద్ధతి నచ్చక అప్పటి సీనియర్ IAS అధికారి యం. రామకృష్ణయ్య కేంద్ర సర్వీసులకు వెళ్ళిపోయిన సంఘటన గొప్పగా చెబుతారు. బదలీల లీలలకు భయపడక - "ఉద్యోగికిని దూరభూమి లేదు" అనే సిద్ధాంతాన్ని నమ్ముకొని, వ్యక్తిత్వాన్ని అమ్ముకోని అధికారులు వందల సంఖ్యలో వున్నారు. ఇప్పటివరకు అత్యున్నత క్యాబినెట్ కార్యదర్శి స్థాయి కెదిగిన ఒకే ఒక్క తెలుగు అధికారి టి.ఆర్. ప్రసాద్



బడుగు వర్గాల సంక్షేమానికి జీవితాన్ని అంకితం చేసిన నిరాడంబర వ్యక్తి యస్. ఆర్. శంకరన్. సివిల్ సర్వీసు అధికారులు పదవీ విరమణ చేశాక వారిని ఎలాంటి చట్టబద్ధ సంస్థలకు అధికారులుగా నియమించరాదని 2004 సంవత్సరంలో పి.సి హోతా కమిటీ వారు సిఫరసు చేశారు. కేంద్రంలో పలు కీలక పదవులలో పనిచేసిన ఐ.పి.యస్ అధికారులను పదవీ విరమణానంతరం పలు రాష్ట్రాలకు గవర్నర్లుగా నియమించడం గమనార్హం.

**'I' 'AM 'S'AFE :-** వారి పనితీరు ఎలావున్నా రాజ్యాంగబద్ధంగా వున్న రక్షణ కవచం వుండటం వల్ల చాలామంది IAS అధికారులు నేను క్షేమం - I AM SAFE అనే మనస్తత్వం పెంచుకొన్నారు. ఆశ్రిత పక్షపాతం, బంధుప్రీతి, లంచగొండితనం వామనావతార దశ నుండి విశ్వరూప సందర్శన స్థాయికి చేరింది. రాజకీయ నాయకులు, మంత్రులు వక్రగతిలో సూచించిన పనులు చేయకపోతే అధికారులు సుఖజీవనం చేయలేని పరిస్థితి ఏర్పడింది. పాలక పక్షము, ముఖమంత్రి అనుచరగణం చెప్పిన పనులు చేసి జైలుపాలయిన అధికారులున్నారు. సర్వీసులో చేరిన తొలి దశకంలోనే అక్రమార్జనకు పాల్పడిన అధికారులపై కేసులు బనాయించిన సంఘటనలు పత్రికల్లో చదువుతున్నాం. ఏటా సమర్పించవలసిన స్థిరాస్థి వివరాలను ఈ అధికారులు విస్మరించడం విస్మయం గొలుపుతుంది. బడా వ్యాపారవేత్తలతోను, కాంట్రాక్టర్లతోనూ లాలూచీ పడిన ఘటనలు వెలుగులోకి వచ్చాయి. రాజకీయ ఒత్తిళ్ళకు తలవొగ్గి వెన్నెముక లేని అధికారులుగా కొందరు ప్రవర్తిస్తున్నారు.

**రాజకీయాలలోకి :-** సివిల్ సర్వీసు అధికారులు పలువురు పదవులకు రాజీనామా చేసి ప్రత్యక్ష రాజకీయాలలోకి రావడం ఇటీవలి దశకాలలో చూస్తూనే వున్నాం. అజిత్‌జోగి, యశ్వంత సిన్హా, అరవింద కెజ్రివాల్, మీరాకౌర్, జె.డి శీలం, మణిశంకర్ అయ్యర్, నట్వర్ సింగ్, శశిధరూర్, హరదీప్ సింగ్ పూరి, రాజకుమార్ సింగ్, సత్యపాల్ సింగ్, అల్ఫాన్స్ కన్నంతన్.... ఈ చిట్టా పెద్దదే. కోట్లాది రూపాయలు ఖర్చుపెట్టి ఎన్నికలలో పోటీ చేయగల ఆర్థిక స్తోమత వీరికెక్కడినుండి వచ్చింది? అన్ని పార్టీలకు సంబంధించినవారు ఈ కోవలో వున్నారు. రాజకీయవేత్తలకు, అధికారులకు మధ్య విభేదాలు తీవ్రస్థాయిలో తలెత్తుతున్నాయి. అధికారుల ప్రవర్తనను ఉన్నతన్యాయస్థానం సైతం అభిశంసించిన సందర్భాలు లేకపోలేదు. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు వారు IAS అధికారులకు ఇటీవల సామాజిక శిక్ష విధించారు.

**జీతాలలో వ్యత్యాసం :-** క్యాబినెట్ కార్యదర్శి పదవి IASలో అత్యున్నతం, ఆయన జీతం మూడులక్షలు నెలసరికి దాటదు. సాఫ్ట్ వేర్ ఉద్యోగులు కొత్తల్లోనే ఈ మూడు లక్షల జీతాలు సంపాదిస్తున్నారు. డాలర్ల సంపాదనకు అవకాశం వుంది.

సామాజిక జీవన ప్రమాణాలు పెరిగి విలాసవంతమైన కారు, బంగళా, తదితర సుఖమయ జీవన ప్రపంచాన్ని చూసి అధికారులు ఇతరాత్రా సంపాదనకు ప్రయత్నాలు కొనసాగిస్తున్నారు. అయినా ఉన్నత ప్రమాణాలతో, నిబద్ధతతో సేవ చేస్తున్న వేలాధి అధికారులకు పాదాభివందనం. అధికార యంత్రాంగం పనితీరుపైనే దేశ పురోగతి ఆధారపడి వుంటుంది. వీరే మూల స్తంభాలు. సామాజిక, రాజకీయ జీవన ప్రమణాలు పెంచడంలో వీరు అకుంఠిత దీక్షతో పనిచేస్తున్నారు. ప్రధాన కార్యదర్శి లేదా పోలీసు డైరక్టర్ జనరల్‌గా పనిచేస్తున్న వ్యక్తులను ముఖ్యమంత్రులు అర్థంతరంగా అర్ధరాత్రి వేళ బదలీచేసి జూనియర్లను ఆస్థానంలో కూర్చోబెట్టే వ్యవస్థ మారాలి. పూర్వకాలంలో అధికారుల మాటకు, రాతకు మంత్రులు గౌరవము, విలువ నిచ్చేవారు. ఇప్పుడది కాలక్రమేణా అన్ని రంగాలలో విలువలు క్షీణించినట్లే. సివిల్ సర్వీసులలోను మసకబారుతోంది. అజాదీకా అమృత మహోత్సవ్ జరుపుకొంటున్న ఈ తరుణంలో సివిల్ సర్వీసు అధికార యంత్రాంగం పనితీరును విశ్లేషించవలసిన అవసరం ఎంతైనా వుంది. జయహో భారత్!

# ప్రకాశిక

గురజాడ ఫౌండేషన్ (అమెరికా) వారి
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపకులు శ్రీ శ్రీ గురజాడ
వేంకట అప్పారావు గారు

www.prakasika.org

## దీపావళి కథల పోటీ

**ప్రథమ బహుమతి : రూ. 2,500**

**ద్వితీయ బహుమతి : రూ. 1,500**

**తృతీయ బహుమతి : రూ.500**

**గురజాడ ఫౌండేషన్ (అమెరికా) వారిచే ప్రచురింపబడుతున్న చారిత్రాత్మక త్రైమాస అంతర్జాల తెలుగు పత్రిక 'ప్రకాశిక' నిర్వహిస్తున్న హాస్య, వ్యంగ్య కథల పోటీకి ప్రపంచ వ్యాప్తంగా ఉన్న తెలుగు వారినుంచి రచనలని ఆహ్వానిస్తున్నాము.**

* మీ రచన మీద సర్వహక్కులూ మీవే. కానీ దయచేసి ఇంకెక్కడైనా పరిశీలనలో ఉన్న కథలు, ఇది వరలో ప్రచురించబడిన రచనలు మరో రూపంలోనూ పంపంచవద్దు.
* మీ రచనతో పాటు అది మీ స్వంత రచన అనీ, దేనికీ అనుకరణ, అనుసరణ కాదని, మరే ఇతర సామాజిక మాధ్యమాలలోనూ, అంతర్జాల పత్రికలలోనూ ప్రచురితం కాలేదని, అలాగే పరిశీలనలో కూడా లేదని హామీ పత్రం విధిగా జతపరచాలి.
* మీ రచనలలో ఎవరినీ కించపరిచే వ్యాఖ్యలు గానీ, విమర్శలుగానీ ఉండకూడదు.
* కేవలం యూనికోడ్ (గూగుల్, లేఖిని మొదలైన వెబ్ సైట్లలో, గౌతమి మొదలైన ఫాంట్స్)లో టైపు చేసిన రచనలు మాత్రమే పరిశీలించబడతాయి. PDF, స్కాన్ చేసిన వ్రాత ప్రతులు, తదితర పద్ధతులలో వచ్చిన రచనలు పరిశీలించబడవు.
* మీ రచన పంపించే ముందు అచ్చుతప్పులు సరి చేసి పంపించండి. ఒకటికి పది సార్లు చదివి తప్పులు సవరించండి.
* కథల నిడివి 900 పదాలకి మించకూడదు. **హాస్య, వ్యంగ్య** కథలు మాత్రమే పంపాలి.
* ఐదు వాక్యాలకి మించకుండా మీ వ్యక్తిగత, సాహిత్య పరమైన విశేషాలు, మీ ఫోటో తప్పక జతపరచాలి.
* ప్రచురణకి ఎంపిక కాని రచనలను తిప్పి పంపడం సాధ్యం కాదు.
* బహుమతి పొందిన, మరియు సాధారణ ప్రచురణకు ఎంపికైన కథలు **'ప్రకాశిక'** అంతర్జాల త్రైమాస పత్రికలో ప్రచురితమవుతాయి.
* నిర్దేశిత కథల పోటీ గడువును పొడిగించేందుకు గానీ, పరిశీలనకి వచ్చిన కథల అర్హతను బట్టి బహుమతులలో మార్పులు చేసేందుకు గానీ నిర్వాహకులకి అన్ని హక్కులు ఉన్నాయి.
* కథల ఎంపికలో తుది నిర్ణయం నిర్వాహకులదే.
* ప్రచురణకి సంబంధించిన అన్ని విషయాలలో సర్వ నిర్ణయాధికారాలూ పత్రిక సంపాదకులవే.

మీ రచన పంపవలసిన ఈ–చిరునమా: editor@prakasika.org. సబ్జెక్ట్ లైన్లో 'ప్రకాశిక కథల పోటీ కోసం' అని రాయాలి.

**కథలు పంపించడానికి చివరి రోజు:**
**15 ఆగష్టు 2022**

**అన్ని విషయాలలోనూ మమ్మలని సంప్రదించవలసిన ఈ-చిరునమా: editor@prakasika.org**

